96/2.56

శ్రీ రామకవితా గ్రన్థమాలా

# వేదాన్తధర్మమఞ్జరీ

మోక్షప్రాసాద, విద్యార్థివిద్యోత, కలిభూషణాఖ్య
గ్రన్థత్రయాత్మకః

వెల్లంకొండ రామరాయకవీన్ద్ర విరచితః

సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తిశాస్త్రి
ధర్మపురి శేషగిరిశర్మభ్యాం
కృతాన్ధ్రానువాదః




వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి
...పేట.
...956

సర్వస్వామ్యసంకలితః] [మూల్యమ్ 2-8-0

శ్రీ హయగ్రీవాయ నమః

# బెల్లంకొండ రామకవికృతో మోక్షప్రసాదః

## * అథ కర్మసోపానమ్ *

1. చత్వారః పురుషార్థాః ధర్మోఽర్థః కామో మోక్షశ్చేతి. ఏతేషామన్యతమో హి పురుషేణార్థ్యతే సుఖాయ, తత్ర ధర్మాదయస్త్రయోఽనిత్యాః మోక్షస్తు నిత్యః ధర్మాదయ ఇష్టాపూర్తాదిసాధనజన్యాః మోక్షస్తు పదార్థతత్త్వజ్ఞానాధీనః.

---

1. ధర్మార్థ కామమోక్షము లనబరగి, పురుషార్థములు నాల్గువిధముల విఖ్యాతములైనవి. సుఖాభిలాషగల పురుషులువీని నర్థింతురుగాన నివిపురుషార్థము లనబడుచున్నవి. అందు ధర్మార్థకామములను మూడు ననిత్యములు. మోక్షము మాత్రమే నిత్యమైనది. పుట్టుకగల ప్రతిపదార్థమునకును గిట్టుటయు తప్పనిసరియైయుండుట లోకస్వభావసిద్ధమగు విషయము. ధర్మార్థకామములుసైత మిష్టాపూర్తాదిసాధనములచే పుట్టునవియైగాన నవియు ననిత్యములుగాక తప్పదు. మోక్షమట్లు పుట్టినదిగాదు, అదిపదార్థతత్త్వజ్ఞానముపై నాధారపడియున్నది.

2. పదసంబంధ్యభిధావిషయః పదార్థః విభక్త్యంత పదమ్ విభక్తయస్స్వాదయః తిఙాదయశ్చ. సచపదార్థోద్వివిధఃసన్ ఆసంశ్చేతి శశశృంగాదిరసత్పదార్థః సత్పదార్థస్త్రివిధః పారమార్థికోవ్యావహారికః ప్రాతిభాసికశ్చేతి ఆత్మైకఏవపారమార్థికః రజ్జుసర్పాదిః స్వప్నరథాదిశ్చప్రాతిభాసికః తదుభయభిన్నో వ్యావహారికః అస్యైవప్రపంచఇతివ్యవహారః.

3. ప్రపంచోద్వివిధః నామప్రపంచోరూప ప్రపంచ

---

2. సుప్తిఙ్గాది విభక్తిప్రత్యయములు చేరిన శబ్దము 'పద' మనబడును. అట్టిపదమునందుండెడి యర్థమును బోధించునట్టి సామర్థ్యవిశేషమునకు 'అభిధ' యనిపేరు. అందు విషయమగునదియే పదార్థము. అనగా—నాయా పదములచే బోధింపఁబడెడి యర్థవిశేషమే పదార్థమని ఫలితాంశము. సదసద్భేదముచే నీపదార్థము ద్వివిధము. శశశృంగము (కుందేటి కొమ్ము) మున్నగునవి యసత్పదార్థములు. సత్పదార్థములు పారమార్థికములనియు, వ్యావహారికములనియు, ప్రాతిభాసికములనియు త్రివిధములుగానున్నవి. అందాత్మపదార్థ మొక్కటియే పారమార్థికము. భ్రమవశమున భాసించెడి రజ్జుసర్పాదులు స్వప్నరథాదులును ప్రాతిభాసిక పదార్థములు. ఈరెంటికన్న భిన్నమైన పదార్థజాతమంతయు వ్యావహారికమే. ఇదియే ప్రపంచమని వ్యవహరింప బడుచున్నది.

3. ప్రపంచము నామరూపములచే ద్వివిధమై యొప్పా

శ్చేతి, రూపప్రపంచోద్వివిధః చేతనోఽచేతనశ్చేతి చేతనఃపున ర్ద్వివిధః చరోఽచరశ్చేతి తత్రతరుగుల్మలతాదయోఽచరాః తదపేక్షయా పశుపక్ష్యాదయశ్చరాఅల్పసంఖ్యాకాః చరేషుచ పశ్వాద్యపేక్షయామనుష్యావిరళాః మనుష్యేషు చ శూద్రాద్యపేక్షయాద్విజావిరళతరాః బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాశ్చ ద్విజాః ఉపనయనాదిసంస్కారప్రయుక్తద్వితీయజన్మశాలినో హ్యేతే, ద్విజేషు చ బ్రాహ్మణావిరళతమాః ఇయంచమనుష్యజాతిః సత్త్వప్రధాన దేవజాత్యపేక్షయాఽపకృష్టాపి తమఃప్రధానపశ్వాదిజాత్యపేక్షయోత్కృష్టత్వాత్సుదుర్లభా."

---

రుచున్నది. అందురూపప్రపంచము చేతనమనియు, చేతనమనియు రెండుగకములుగా నున్నది. చెతనప్రపంచముసైతము చరాచర భేదమున విభక్తమైయున్నది. అందు తరుగుల్మలతాదుల చరములు, పశుపక్ష్యాదులు చరములు (సంచారసామర్థ్యములు గలవి.) ఆచరములకన్న చరములు స్వల్పసంఖ్య గలవైయున్నవి. చరములలోగూడ పశ్వాదులకన్న మనుష్యులసంఖ్య స్వల్పము. అందు నుపనయనాదిసంస్కారప్రయుక్తమగు ద్వితీయజన్మ గలవారగుటంజేసి ద్విజులనబడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య జాతీయులసంఖ్య స్వల్పతరము. ఈమువ్వురిలో సైతము బ్రాహ్మణులసంఖ్య స్వల్పతమము ఇమ్మనుష్యజాతి సత్త్వగుణ ప్రధానమగు దేవజాతికన్న నికృష్టమే యైనను. తమోగుణ ప్రధానమగు పశుపక్ష్యాదిజాతికన్న నుత్కృష్టముగాన మిక్కిలి దుర్లభమైనది.

4. యద్యపి పశ్వాదీనాంమనుజానాంచ నిద్రాహారభయమై థునేష్వవిశేషః,తథాపిపురుషార్థసాధనానుష్ఠానక్షమామనుజాః తద్విధురాస్తు పశవః అతఏవ మనుష్యజన్మసుకృతాతిశయల భ్యమ్ తథాచోక్తమ్ భగవతాబాదరాయణేన "శ్లో॥ లబ్ధ్వా సుదుర్లభమిదంబహుసంభవాంతేమానుష్య మర్థదమపీహాధీరః తూర్ణంయతేతనపతేదనుమృత్యుయావన్నిశ్శ్రేయసాయవిష యఃఖలుసర్వతఃస్యాదితి"తస్మాదస్మాభిరస్మిన్నేవజన్మని మోక్ష

---

4. నిజమునకు నిద్ర ఆహారము. భయము, మైథునము మున్నగునంశములం బరిశీలించితిమేని యుభయులకు సమాన మేయగుటంజేసి పశువులకన్న మనుజుల గొప్పతనమేమియు నుండబోదు. మరేమన పశువులు పురుషార్థమును సాధించు కొను సామర్థ్యము దక్కియుండుటచే మనుజులట్టిసామర్థ్యము గలవారై యుండుటయు మాత్రమే విశేషము. కావుననే మానవజన్మ మహత్తర పుణ్యావిశేషమునగాని లభింపదు. వ్యాసభగవానుడు- లబ్ధ్వాసుదుర్లభ- సర్వతస్స్యాత్ (అత్యంత దుర్లభమగు మానవశరీరము బహుజన్మతపఃఫలముగ లభించును. ఇదియు శాశ్వతముగాదు. మృత్యువు నిత్యసన్నిహితమై యుండును. కావున దానికి వశుడగుటకుమున్నే నిశ్శ్రేయసలబ్ధికై సత్వరము ప్రయత్నము సలుపవలయును.) అని చెప్పి యున్నాడు. కావున మనమీజన్మముననే మోక్షప్రాసాదము నధిరోహింప నుద్యమించుటెంతయు సమంజసము సోపాన

ప్రాసాదస్సమధిగంతవ్యః॥:—సచవినాసోపానావలంబనందురధిగమః తస్యచసోపానత్రయమస్తి కర్మ జ్ఞానం భక్తిశ్చేతి.

5. తత్రతావత్కర్మసోపానస్వరూపం నిరూప్యతే కర్మసోపానమారూఢస్యైవ జ్ఞానసోపానారోహణాధికారాత్ నహి ప్రథమంసోపాన మనారూఢః పురుషోద్వితీయంసోపాన మారోఢుంక్షమతేఇతి:- క్రియతఇతికర్మ తత్త్రివిధం కాయికం వాచికం మానసికఞ్చేతి తత్రకాయేననిర్వర్త్యంకాయికం వాచానిర్వర్త్యంవాచికం మనసానిర్వర్త్యంమానసికమితివివేకః త్రివి

---

క్రమము నాదరింపనిచో నీమోక్షప్రాసాదము నెక్కుట యశక్యము. కర్మ, జ్ఞానము, భక్తియనునవియే మోక్షప్రాసాదమునకు సంబంధించిన ముఖ్యములగు మూడు సోపానములు.

5. అందు ముందుగ కర్మసోపానమును నిరూపింతుము ఏలనన జ్ఞానసోపానము నధిరోహింపవలెనన్న నంతకుముందె కర్మసోపానము నధిరోహించియుండుట తప్పనిసరియగుచున్నది మొదటిమెట్టు నెక్కనివాడు రెండవమెట్టు నెక్కజాలడను విషయ మందఱు నెరింగినదియేగదా! “క్రియతఇతికర్మ” అను వ్యుత్పత్తిననుసరించి మనము మనోవాక్కాయములను త్రికరణములచేఁ జేయుపని యంతయు ‘కర్మ’ యని వ్యవహరింపబడుచున్నది. అందుకాయము (శరీరము)చే నిర్వర్తింపబడు కర్మకాయికమనియు, వాక్కుచే నిర్వర్తింపబడునది వాచికమనియు, మనస్సుచే నిర్వర్తింపబడునది మానసికమనియు

ధమపి తత్పునర్ద్వివిధం సాధ్వసాధు చేతి పురుషార్థసాధనం శ్రుత్యాదివిహితం కర్మసాధు పాపహేతుభూతం శ్రుత్యాదినిషిద్ధం కర్మాసాధు" తచ్చసాధుకర్మద్వివిధం సకామం నిష్కామంచేతి తత్రసకామం త్రివర్గసాధనం నిష్కామంతు మోక్షసాధనమ్ తస్మాన్ముముక్షుః స్వవర్ణాశ్రమానురోధేన శ్రుత్యాదివిహితం కర్మఫలాభిసంధింవిహాయ విదధ్యాత్పరమేశ్వర ప్రీత్యర్థమితి సిద్ధాంతః"

6. ఏవం స్వాజ్ఞారూప శ్రుతిస్మృతిచోదితకర్మణాం నిష్కా

---

మూడువిధముల నీకర్మ విభక్తమైయున్నది. ఈత్రివిధమగు కర్మలయందును మరల సాధ్వసాధువిభాగము చేయబడియున్నది. అనగా-శ్రుతివిహితమై పురుషార్థ సాధనసమర్థమై యుండునదియెల్ల సాధుకర్మమనియు శ్రుతినిషిద్ధమై పాపహేతుభూతమగునది యంతయు నసాధుకర్మమనియు గ్రహించునది. సాధుకర్మమైతము సకామమనియు, నిష్కామమనియు రెండు రీతులనుండును. సకామము త్రివర్గమనబడెడి ధర్మ-అర్థ-కామములను మాత్రమే సాధింపగల్గును. నిష్కామకర్మ మోక్షసాధనము. కావున ముముక్షువు (ముక్తినందగోరువాడు,) తన వర్ణమునకును, దనయాశ్రమమునకును దగినట్లు శ్రుతిస్మృత్యాదులందు విహితమగు కర్మను ఫలాభిలాషను విడనాడి పరమేశ్వర ప్రీత్యర్థముగ ననుష్ఠింపవలెనని శాస్త్రసిద్ధాంతము.

6. ఇట్లు నిజాజ్ఞారూపములగు శ్రుతిస్మృతులచే విహిత

మమనుష్ఠాతరి పరమేశ్వరస్యానుగ్రహో జాయతే తతస్సత్త్వశుద్ధివశాత్పురుషస్య జ్ఞానసోపానారోహణ సామర్థ్యముత్పద్యతే, యస్తు విహితమేవకర్మసకామంకరోతి సఈశ్వరవిహితాన్తాంస్తాన్కామాన్లభతే యఃపునర్నాస్తికతయా విహితంన కరోతి అవిహితంచకరోతి తస్యపాపీయసఃస్థావరాది జన్మప్రాప్తి లక్షణో నరకానుభవః.

7. యద్యపి మీమాంసకా విహితంకర్మకుర్వంతి తథాపి న. తే ప్రకృతసోపానాధిరూఢాః తేషాం సకామత్వాత్, తైః కర్మ ఫలప్రదాతురీశ్వరస్యానభ్యుపేతత్వాచ్చ. న చ కర్మైవ ఫలం

---

మగు కర్మను నిష్కామముగ ననుష్ఠించు వానిపైని పరమేశ్వరుడనుగ్రహించును. అట్టుపైచిత్తముసత్త్వపరిశుద్ధముకాగా జ్ఞానసోపానము నధిగమించుటకనువగు సామర్థ్యముదయించును. విహితకర్మలు సకామముగ ననుష్ఠించువాడు పరమేశ్వరునిచేతనే సంకల్పింపబడినట్టి ఆయాఫలములఁ బడయును. ఎవడు నాస్తిక్యముచే విహితకర్మనుమాని, నిషిద్ధకర్మననుష్ఠించుచుండునో అట్టిపాపాత్మునకు తరుగుల్మ లతాది జన్మప్రాప్తిమూలమున నరకానుభవము సంప్రాప్తమగును.

7. మీమాంసకులు విహితకర్మ ననుష్ఠించువారే యైనను, వారికర్మానుష్ఠానమంతయు ఫలాభిసంధి పూర్వకమగుటచేతను, కర్మఫలప్రదాతయగు నీశ్వరుని వారంగీకరింపక పోవుటవల్లను ప్రకృతమగు కర్మసోపానారూఢులనుగ

ప్రదత్తే కిమీశ్వరేణేతి వాచ్యం. జడస్య కర్మణః ఫలప్రదానాయోగాత్ "అనేన పురుషేణ కృతమిదం కర్మ తస్య చేదం ఫలం దేయమితి విదుషా హి భావ్యం కర్మఫలప్రదాత్రా. నను జడమపి కర్మ ఫలం ప్రదద్యాదేవ. జడో వహ్నిరివ శీతాపహ్నుతిం సేవకస్యేతి చేన్నైవమ్. ఫలసమయే కర్మణ ఏవాసత్త్వాత్. ఇహ లోకే కృతస్య కర్మణో జ్యోతిష్టోమాదేః ఫలం హి

---

వారిని బరిగణింప గూడదు.

ప్ర:-కర్మయే ఫలమునిచ్చునుగదా! అట్టిచో ఈశ్వరు నంగీకరించవలసిన యవసరమేమి?

ఉ:-కర్మ జడముగాన నది స్వతంత్రముగ ఫలమునీయ జాలదు. ఏలయన, కర్మఫలప్రదాతయగువాడు—"ఈపురుషు డీకర్మ ననుష్ఠించినాడు. దానికీఫలమీయవలెను" అనువివేకము గలవాడై యుండవలెనుగదా! ఇట్టివివేకము జడమున కెట్లు ఘటించును?

ప్ర:-జడమగు నగ్ని తన్ను సేవించువానికి చలిబాధను తొలగించునట్లు కర్మ జడమయ్యు ఫలమీయవచ్చునుగదా!

ఉ:-అట్లుకాదు. ఏలనన, ఫలానుభవకాలమునకీకర్మయే యుండుటలేదు. "కార్యనియత పూర్వవృత్తి కారణమ్" అనునియమము ననుసరించి కార్యమగు ఫలోత్పత్తికి గారణమని జెప్పబడుకర్మ అవ్యవహిత పూర్వక్షణమున నుండి తీరవలయునుగద! ఇహలోకమునం దనుష్ఠింపబడిన

స్వర్గసుఖం.పరలోకే నుభూయతే,యజ్వనా కాలాన్తరే న హి పరలోకే కర్మాస్తి. న చ కర్మజన్యమపూర్వం స్వర్గాదిఫల ప్రదమస్తీతి వాచ్యమ్.అవస్తుత్వాదపూర్వస్య.లోకేపి యథా చౌర్యం చోరం రాజైవ శిక్షయతి న తు చౌర్యం.యథా సేవం భృత్యం రాజైవ పుష్ణాతి,న తు సేవా. కిం చ మీమాంసకమతే మోక్ష ఇతి కశ్చిత్పురుషార్థో నాస్త్యేవేతి దుష్టం. తన్నైవాను స్వీకర్తవ్యం ముముక్షుణా.

---

జ్యోతిష్టోమాది కర్మజాత మప్పటికప్పుడే నశించిపోవుచుండ, నది కాలాంతరమునం దనుభవింపదగిన స్వర్గాదిఫలముల నీయజాలు టెట్లు?

ప్ర:-కర్మనశించిన నేమి? కర్మజన్యమగు నపూర్వము ఫలపర్యంతముండునుగదా! అదియే కర్మఫలములగు స్వర్గాదుల నిచ్చును. అట్టిచో నీశ్వరుడేల?

ఉ:- “ అవస్తుత్వాద పూర్వస్య ” అనుటలో గ్రంథకర్త్రభిప్రాయ మేమో వ్యక్తమగుట లేదు. అపూర్వమొక వస్తువేకాదు. ఇకనది ఫలమిచ్చు టెట్లు? లోకన్యాయమును బరికింపుము! దొంగను నాతడుచేసిన దొంగతనమునకు దగినట్లు ప్రభువే శిక్షించునుగాని, దొంగతనము శిక్షించుట లేదు. అట్లే సేవకుని నాతడు చేసిన సేవకనుగుణముగ ప్రభుచే పోషించునుగాని సేవయే పోషించుట లేదు. ఇంతియేగాదు మీమాంసక మతమునందు మోక్షమను నొక ప్రత్యేకపురుషార్థమే లేదు. కాన ముముక్షునట్టి దుర్మతము నంగీకరింపరాదు.

8. న చాశ్రౌతత్వాదసిద్ధ ఏవ మోక్ష ఇతి వాచ్యమ్। "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతీతి" శ్రుతేః. బ్రహ్మభావలక్షణత్వాన్మోక్షస్య. న చ బ్రహ్మేతి. కిఞ్చిద్వస్తు నాస్తీతి వాచ్యమ్, సద్రూపస్య బ్రహ్మణోఽసత్త్వాయోగాత్ న చ బ్రాహ్మణస్సద్రూపత్వే మానాభావః. "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాఽద్వితీయం బ్రహ్మేతి" శ్రుతేస్సత్త్వాత్. నచోపనిషదాము

---

8. ప్ర:-అసలు మోక్షమనునదియే సిద్ధింపదు. దీనిని వేదము ప్రతిపాదించుటలేదు.

ఉ:-అదిసరికాదు. "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" (బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మయే యగుచున్నాడు.) అనుశ్రుతి ననుసరించి బ్రహ్మ భావస్థితియె మోక్షమని సిద్ధించుచున్నది.

ప్ర:-బ్రహ్మయను నొకవస్తువున్నేగదా యిదియంతయు ఘటించుట! అసలట్టివస్తువు గలదనుటకు ప్రమాణము మాత్రమేమున్నది?

ఉ:-సద్రూపమగు బ్రహ్మములేకపోవుట యెట్లుఘటించును? సదేవసోమ్యేదమగ్రఆసీత్" "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిప్రమాణమువలన బ్రహ్మ వస్తువుగలదనియు, నయ్యది సద్రూపమనియు, దెలియుచుండ ప్రమాణము లేదనుట యసంగతము.

ప్ర:- వేదమునందలి విధివాక్యములు కర్తవ్యార్థము న.. మ ప్రవృత్తిసంపాదించియు, అకర్తవ్యార్థమునందు నివృ

క్రియార్థత్వేనానర్థక్యాదప్రామాణ్యమితి వాచ్యమ్. మంత్రార్థవాదాదీనామివోపనిషదామప్యక్రియార్థానాం ప్రామాణ్యస్యేష్టత్వాత్. అనధిగతాబాధితార్థబోధకత్వేనోపనిషదామేవ ప్రమాణత్వాచ్చ. నన్వస్తు బ్రహ్మభావో మోక్షస్తథాపి స కర్మసాధ్య ఏవేతి చేన్నైవమ్, "నాస్త్యకృతః కృతేనేతి" శ్రుతేః. మోక్షస్య కర్మసాధ్యత్వే సత్యనిత్యత్వప్రసంగాద్యత్కృతకం తదనిత్యం హి, తస్మాన్నిత్యసిద్ధో మోక్షో న కర్మసాధ్యః.

---

త్తిని గల్గించియు సార్థకములై ప్రమాణము లగుచున్నవి. ఉపనిషత్తులీరెండువిధములగు నర్థములనుగాక సిద్ధార్థబోధకములగుటవలన వీనికి ప్రయోజనము శూన్యము. కావుననివి ప్రమాణములుగాఁజాలవు.

ఉ:- వేదములోని మంత్రములకును, అర్థవాదవాక్యములకును అవి కర్తవ్యార్థబోధకములుగాకున్నను ప్రామాణ్యము నంగీకరింపలేదా? అట్లే యుపనిషద్వాక్యములకు ప్రామాణ్యము నంగీకరించుట న్యాయ్యము. మఱియు ప్రమాణాంతరముచే ప్రాప్తించనట్టియు, బాధితముగానట్టియు విషయమును ప్రతిపాదించుటంజేసి యుపనిషత్తులు తప్పక ప్రమాణము లగుచున్నవి.

ప్ర:- బ్రహ్మస్వరూపియగుటయే మోక్షముగానిండు. కాని అది కర్మవలననే సిద్ధింపవచ్చునుగద!

ఉ:- అట్లుకాదు. మోక్షము కర్మసాధ్యమే యగునో

నచైవం జ్ఞానాదపి న మోక్షఇతి వాచ్యం.నిత్యసిద్ధమోక్షావా
రకావిద్యాతమోనిరసనార్థం జ్ఞానసూర్యస్యావశ్యకత్వాత్ ,న
చ"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయ"ఇతి గీతా
వచనాత్కర్మణా మోక్షఇతి వాచ్యం.సంసిద్ధిశబ్దస్య చిత్తశుద్ధ్య
ర్థత్వాత్,తస్మాచ్చిత్తశుద్ధ్యర్థమధికృతేన విహితం కర్మేశ్వ
రార్పణబుద్ధ్యా కార్యమ్॥ "తమేతం వేదానువచనేన బ్రహ్మణా

---

నదియనిత్యము గావలసివచ్చును. "నాస్త్యకృతఃకృతేన"యను శ్రుతి యీయర్థము నుపదేశించుచున్నది. 'కృతమగునదియెల్ల యనిత్యము'నువిషయములోకానుభవసిద్ధ మేగదా! కావున నిత్యసిద్ధమగు మోక్ష మెన్నడును కర్మసాధ్యముగాదు.

ప్ర.-మోక్షము నిత్యసిద్ధమేయగుచో నిక జ్ఞానము మాత్ర మెందులకు?

ఉ:-నిత్యసిద్ధ మోక్షస్వరూపము నావరించియుండెడి యవిద్యాంధకారమును దొలగించుటకు జ్ఞానసూర్యప్రభ యెంతేని యావశ్యకము.

ప్ర:-"కర్మణైవహిసంసిద్ధిమాస్థితాజనకాదయః" అను భగవద్గీతా వచనమునుబట్టి సంసిద్ధి (మోక్షము) కర్మసాధ్యమని దెలియుచున్నదిగదా!

ఉ:-అట్లుకాదు. అచటి 'సంసిద్ధి' శబ్దమునకు చిత్తశుద్ధి యని యర్థము. కావున చిత్తశుద్ధికై దమతమ యధికారమునకుఁ దగినట్లు పరమేశ్వరార్పణబుద్ధితో గర్మననుష్ఠింపవలెను.

వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన ” ఇతి శ్రుతేః.

9. తచ్చ కర్మ ద్విజస్య యజ్ఞాధ్యయనదానాత్మకమ్. ఇజ్యాఽధ్యయనదానాని పావనాని మనీషిణా”మితి గీతావచనాత్ .తత్ర దేవపూజా ఇజ్యా, స్వాధ్యాయో ఽధ్యయనం, దేశే కాలే పాత్రే చ ద్రవ్యత్యాగో దానమితి వివేకః.

శూద్రస్య ద్విజాతిశుశ్రూషణమేవ కర్మ,ద్విజేషు చ బ్రాహ్మణస్య చత్వార ఆశ్రమాః.బ్రహ్మచర్యం గార్హస్థ్యం వానప్రస్థత్వం సన్న్యాసశ్చేతి: తత్ర సన్న్యాసవ్యతిరిక్తాస్త్రియః

---

ఈవిషయమును “తమేతం వేదానువచనేనతపసాఽనాశకేన” అనుశ్రుతి బోధించుచున్నది.

9. “ఇజ్యాధ్యయనదానాని పావనానిమనీషిణామ్” అనుగీతావచనము ననుసరించి ద్విజులనబడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు ఇజ్య, అధ్యయనము. దానము. అను మూడువిధములగు కర్మలు ఆచరణీయములు. ఇజ్యయనగా దేవతాపూజ. అధ్యయనమనగా వేదాభ్యాసము. దానమనగా సముచితములగు దేశకాలపాత్రములందు విహితమగు ద్రవ్యమును స్వస్వత్వనివృత్తి పూర్వకముగ సమర్పించుట యని గ్రహించునది. శూద్రునకు ద్విజశుశ్రూషణమె ముఖ్యకర్మ ద్విజులలో బ్రాహ్మణునకు బ్రహ్మచర్య, గార్హస్థ్య, సన్న్యాసము లనఁబడు నాలుగాశ్రమములును విహితములైయున్నవి.

క్షత్రియవైశ్యయోః, బ్రాహ్మణో నిర్వేదమాయాదితి శ్రుతేః. బ్రాహ్మణేన విధివదూఢాయాం బ్రాహ్మణ్యాముత్పన్నో బ్రాహ్మణః అముఖ్యోయం బ్రాహ్మణశ్శూద్రసమః అయమే వోపనయనాదిసంస్కారవశాద్ద్విజో భవతి. వేదపాఠేన విప్రో భవతి. బ్రహ్మజ్ఞానేన తు ముఖ్యో బ్రాహ్మణో భవతి. "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః, వేదపాఠేన విప్రస్స్యాద్బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణ ఇతి స్మృతేః. తత్ర వానప్రస్థాశ్రమః కలియుగే నిషిద్ధః.

---

క్షత్రియ వైశ్యులకు సన్న్యాసముగాక తక్కిన మూడాశ్రమములు మాత్రమే. "బ్రాహ్మణో నిర్వేదమాయాత్" అను శ్రుతి యీయర్థమును సూచించుచున్నది. బ్రాహ్మణునకు యథాశాస్త్రముగ పెండ్లాడిన బ్రాహ్మణ స్త్రీయందు బుట్టినవాడె బ్రాహ్మణుఁడనఁబడును. ఈతఁడు వస్తుస్థితిలో శూద్రుఁడు గాకున్నను పరినిష్ఠిత బ్రాహ్మణత్వము లేకపోవుటం జేసి శూద్రసముఁడగుటచే 'శూద్రు'డని వ్యవహరింప బఁడుచున్నాఁడు. ఇట్టి బ్రాహ్మణుఁడె యుపనయనాది సంస్కారములచే 'ద్విజు'డగుచున్నాఁడు. వేదాధ్యయనముచే విప్రుఁడనబడుచున్నాఁడు. బ్రహ్మజ్ఞానముచే నీతని బ్రాహ్మణత్వము పరినిష్ఠిత మగుచున్నది, "జన్మనాజాయతే శూద్రః కర్మణా జాయతె ద్విజః, వేదపాఠేన విప్రస్స్యాద్బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః" అను స్మృత్యర్థమిదియే. పూర్వము చేరొక్కన్న

10. బ్రహ్మచారిగృహస్థయతిధర్మా మన్వాదిభిరసాంకర్యేణ ప్రతిపాదితాః. "స్నానం సంధ్యా జపో హోమో౽ధ్యయనమధశ్శయనమష్టాంగమైథునాభావః దండధారణం గురుకులవాసః క్షౌరాభ్యంజన కేశప్రసాధనాద్యభావః, భిక్షాటనం" చేతి బ్రహ్మచారిధర్మాః, స్నానం సంధ్యా జపో హోమపూర్వా వైశ్వదేవమగ్నిహోత్రం దేవబ్రాహ్మణాతిథిపూజనం స్వాధ్యాయస్తల్పశయనమృతౌ దారగమనం నిశిపరదారాద్యగమనం

---

యాశ్రమ చతుష్టయమునందును వానప్రస్థమనునది గలియుగమున గ్రాహ్యముగాదని శాస్త్రముపదేశించుచున్నది.

10. బ్రహ్మచారి, గృహస్థ, యతిధర్మములను మన్వాది మహర్షులు స్పష్టముగ నుపపాదించిరి. స్నానము, సంధ్యావందనము, జపము, అగ్నికార్యము, వేదాధ్యయనము, అధశ్శయనము. స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణంగుహ్యభాషణమ్. సంకల్పో౽ధ్యవసాయశ్చ క్రియానిర్వృతి రేవచ. ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తిమనీషిణః, విపరీతం బ్రహ్మచర్యమేతదేవాష్టలక్షణమ్. అష్టాంగమైథున వర్జనము, దండధారణము. గురుకుల (గృహ) నివాసము. క్షౌరాభ్యంజన (తలంటుకొనుట) కేశప్రసాధనా (తలదువ్వుకొనుట) దులమానియుండుట, భిక్షాటనము ఇత్యాదులు బ్రహ్మచారి ధర్మములు. స్నానసంధ్యాజపహోమములు, వైశ్వదేవము, అగ్నిహోత్రము. దేవబ్రాహ్మణా తిథిపూజనము, స్వాధ్యాయాభ్యసనము, తల్పశ

స్వగృహవాసః క్షౌరాభ్యంజన కేశప్రసాధనాదిసద్భావః, యతి
భ్యో భిక్షాప్రదానం చేతి గృహస్థధర్మాః,శిఖాయజ్ఞోపవీతపరి
త్యాగః దండకమండలుధారణం కాషాయాంబరపరివేష్టన మే
కైకరాత్రా వేకైకగ్రామేనివాసః,భిక్షాన్నాశనమష్టాఙ్గమైథు
నాభావః స్నానం సన్ధ్యా హోమాదికర్మాభావః, వేదాంత
శ్రవణం తదర్థమననం యమనియమాద్యష్టాంగయోగానుష్ఠానం
సచ్ఛిష్యేభ్యస్తత్త్వోపదేశశ్చేతి యతిధర్మాః" తథా బ్రాహ్మ

---

యనము, ఋతుకాలమున రాత్రులందు భార్యాసంగమము,
పరదారాపరిహరణము, స్వగృహవాసము, క్షౌరాభ్యంజన కేశ
ప్రసాధనాదులు గల్గియుండుట, యతిబ్రహ్మచారులకు భిక్షనొ
సంగుట మున్నగునవి గృహస్థధర్మములు. శిఖాయజ్ఞోపవీత
పరిత్యాగము, దండకమండలుధారణము, కాషాయవస్త్రముల
గట్టుకొనుట, గ్రామైకరాత్రముగ నివసించుట, భిక్షాన్నభక్ష
ణము, అష్టాంగమైథునవర్జనము, స్నానసంధ్యా హోమాది
కర్మలు లేకయుండుట, వేదాంతమును శ్రవణముచేయుట, తద
ర్థమును మననము గావించుట, యమనియ మాద్యష్టాంగ
యోగమునసుష్ఠించుట, సచ్ఛిష్యులకు తత్త్వోపదేశముఁజే
యుట మొదలగునవి యతిధర్మములు. అట్లే బ్రాహ్మణునకు
యాజనాధ్యాపన ప్రతిగ్రహములు, క్షత్రియునకు యుద్ధము,
పన్నులఁదీసికొనుటయు, వైశ్యునకు కృషివాణిజ్యగోరక్షణము
లును, శూద్రునకు ద్విజశుశ్రూషయు వృత్త్య (జీవికానిర్వ

ణాన్యే యాజనమధ్యాపనం ప్రతిగ్రహశ్చేత్యయం వృత్త్యర్థో ధర్మః. క్షత్రియస్య యుద్ధం కరాదానం చేతి. వైశ్యస్య కృషిర్వాణిజ్యం గోరక్షణం చ. శూద్రస్య ద్విజసేవేతి.

11. సర్వైర్వర్ణిభిరాశ్రమిభిశ్చ స్వధర్మ ఏవానుష్ఠాతవ్యః "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాదితి" స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహ ఇతి చ గీతా వచనాత్. తే చ స్వధర్మాః కేచిత్కాయేన కార్యాః, అన్యే వాచా, పరే మనసా, కతిచిత్త్రితయేనాపి. తత్ర యస్త్రితయేన క్రియతే జపాదిస్స ధర్మ ఉత్తమోత్తమః. యో మనసా స ఉత్తమః. యో వాచా స మధ్యమః. యః కాయేన కేవలం

---

హాసార్థములగు ధర్మములు.

11. ఆయా వర్ణములకును, ఆశ్రమములకుఁ జెందినవారందఱును వారివారికి శాస్త్రముచే విహితమగు-స్వధర్మమునే యనుష్ఠింపవలయును. "శ్రేయాన్ స్వధర్మ విగుణః" అను గీతా వచన మీయర్థమును బోధించుచున్నది. స్వధర్మములలో కొన్ని కాయికములును, మరికొన్ని వాచికములును, వేరొక కొన్ని మానసికములును, నింకను కొన్ని మనోవాక్కాయముల మూడింటనుగూడ నిర్వర్తింపఁదగినవై యుండును. అన్నిటిలోఁగూడ త్రికరణములచే సాధ్యమగు జపాదికమే యుత్తమోత్తమ ధర్మము. మానసికము త్తమము. వాచికము మధ్యమము. కేవలము కాయికమగు స్నానాదిక మధమము. జల

స్నానాదిస్సపునరధమః.తత్ర జలస్నానభస్మస్నానాదినా శరీర శుద్ధిః.స్వాధ్యాయాదినా వాక్శుద్ధిః.ధ్యానాదినా తు మనశ్శుద్ధిః.

12. సర్వమపి కర్మ విహితం పరమేశ్వరప్రీత్యర్థకం న బంధకమ్:– "యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధన"ఇతి గీతావచనాత్,న చ హింసాదుష్టత్వాదగ్నిష్టోమాదికర్మ న కర్తవ్యమితి వాచ్యం.తత్ర పశువిశసనస్య శ్రుతి చోదితత్వేనాహింసాత్వాత్, "అగ్నిషోమీయం పశుమాల

---

స్నాన భస్మస్నానాదులచే శరీరశుద్ధియు, వేదాభ్యాసముచే వాక్శుద్ధియు, ధ్యానాదులచే మనశ్శుద్ధియుఁ గల్గును.

12. కర్మ బంధకస్వభావము గలదియైనను అయ్యది శాస్త్రవిహితమై. పరమేశ్వరప్రీత్యర్థముగ ననుష్ఠింపబడినపుడు మాత్రము బంధకముగాఁజాలదు."యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయకర్మబన్ధనః" అను గీతావచన మీయావిషయమును దెలుపుచున్నది.

ప్ర:–అగ్నిష్టోమాది కర్మలు పశుహింసతోఁ గూడియుం డుటవలన వానిననుష్ఠించుట దగునా?

ఉ:–" అగ్నీషోమీయంపశుమాలభేత" " వాయవ్యగ్ శ్వేతమాలభేత" ఈవిధముగ శ్రుతివిహితమగుటచేఁ జేసి యాగీయపశువిశసనము హింసగాఁజాలదు.

ప్ర:–ప్రత్యక్షముగ బ్రాణివధజరుగుచుండ నది హింస గాకుండు టెట్లు? వందలకొలది వేదవాక్యములు జెప్పినను "నిప్ష

భేత" "వాయవ్యగ్ శ్వేతమాలభేత" ఇత్యాదిర్హి శ్రూయతే. న చ ప్రత్యక్షప్రాణివధస్య కథమహింసాత్వం! న హి శ్రుతిశతమప్యగ్నిశ్శీత ఇతివదప్రమాణం భవితుమర్హతీతి వాచ్యమ్. ప్రాణివధజన్యస్య పాపస్యాతీంద్రియస్య శాస్త్రైకవేద్యత్వేనాప్రత్యక్షత్వాత్. "మా హింస్యాత్సర్వభూతాన్యన్యత్రతీర్థేభ్య" ఇతి శ్రుత్యా తీర్థేషు ప్రాణివధః పాపహేతుర్న, ప్రత్యుత స్వర్గహేతురేవేత్యుక్తత్వాత్, నను యది జ్యోతిష్టోమాదౌ పశువధః

---

చల్లగానుండు"ననునంశము ప్రత్యక్షవిరుద్ధముగ ప్రమాణము గాఁజాలునా?

ఉ:- ప్రాణివధ ప్రత్యక్షముగావచ్చును. కాని దాని మూలమున పాపమేజనించునో. పుణ్యమేపుట్టునో మనయింద్రియములకు గోచరించునదిగాదు. అది శాస్త్రైకసమధిగమ్యము. "మాహింస్యాత్సర్వభూతాన్యన్యత్రతీర్థేభ్యః" అను శ్రుతిననుసరించి, తీర్థములనబడు యాగాదివిహితకర్మలయందు ప్రాణివధ పాపహేతువుగాదనియు, పైపెచ్చు పుణ్యహేతువనియు దెలియుచున్నది.

ప్ర:- ఓహో! జ్యోతిష్టోమాదులందు జేయు పశువధవలన నాపశువునకె స్వర్గము లభించుననియా మీయాశయము! అగుచో ఏపశువుకో పక్షికో ఆస్వర్గమును గట్టిపెట్టుటకన్న తనతండ్రినే పశువుగా నుపయోగించి యాతనికె యాస్వర్గము నిప్పించవచ్చునుగదా! లేక యజమానునకె స్వర్గహేతువగు

పశోస్స్వర్గహేతుః, తర్హి యజమానేన స్వపితైవ హన్యతామ్. యది తు స్వస్య స్వర్గహేతుః తర్హి స్వస్యైవ. పశోరపి వధోఽతీవదుఃఖకరత్వాన్నైవ కర్తవ్యః— న హి స్వదుఃఖమపి సోఢుమర్హం సత్పురుషేణేతి చేన్నైవమ్. శ్రుత్యా పశ్వాలంభనమేవ స్వర్గహేతుత్వేన విహితం న తు పితృమాత్రాద్యాలంభనమితి కృత్వా తేష్వేషు పశ్వాలంభనమేవ కర్తవ్యం, తస్య చ పశోరాలంభనాత్పశుయజమానయోరుభయోరపి స్వర్గప్రాప్తిరే

నని. మీయభిప్రాయమగుచో యజమానుఁడే పశువుగ నేల నుపయోగపడరాదు! తనకు మిక్కిలి దుఃఖజనకముగాన మాని నాఁడన్నచో, పశువధసైతము పశువుకు దుఃఖకరమేగాన నదియు మానుట సమంజసము. సత్పురుషులు స్వపరదుఃఖముల సమానముగ నెంతురుగదా!

ఉ:—అట్లుకాదు; "ఇదిచేయఁదగును; ఇదికాదు" అని నిర్ణయించుటలో మనకు శాస్త్రమే సర్వత్ర ప్రమాణము. అట్టియా శాస్త్రముచే పశ్వాలంభమె స్వర్గహేతువుగ విధింపఁబడినదిగాని, పితృమాత్రాద్యాలంభముగాదు. కావున పశ్వాలంభమే కర్తవ్యము. ఇట్లు విహితమార్గమున పశ్వాలంభమును జరిపినపుడా పశువునకు, యజమానునకునుగూడ స్వర్గములభించును. విద్యాలాభమునకై దండ్రి కుమారుని శిక్షించునట్లు సత్పురుషులు యాగాది విహితకర్మలందు స్వర్గప్రాప్తికై పశువును హింసింతురు. అయ్యది తాత్కాలికముగ పశువునకు

వేతి కృత్వా యథా విద్యార్థం పుత్రం పితా శిక్షయతి.తథా స్వర్గార్థం సంతః పశుం తీర్థేషు హింసన్త్యేవ.స చ పశువధస్తత్కాలే పశోర్దుఃఖహేతురప్యుత్తరకాలే సుఖాతిశయహేతుత్వాత్కర్తవ్య ఏవేతి:- అస్వర్గకామేన తు ముముక్షుణా చిత్తశుద్ధ్యర్థమగ్నిష్టోమాదికం కర్తవ్యమేవ. నను యజ్ఞాదిషు హింసితాః పశవః పరత్ర తం యజమానం పునః హింసంతీతి భాగవతగతప్రాచీనబర్హ్యుపాఖ్యానాద్గమ్యత ఇతి నైవ కర్తవ్యః పశువధస్తీర్థేష్వపీతి చేన్నైవం. కర్మేషు వైరాగ్యోత్పా

---

దుఃఖము గల్గించినను నుత్తరకాలమున మహత్తర సుఖసంపాదక మగుటచే గర్తవ్యమనుట కెట్టిసంశయమును లేదు. స్వర్గకామము లేని ముముక్షువుగూడ చిత్తశుద్ధ్యర్థమై అగ్నిష్టోమాదిక్రతువుల ననుష్ఠించి తీరవలసినదె.

ప్ర:-యజ్ఞములలో హింసింపబడిన పశువులు పరలోకమునందు మరల నాయజమానుని హింసించునని భాగవతములోని ప్రాచీన బర్హిచరిత్రమువలనఁ దెలియుచుండుటచేత తీర్థములందునైతము బశువధ చేయదగనిదని సిద్ధించుట లేదా!

ఉ:-లేదు; కర్మలయందు వైరాగ్యము నుదయింపజేయు నుద్దేశ్యముతో భాగవతమునందట్లు పలుకబడినది. అట్లుగానిచో భగవద్గీతలలో "యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః" (యజ్ఞములతో నాయా దేవతలకు విహితములగు హవిస్సులనొసగి తచ్ఛేషము నుచితరీతిని భక్షించువారు నిఖిల

దనార్థం తథోక్తత్వాత్తత్ర. కథమన్యథా గీతాసు.యజ్ఞశిష్టా
శినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైరిత్యాదిరుచ్యేత? నను య
జ్ఞానాం జపయజ్ఞోఽస్మీతి” గీతావచనాజ్జపయజ్ఞ ఏవ ముముక్షు
ణా కర్తవ్యః,న తు పశుయజ్ఞ ఇతి చేన్నైవమ్.యః పశుయజ్ఞ
విధానేన పరిశుద్ధ చిత్తస్తస్యైవ జపయజ్ఞాధికారః.శుద్ధచిత్తో
హి మనసైకాగ్రేణ జపయజ్ఞం కర్తుం క్షమతే,యః పునర్మ
నస్యన్యాక్రాంతే సతి వాచా కేవలం జపతి స మిథ్యాచార ఏవ,
తస్మాన్నియతం యజ్ఞాదికర్మ కర్తవ్యమేవ నిష్కామమ్.

13. నను నిత్యకర్మాచరణేన ఫలభావాన్నిష్కామమితి

---

పాపనిర్ముక్తు లగుదురు.) అని చెప్పుటెట్లొప్పును?

ప్ర:-ముముక్షువగువాఁడు “యజ్ఞానాంజపయజ్ఞోఽస్మి” అను గీతావచనము ననుసరించి జపయజ్ఞముఁజేయుట దగును, గాని పశుయజ్ఞ మెంతమాత్రమును గాదు.

ఉ:-ఎవఁడు పశుయజ్ఞానుష్ఠానముచేఁ బరిశుద్ధచిత్తుఁ డగునో వానికే జపయజ్ఞమునం దధికారము. అట్టివాఁడే మనసు నేకాగ్రముగావించి జపయజ్ఞముఁ జేయఁజాలును. మానసమన్య విషయాక్రాంతమై యుండ కేవలము వాఙ్మాత్రముతో జపించువాఁడు మిథ్యాచారుఁడనఁబడును. కావున శాస్త్రవిహితమగు యాగాదినిత్యకర్మను నిష్కామముగ ననుష్ఠించుటావశ్యకము.

13. నిత్యకర్మను మానిన ప్రత్యవాయముగల్గుట మా

విశేషణం వ్యర్థమితి చేన్నైనమ్. ప్రాజాపత్యాదిఫలసద్భావాన్నిత్యకర్మానుష్ఠానస్య. కథమన్యథా పరమదయాళుః పరమేశ్వరో నిష్ఫలాని నిత్యాని కర్మాణి విదధ్యాత్, న చైనమ్ నిత్యకర్మకామ్యకర్మణోరవిశేష ఇతి వాచ్యం. యదకరణే ప్రత్యవాయస్తన్నిత్యకర్మేతి విశేషసత్త్వాత్ "న హి కామ్యకర్మాకరణే ప్రత్యవాయః. కిం తు కామాప్రాప్తిరేవ. తస్మాన్నిత్యం నైమిత్తికం చ కర్మేశ్వరార్థం ముముక్షుణా యావచ్చిత్తశుద్ధి కర్తవ్యమేవ.

---

త్రమేగాని, చేసినచో లభించు ఫలవిశేషమేమియు లేకపోవుటంజేసి "నిష్కామముగ ననుష్ఠించవలె" ననుట యర్థములేని మాటయని కొందరు భావించవచ్చును. అదిసరిగాదు నిత్యకర్మానుష్ఠానమునకు *బ్రాజాపత్యాది ఫలముగలదను విషయము శాస్త్రసిద్ధము, అట్లుగానిచో పరమదయాళువగు పరమేశ్వరుఁడు నిష్ఫలములగు నిత్యకర్మలను విధించి మనల బాధించునా? మరియొకవిశేషమేమన. నిత్యకర్మలుగూడ ఫలవంతములగుచో నిక కామ్యకర్మలకును వీనికిని భేదమేమియని కొందరు శంకింతురు. సమాధానమునువినుఁడు—ఫలవత్త్వము రెంటికి సమానమేయైనను 'జేయనిచోఁబ్రత్యవాయమునుగల్గించుట' యనునొక విశేషము నిత్యకర్మలోమాత్రమే గలదు. కామ్యకర్మలఁజేయనిచో నాయాకామములు సిద్ధించవనుమాటయేగాని యట ప్రత్యవాయప్రసక్తియేలేదు. కావున ముముక్షు

14. జాతాయాం తు చిత్తశుద్ధౌ తస్య జ్ఞానమార్గ ఏవాధికారః.నను యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాదితి, వీరహా వా ఏష దేవానాం యోగ్నిముద్వాసయతీతి చ శ్రుతే ర్యావజ్జీవం నిత్యకర్మకర్తవ్యమేవ,న తు మధ్యే త్యక్తవ్యమితి చేన్నైవమ్, అశుద్ధచిత్తముద్దిశ్యైవ యావజ్జీవాదిశ్రుతిప్రవృత్తిః,కథమన్యథా "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా"దితి శ్రుతిః.కర్మసన్న్యాసం విదధ్యాత్, యో యత్రాధికృతస్స హి తస్యాకరణే పతతి.అజ్ఞస్తు కర్మ

---

వగువాఁడు చిత్తశుద్ధి గలుగువఱకు నీశ్వరార్పణ బుద్ధితో నిత్యనైమిత్తికకర్మల ననుష్ఠించ వలసినదే.

14. చిత్తశుద్ధి గలిగినపిదప కర్మానుష్ఠాన మనావశ్యకము. వానికిక జ్ఞానమార్గమునందె యధికారము. "యావజ్జీవ మగ్నిహోత్రంజుహుయాత్" (బ్రతికియున్నంతవఱకగ్నిహోత్రకర్మ ననుష్ఠింపవలెను.) "వీరహావా ఏష దేవానాం యోగ్నిముద్వాసయతి" "అగ్నిహోత్రా నుష్ఠానముఁ జేయుక గార్హపత్యాద్యగ్నులకుద్వాసముగల్పించినఁవాడు వీరహత్యాదోషమునందును) ఇత్యాదిశ్రుతుల ననుసరించి యావజ్జీవము నిత్యకర్మజేసియే తీరవలెనని యేర్పడుచుండ మధ్యలో (చిత్తిశుద్ధిగల్గినంతనె మానవలెననుట యెట్లుపొసగునని యాశంకింప నవసరములేదు. ఏలనన నీయావజ్జీవాది శ్రుతులన్నియు జిత్తశుద్ధి గలుగనివాని విషయమున న్ప్రవర్తించును. అట్లేకాని-చో

ణ్యధికృత ఇతి తదకరణే న ప తేద్విజ్ఞస్తు సాంఖ్యేఽధికృత ఇతి కర్మాకరణే న తస్య పాతిత్యమ్. ఉక్తం హి భగవతా." లోకే స్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ। జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామితి."

15. నను నిష్కామకర్మానుష్ఠానాచ్చిత్తశుద్ధిరితి న

---

"పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్" ("చిత్తశుద్ధిగల్గిన బ్రాహ్మణుడు కర్మమార్గమున సంపాదించిన యుత్తమ లోకోపభోగాదుల యనిత్యతను పరిశీలించి వాని నుండి విరక్తుడగును.)" ఇట్లు శ్రుతి, కర్మసన్న్యాసమును విధించుటెట్లుఘటించును? ఎవనికి దేనియందధికారమో వాడ ద్దానినాచరింపకున్న బతితుడగుట న్యాయము. అజ్ఞుడు కర్మా ధికృతుడుగాన వాడు కర్మననుష్ఠింపకున్న బతితుడై తీరును. విజ్ఞుడన్ననో సాంఖ్య (జ్ఞాన) మార్గాధికృతుడుగాన వానికి కర్మలననుష్ఠింపకున్నను పాతిత్యము సంభవించదు. కావున నే భగవానుడు "లోకేస్మిన్ యోగినామ్ (పరిశుద్ధచిత్తులై యాత్మానాత్మ వివేకాదులుగల్గిన యుత్తమాధికారులకు జ్ఞాన మార్గమనియు, చిత్తపరిపాకములేని మందాధికారులకు కర్మ మార్గమనియు నిట్లు రెండుపద్ధతులను సృష్ట్యాదియందు సర్వ జ్ఞుడనగు నాచే ప్రజల కభ్యుదయ నిశ్శ్రేయసములు గల్గుటకై ప్రవర్తింపఁ జేయబడినవి.) అని చెప్పియున్నాడు.

15. నిష్కామ కర్మానుష్ఠానమువలనఁ జిత్తశుద్ధి గల్గు

నియమః. కర్మానుష్ఠానాదపి కేషాంచిచ్చిత్తశుద్ధ్యనుదయాదితి చేన్నైవమ్. జన్మాన్తరీయనిష్కామ కర్మానుష్ఠానాదిహజన్మని కర్మాకరణాదపి చిత్తశుద్ధిర్భవతి॥ ఇహజన్మని కర్మకర్తౄణాం తు కేషాంచిత్పాపబాహుళ్యాన్నాస్మిన్నేవ జన్మని చిత్తశుద్ధిః, ఉక్తం హి భగవతా "బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే" ఇతి.

16. కా పునశ్చిత్తశుద్ధిరితి చేదుచ్యతే, శమాదిసాధన

---

నను నియమ మేమున్నది? కర్మానుష్ఠానము జేయకయే కొందరు పరిశుద్ధ చిత్తులుగ గోచరించుచున్నారు. మరికొందరు కర్మల ననుష్ఠించియు జిత్తశుద్ధిశూన్యులై గనుపట్టుచున్నారు. కావున నీనియమ మనాదరణీయమని కొందరనవచ్చును. కాని నిజమది గాదు. ఈజన్మమునఁ గర్మానుష్ఠానముఁ జేయకున్నను పూర్వ జన్మమునఁ దాఁజేసిన కర్మలమూలముననే యొకఁడు శుద్ధ చిత్తుఁడు గావచ్చును. కొందరీజన్మమున విశేషించి కర్మల ననుష్ఠించినను జన్మాంతరీయమగు పాపబాహుళ్యమునఁ జేసి యీజన్మలో జిత్తశుద్ధిగలుగక పోవచ్చును. కావుననే భగవానుఁడు "బహూనాంజన్మనామన్తే జ్ఞానవాన్మాంప్రపద్యతే" (బహుతరజన్మానుష్ఠిత పుణ్యకర్మ పరిపాకవశమున జ్ఞానియైనవాఁడు, ప్రత్యగాత్మ స్వరూపుఁడనగు నన్ను బొందుచున్నాఁడు.) అని చెప్పియున్నాఁడు.

16 చిత్తశుద్ధియనగా శమదమాది సాధన సంపత్తియే,

సంపత్తిరితి. తథా చ సూత్రితం వ్యాసేన. "అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి" అథేత్యస్య శమాదిసాధనసంపత్త్యానన్తర్యమర్థ ఇతి భాషితం చ శంకరాచార్యైః "శమో దమ ఉపరతిస్తితిక్షా శ్రద్ధా సమాధానాని ఈహాముత్రఫలభోగవిరాగః నిత్యానిత్యవస్తువివేకః, ముముక్షుత్వం శమాదిసాధనసంపత్తిః. యస్యైషా సంపత్తిర్నాస్తి స నిత్యాకరణాత్పతేదేవ. తథా చ మనుః "అకుర్వన్విహితం కర్మ నిన్దితం చ సమాచరన్। ప్రసజ్యంశ్చేన్ద్రియార్థేషు నరః పతనమృచ్ఛ"తీతి. న చాయం శుద్ధచిత్తస

---

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా అను సూత్రమున వ్యాసుడీ విషయమును సూచించి యున్నాఁడు. ఈసూత్రమునందలి 'అథ' శబ్దమునకు "శమాదిసాధనలు చేకూరినపిదప" యని యర్థమని శ్రీ శంకరాచార్యులు భాష్యమున వివరించిరి. శమాదులనగా శమము, దమము, ఉపరతి, తితిక్షా, శ్రద్ధా. సమాధానములు. ఇహాముత్రఫల భోగవిరాగము, నిత్యానిత్య వస్తువివేకము, ముముక్షుత్వము ననునవి. ఎవనికీ సాధనసంపత్తిలేదో యాతఁడు నిత్యకర్మ ననుష్ఠింపనిచో బతితుఁడై తీరును. మనువుగూడ "అకుర్వన్ విహితంకర్మ...పతనమృచ్ఛతి (విహితకర్మ ననుష్ఠింపకయు, నిషిద్ధకర్మను విడనాడకయు. స్వేచ్ఛానుసారముగ నింద్రియములనాయావిషయములలోఁ బ్రవర్తింపజేయు మానవుఁడు పతితుడగును.)" అని జెప్పుచున్నాఁడు. కొందరీశ్లోకము శుద్ధచిత్తునికి సంబంధించనిదని చెప్పుట కేవలము భ్రమవిల

శ్లోక ఇతి భ్రమితవ్యం. తస్య నిందితానుష్ఠానాద్యయోగాత్. తస్మాద్యో యో వర్ణో యో య ఆశ్రమీ యస్మిన్ కర్మణ్యధికృతస్స తత్తత్కుర్యాదేవాఫలాభిసంధి. న చ హృదాకాశే చిదాదిత్యస్సదా భాసతి భాసతే। నోదేతి నాస్తమేత్యేవ కథం సంధ్యాముపాస్మహే" ఇతి శ్రుత్యైవ కర్తవ్యం సంధ్యాదికమితి వాచ్యమ్, తస్యాం జ్ఞానిపరమహంసపరత్వాత్" తస్మాత్సర్వో జనోఽధికృతః కర్మణి విహితం కుర్యాత్.

17. తత్ర తావత్. "అత్యంతమలినః కాయో నవచ్ఛి

---

షితము. ఏలనన నాతనికి నిందితకర్మానుష్ఠాన ప్రసక్తియేయుండదుగదా! కావున నాయావర్ణములకును. నాశ్రమములకును, చెందినవారు తమతమయధికారమునకుఁ దగినట్లు ఫలాభిసంధిరహితముగ నాయాకర్మల ననుష్ఠించవలయును. కొందఱు— "హృదాకాశే...ఉపాస్మహే" హృదయాకాశమున జ్ఞానసూర్యుఁడుదయాస్తమయములు లేక నిత్యము ప్రకాశించుచుండును. ఉదయాస్తమయ కాలములందుఁ జేయఁదగిన సంధ్యావందనమెట్లు ప్రసక్తమగును?)" అను శ్రుతిననుసరించి సంధ్యావందనాదికము చేయు నక్కఱలేదని యందురు. అదిసరికాదు. ఈశ్రుత్యర్థము జ్ఞానులగు పరమహంసలకు సంబంధించినది. కావున నధికారతారతమ్యమునుబట్టి విహితకర్మ ననుష్ఠింపక తప్పదు.

17. అందు ప్రాతస్స్నానము ముఖ్యము. "ఈశరీరము మిక్కిలి మాలిన్యముతో గూడినది. ఇందలి తొమ్మిది రంధ్ర

ద్రసమన్వితః.స్రవత్యేవ దివానక్తం స్నానం తస్య విశోధన”మితి “యామ్యం హి యాతనాదుఃఖం ప్రాతస్స్నాయీ న పశ్య”తీతి చ స్మరణాత్ప్రాతస్స్నానమవశ్యం కర్తవ్యం.సతి చాశౌచే శౌచస్నానం చ కర్తవ్యమ్.ఏవం స్నాత్వా ద్విజ ఆచమ్య సంధ్యాముపాసీత యథాకాలం యథావిధి.అహరహస్సన్ధ్యాముపాసీతేతి శ్రుతేః.సన్ధ్యా యేన న విజ్ఞాతా సన్ధ్యాయే నానుపాసితా జీవమానో భవేచ్ఛూద్రో మృతశ్శ్వాఽభిజాయత ఇతి స్మృతేశ్చ.సన్ధ్యా చ బ్రహ్మైవ.సా సన్ధ్యాయా జగ

---

ములమందియు రాత్రింబవలు నానావిధములగు మలములు వెడలుచుండును. దీనికి శుద్ధి ప్రాతస్స్నానమునం జేకూరును అనియు ప్రాతస్స్నానతత్పరుఁడగువాఁడు యమయాతనా దుఃఖము ననుభవింపఁడు అనియు స్మృతులు దెలుపుచున్నవి. ఇట్లు నిత్యస్నానమేగాక, ఆశౌచాదినిమిత్తములందు దత్ప్రయుక్తములగు (నైమిత్తిక) స్నానములనుగూడఁ జేయవల యును. ఇట్లు స్నానముచే బరిశుద్ధుఁడై యాచమనమొనర్చి “అహరహస్సంధ్యాముపాసీత” అను శ్రుతిననుసరించి సకాలమున యథావిధిగ సంధ్యోపాసనమును సలుప వలయును. “ సంధ్యాయేననవిజ్ఞాతా...జాయతే (సంధ్యనెవఁడు గుర్తింపఁడో, అట్టిదాని నెవఁ డుపాసింపఁడో అట్టివాఁడు బ్రతికియున్నంత కాలము శూద్రుఁడై మరణానంతరము శునకముగా జనించును.)” అను స్మృతివచనము నైతము సంధ్యోపాసన మవశ్య

తూన్యాతిర్మాయాతీతా హి నిష్కలేతి స్మృతేః.తస్యాశ్చాదిత్య మణ్డలావచ్ఛేదేనోపాసనం విధేయమ్. “ఉద్యన్తమస్తంయన్త మాదిత్యమభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాంత్సకలం భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి చ శ్రుతేః” గాయత్రీ మన్త్రశ్చైతత్పర ఏవేతి కృత్వా సన్ధ్యావన్దనాఙ్గతయా (గాయత్రీజపశ్చ కర్తవ్యః॥ న గాయత్ర్యాః పరో మన్త్ర) ఇతి స్మరణాత్,ఏవంకృతసన్ధ్యోపాసనస్య శ్రౌతస్మార్తకర్మా నుష్ఠానయోగ్యతా సమ్భవతి,తతో వేదాధ్యయనం కర్తవ్యం.

---

కర్తవ్యమని సూచించుచున్నది. సన్ధ్యయనగా పరబ్రహ్మనే. సాసన్ధ్యా...నిష్కలా (నిఖిలజగదధిష్ఠానమై మాయాతీతమై సట్టియే పరతత్త్వము గలదో, యదియే సన్ధ్య) అనుశ్రుతి యీయర్థమునే నిర్ధారణ చేయుచున్నది. “ఉద్యన్తమస్తం యన్త...బ్రహ్మేతి” అను శ్రుత్యనుసారము సంధ్యాదేవత నాదిత్య మండలమునం దుపాసింపవలయును. గాయత్రీమం త్రముసైతమీయుపాసనమునకు సంబంధించినదియే గావున సన్ధ్యావందనాంగముగ గాయత్రీజపమునుగూడ చేయవల యును. “న గాయత్ర్యాఃపరోమన్త్రః గాయత్రికన్న నుత్కృ ష్టమగు మంత్రము వేరుండలేదు. అని స్మృతి యుద్ఘోషించు చున్నది. ఇట్లు సంధ్యోపాసనమును సలిపినవానికి శ్రౌతస్మార్త కర్మానుష్ఠానయోగ్యత చేకూరును. పిదప “స్వాధ్యాయోఽ ధ్యేతవ్యః” అను శ్రుతిననుసరించి వేదాధ్యయనముం జేయవల

స్వాధ్యాయోఽధ్యేతవ్య ఇతి శ్రుతేః."వేదాక్షరాణి యావన్తి పఠితాని ద్విజోత్తమైః, తావన్తి హరినామాని కీర్తితాని న సంశయః" ఇతి స్మృతేశ్చ. తతో గృహస్థః పఞ్చసూనాపనుత్త్యర్థం వైశ్వదేవం కుర్యాత్. "కణ్డనీ పేషణీ చుల్లీ ఉదకుమ్భశ్చ మార్జనీ, పఞ్చసూనా గృహస్థస్య తాభిః స్వర్గం న గచ్ఛ" తీతి స్మరణాత్. తతో హోమం దేవతార్చామతిథిభోజనం చ కుర్యాత్, వైశ్వదేవంనిత్యహోమంతథైవాతిథిభోజనమ్ దేవతారాధనం చైవ త్యక్త్వా విప్రో మహామునే; భుక్త్వాఽజ్ఞానాన్త్ర

---

యును. "వేదాక్షరాణి...నసంశయః ద్విజోత్తములు వేదమును పఠించుచో నందలి ప్రతి యొకయక్షరమును హరినామ సంకీర్తనమునకు సమానమగు ఫలమునిచ్చును; ఇందులకెట్టిసందియమును లేదు," అని స్మృతి వేదాధ్యయన మాహాత్మ్యమును విశదీకరించుచున్నది. తదనంతరము గృహస్థుఁడు పంచసూనాదోష పరిహారార్థమై వైశ్వదేవము నాచరించవలెను. "కణ్డనీ పేషణీ...నగచ్ఛతి" అను స్మృతిననుసరించి దంచుట, విసురుట, వంటచేయుట, గృహసంమార్జము సేయుట(ఊడ్చుట) మున్నగు సందర్భములలో ననేక సూక్ష్మజీవులహింస గృహస్థునకు నిత్యము ప్రసక్తమగుచుండుననియు, అయ్యది యుత్తమ (స్వర్గ) లోకప్రాప్తికి ప్రతిబంధకమనియు, దత్పరిహారార్థము వైశ్వదేవ మవశ్య కర్తవ్యమనియుఁ దెలియుచున్నది. పిదప హోమమును దేవతార్చనమును అతిథిభోజనమును నెరవేర్ప

హాదోషస్సురాపీ కథ్యతేబుధై రితి,వైశ్వదేవం దేవతార్చాం నిత్యహోమం తథాఽతిథిమ్, బ్రహ్మయజ్ఞం పితౄణాం చ తర్పణం ద్విజవల్లభ, త్యక్త్వా భుక్త్వా తథా విప్రస్సురాపీత్యుచ్యతే బుధై రితి చ స్మరణాత్.ఏవం కృత్వా క్షుతజృంభణాదిరహితం యథా తథా పక్వమన్నమశ్నీయాత్,విప్రో భోజనకాలేషు క్షుతం వా జృంభణం తథా।అపానవాయోరుత్సర్గం కృత్వా విప్రస్స పాపభాగితి స్మృతేః॥అథ భోజనానన్తరం దివాస్వా

---

వలయును."వైశ్వదేవం...సురాపీత్యుచ్యతేబుధైః"(బ్రాహ్మణుడు వైశ్వదేవమును, నిత్యహోమమును, నతిథిభోజనమును, దేవతాపూజనమును, బ్రహ్మయజ్ఞమును. పితృతర్పణమును జేయక యజ్ఞానముచే భుజించినచో సురాపానముతో సమానమగు మహాపాపమును బొందును.) అని స్మృతులు బోధించుచున్నవి. ఇట్లు వైశ్వదేవాదుల నానర్చి తుమ్ములు, ఆవలింతలు లేకుండ స్వస్థుడై చక్కగా బక్వమైన యన్నమును భుజించవలయును. "విప్రోభోజన...పాపభాక్" (బ్రాహ్మణుడు భోజన సమయమునందు తుమ్మట, యావలించుట, అపానవాయువును విడచుటచేసినచో ప్రత్యవాయము నొందును.) అని స్మృతి యుపదేశించు చున్నది. భోజనమైన పిమ్మట దివాస్వాపా (పగటినిద్రా)దులను మాని యోగ్యులగు శిష్యులున్నచో వారలకు విద్యాదానముఁ జేయవలయును. ఇయ్యది, తగినజీవిక (కుటుంబ నిర్వహణోపయుక్తమగు ధన

పాదికమకుర్వన్ సత్యాం జీవికాయాం సత్సు యోగ్యశిష్యేషు విద్యాదానం కుర్యాదసత్యాం జీవికాయాం జీవనార్థమనిన్దితం కర్మ కుర్యాదసత్సు చ శిష్యేషు స్వయమేవ భాగవతాదిసద్గ్రన్థపఠనం కుర్యాదథవా భగవన్నామ జపేత్॥ "రాశబ్దోచ్చారణాదేవ ముఖాన్నిర్యాన్తి, పాతకాః పునః ప్రవేశభీత్యాత్ర మకారస్తు కవాటవ"దిత్యాదివచనాద్భగవన్నామజపో హి సర్వోత్తమః. సకలపాపనిర్వాపకః క్రమముక్తిప్రదశ్చ. తతః సాయంసమయే సంధ్యోపాసనమగ్నిహోత్రం చ కృత్వా అని

---

ధాన్యాదికము) గలవాని విషయము. జీవిక లేనివాడగుచో ననిందితమగు వృత్తిచే దాని నార్జింపనగును. విద్యాదానమునకర్హులగు శిష్యులు లభించనపుడు స్వయముగ భాగవతాది సద్గ్రంథముల పఠించవలెను లేక భగవన్నామమునైన జపించవచ్చును. "రాశబ్దో...కవాటవత్ ('రామ' నామములోని 'రా' యను నక్షరము నుచ్చరించినతోడనే హృదయాంతర్గతములై యున్న పాపములన్నియు ముఖద్వారమునుండి బయటికి వచ్చును. 'మ' అను నక్షరము నుచ్చరించగనే (అయ్యది ఓష్ఠ్యముగాన) బహిర్నిర్గతములైన పాపములు మరల లోనఁ బ్రవేశింపకుండ ద్వారమును మూసినట్లగును. కాగా రామ నామము సమస్త పాపహారమనుట.)" ఇత్యాదివచనముల ననుసరించి భగవన్నామజపము సర్వోత్తమమనియు, సకల పాపభంజకమనియు, క్రమముక్తి ప్రదమనియు దెలియుచు

షిద్ధదివసేషు నిశి భుక్త్వా ఋతుదివసేషు శక్తశ్చేద్రాత్రౌ భార్యాం గత్వా భగవద్గాథాః స్మరన్నేవ శయీత తల్పే గృహస్థః॥పునరరుణోదయాత్పూర్వ మేవోత్తిష్ఠేన్మలమూత్రే విసృజ్య శౌచం విధాయ స్నాయాద్య ఏవం ప్రతిదినమనుతిష్ఠతి స ఈశ్వరేణానుగృహీతో భవతి. న హి సతీశ్వరానుగ్రహే పురుషస్య దుర్లభః కశ్చిదర్థః॥అతఏవ అకామస్సర్వకామో వా మోక్షకామ ఈశ్వరం భజేతేత్యుచ్యతే శాస్త్రేషు.

18. ఇదం చ విహితం కర్మ సకామం నిష్కామం చేతి.

---

న్నది. పిదప సాయంకాలమున సంధ్యావందనమును, నౌపాసనమును నెరవేర్చి నిషేధింపబడని దినములయందు ఋతుకాలమున రాత్రులందు యథాశక్తిగ భార్యతో గ్రీడించి భగవత్కథలను స్మరించుచు గృహస్థులు పాన్పుపై శయనింపనగును. మరల నరుణోదయమునకు మున్నె మేల్కాంచి మలమూత్రముల విసర్జించి యథోక్తరీతిని శౌచమును సలిపి స్నానముం జేయవలయును. ఎవడిట్లు ప్రతిదినము ననుష్ఠించునో వాడీశ్వరానుగ్రహమునకుం బాత్రుడగును. ఈశ్వరానుగ్రహముగల పురుషునకు దుర్లభమగున దెద్దియునుండదు. కనుకనే "అకామస్సర్వకామో వా మోక్షకామ ఈశ్వరం భజేత అని శాస్త్రములలోం జెప్పబడినది.

18. ఈవిహితకర్మ సకామమనియు, నిష్కామమనియు రెండు తెఱంగుల నున్నది. అందు నిష్కామము క్రమముక్తికి

ద్వివిధం.తత్ర నిష్కామం క్రమముక్తికారణం.సకామన్తు సం
చితం ప్రారబ్ధఞ్చేతి ద్వివిధం.తత్ర ప్రకృతదేహారంభకం జన్మా
న్తరకృతం కర్మ ప్రారబ్ధం.భోగంవినా తు నాస్య క్షయః.
భవిష్యద్దేహారమ్భకం తు జన్మాంతరకృతమిహజన్మని కృతం
చ కర్మ సంచితం,తస్య తు జ్ఞానాత్క్షయ ఉపపద్యతే,"జ్ఞానాగ్ని
దగ్ధకర్మాణ"మితి గీతావచనాత్.

19. నను అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి
పావక ఇతి న్యాయాదకామేనాపి జ్ఞానినాపి కృతం కర్మ బంధక
మేవ స్యాదితి చేన్నైవమ్॥భర్జనాద్బీజే ప్రరోహశక్తిరివ కామ

---

సాధనము. సకామకర్మ సంచితమనియు, ప్రారబ్ధమనియు
ద్వివిధము. అందు మన ప్రస్తుత దేహోత్పత్తికి సాధనమగు
జన్మాంతరీయమైన గర్మప్రారబ్ధ మనఁబడును. ఈజన్మయం
దును, జన్మాంతరములందును జేయబడి మన భవిష్యద్దేహము
నకు గారణమగు గర్మనశించునని "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం"
అను గీతావచనమువలనఁ దెలియుచున్నది.

19. ఇష్టమున్నను లేకున్నను స్పృశించినవాని నగ్ని
దహించునట్లు జ్ఞానియైనను నిష్కాముఁడై సేసినను కర్మబం
ధకమౌట్లు గాకపోవునని కొందరు ప్రశ్నింతురు. అది సరికాదు.
విత్తులోనుండు మొలకెత్తుశక్తి యావిత్తు నగ్నితప్తము
గావించినపుడు నశించునట్లు, గర్మయందలి బంధకస్వభావము
ఫలాభిలాషను పరిత్యజించుటవల్లను, నాత్మజ్ఞానమువలనను

త్యాగాజ్జ్ఞానాచ్చ కర్మణి బంధకత్వశక్తిర్నశ్యతీత్యభ్యుపగమాత్. న హ్యోషధికామేన పృథివ్యాం భ్రమన్పురుష ఇవ యథేచ్ఛం విహరన్పురుష ఓషధిం లభతే, అతఏవేదం నిష్కామకర్మానుష్ఠానం కర్మయోగ ఇత్యుక్తం గీతాసు. నను స్వర్గాదికామపరిత్యాగేఽపి చిత్తశుద్ధ్యర్థమీశ్వరప్రీత్యర్థం వా కర్మ కుర్వంతి యోగిన ఇతి కృత్వా కథం తస్య నిష్కామత్వమితి చేదుచ్యతే. చిత్తశుద్ధిర్మే భూయాదితి ఈశ్వరః ప్రీణాత్వితి చ

---

మూలమునను నశించును. ఏదేని యొకయోషధి నపేక్షించి దానికై భూమిపై సంచరించువాఁ డాయోషధిని సంపాదించు నట్లు స్వేచ్ఛగ సంచరించువాఁడు సంపాదింప జాలఁడుగద! కావు ననే యీనిష్కామకర్మానుష్ఠానము 'కర్మయోగ'మని భగవద్గీతలలోఁ బేర్కొనఁబడినది. ఇందుపై గొందరు "యోగులు స్వర్గాదిఫలముల బరిత్యజించినను జిత్తశుద్ధినిగాని, ఈశ్వర ప్రీతినిగాని గోరి కర్మననుష్ఠించుటం జేసివారికర్మ నిష్కామ మెట్లగును." అని ప్రశ్నింతురు. సమాధానము వినుఁడు 'చిత్త శుద్ధి నాకుకలుగుగాక' యనిగాని 'ఈశ్వరుఁడు ప్రీతుఁడగు గాక' యనిగాని గోరకయే యతులు గర్మననుష్ఠింతురు. ఇట్లయ్యును వారికా రెండుఫలములును సిద్ధించునని గ్రహించు నది. లేదా—ఎయ్యది పురుషులను బంధించునో అదియే కామ మగును. బంధకముకానిది కామమేగాదు. కాగా చిత్తశుద్ధ్యాది కము స్వర్గాదులవలె బంధకముగానందున నది కామమనిపించు

కామనాం విహాయైవ యతయః కర్మ కుర్వంతి.ఏవంకరణా దపి తదుభయాత్మకం ఫలం సంభవతి.యద్వా యోర్థః పుంసాం బన్ధకస్స ఏవ కామ ఇత్యుచ్యతే.అబన్ధకస్తు నైవ కామః.తథాచ చిత్తశుద్ధ్యాదేరబన్ధకత్వాదకామత్వమత ఏవ మోక్షకామో నిష్కామ ఇత్యుచ్యతే.తస్మాన్ముముక్షురధికృతః పురుష ఈశ్వ రేణ మమేదం విహితమతః కేవలం కర్తవ్యమితి బుద్ధ్యా కర్మ కుర్యాన్న తు పరిత్యజేత్,ఫలాభిసంధిం తు త్యజేత్ "సర్వకర్మ ఫలత్యాగస్యైవ సాత్త్వికత్యాగత్వాత్ "అజ్ఞకర్తృకకర్మ

---

కొనదు. కావుననే మోక్షకాముఁడు నిష్కాముఁడని చెప్పఁ బడుచున్నాఁడు. అందుచే ముముక్షువగు పురుషుఁడు "పరమే శ్వరుఁడు నాకీకర్మను విధించినాఁడు; నాకిదియవశ్యకర్తవ్యము" అనుభానముతోఁ గర్మననుష్ఠింపవలెనుగాని విడనాడఁగూడదు. ఫలాభిసంధిమాత్రము బరిత్యజింపవలయును. కర్మఫలత్యా గమె సాత్త్వికమైన త్యాగమగునుగాని కర్మత్యాగముగాదు. అజ్ఞుఁడుసేయు కర్మత్యాగము తామసికమని "నియతస్యతు... పరికీర్తితః" యిట్లు గీతలలోఁ నిందింపఁబడినది.

ప్ర:-భగవద్గీత "నహికశ్చిత్...అకర్మకృత్ (ఎవఁడు గాని యెప్పుఁడుగాని నిష్క్రియుఁడై (కర్మననుష్ఠింపక) యొక క్షణమేని గడుపఁజాలఁడు.)" అని బోధించుచుండ ప్రాజ్ఞుఁడు మాత్రము కర్మ నెట్లు విడనాడఁజాలును?

ఉ:-ఆత్మస్వరూపమును కర్తృత్వరహితమైనదానినిగ

త్యాగస్య చ గీతాసు భాషితత్వాత్ ॥నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే.మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తిత ఇతి.నను ప్రాజ్ఞోపి కర్మ త్యక్తుం న శక్నుయాదేవ.న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,ఇతి గీతావచనాచ్చ చేన్నైవమ్,అకర్తారమాత్మానం విదన్ ప్రాజ్ఞః కర్మ కర్తుమేవ న శక్నోతి.ఉక్తవచనమ్ అజ్ఞపరమేవ,న చాజ్ఞోపి యత్కించిదపి కర్మాకుర్వన్ తూష్ణీం తిష్ఠేదేవేతి వాచ్యమ్. తూష్ణీం స్థితేరపి కర్మత్వాత్.ప్రవృత్తివన్నివృత్తిరపి కర్మేతి గీతం హి భగవతా.కించ తూష్ణీం తిష్ఠన్నపి పురుష ఉన్మేషని

---

గుర్తించిన ప్రాజ్ఞుడు గర్మను జేయ నెట్లు ఘటించును? కాగా పై భగవద్గీతావచన మజ్ఞజనవిషయమని యెఱుంగునది.

ప్ర:-అజ్ఞుడుగూడ నేకర్మను జేయక యుదాసీనుండై యుండవచ్చునుగదా?

ఉ:-అట్టి యుదాసీనస్థితియు నొక గర్మయేయగును. ప్రవృత్తివలె నివృత్తిసైతము కర్మయేయని గీతలలో భగవానుడు చెప్పియున్నాడుగద! మరియు నెంత యుదాసీనుండై యున్నపురుషుడైనను నున్మేషనిమేషాదికమునైన జేయకుండ నుండజాలడు. గాన నజ్ఞుడు కర్మను సన్యసించుటయనునది యసంభావితము.

ప్ర:-మఱి ప్రాజ్ఞుడుమాత్ర మున్మేషనిమేషాదికమును చేయడా?

మేషాదికమపి కరోత్యేవేతి నాస్త్యజ్ఞస్యాకర్మకర్తృత్వమ్. న చ ప్రాజ్ఞోఽపి నిమేషాదికం కరోత్యేవేతి వాచ్యమ్. ప్రాజ్ఞ ఆత్మా నిష్క్రియత్వాదశరీరత్వాత్క్రియామపి న కరోతి. యత్పునః ప్రాజ్ఞస్య దేహేన్ద్రియాదికం నిమేషాదికర్తృ తన్నైవ ప్రాజ్ఞః. న హి ప్రాజ్ఞో దేహాదికమనాత్మానమాత్మత్వేన పశ్యతి మూఢ ఇవ, అయమేవ హ్యజ్ఞప్రాజ్ఞయోర్విశేషః, యదనాత్మన్యాత్మదర్శిత్వమాత్మన్యాత్మదర్శిత్వఞ్చేతి. యత్పునస్తర్కవ్యాకరణాద్యభిజ్ఞత్వం తన్నైవ ప్రాజ్ఞత్వమన్యథా కృషీ

---

ఉ:- ప్రాజ్ఞుఁడాత్మతత్త్వముకన్న భిన్నుఁడుఁగాఁడు. ఆత్మతత్త్వమన్ననో నక్రియ మశరీరమును గావున ప్రాజ్ఞునకు గర్మప్రసక్తియే లేదు. ఇక బ్రాజ్ఞుని దేహము, ఇంద్రియములు, ఉన్మేషనిమేషాది వ్యాపారముల జేయుచుండును. కాని దానితో బ్రాజ్ఞున కెట్టిసంబంధమును లేదు. దేహేంద్రియాది జడపదార్థమును మూఢుఁడాత్మగా భావించునుగాని జ్ఞానియట్లు భావింపఁడుగద! ఆత్మకాని దానినాత్మగాఁజూచుట అజ్ఞలక్షణము. ఆత్మ నాత్మగా గుర్తించుట బ్రాజ్ఞలక్షణము. ఇదియే యజ్ఞప్రాజ్ఞులలోని విశేషము. తర్కవ్యాకరణాది శాస్త్రములందు కృతపరిశ్రముఁడై యుండుట సైతము ప్రాజ్ఞలక్షణము గాఁజాలదు. ఇట్లు కానిచో కృషీవలుఁడు సైతము ప్రాజ్ఞుఁడు గావలసివచ్చును. ప్రాజ్ఞుఁడనగాఁ పండితుఁడు పండయనగా నాత్మజ్ఞానము. అది కలవాఁడె పండితుఁడు

చేతి త్రివిధమ్.తత్ర సకామం బన్ధకం,నిష్కామం మోచకం భిక్షాటనాదికం శారీరం కేవలమనుభయాత్మకమ్,న హి శరీర స్థితిమాత్రఫలకం భిక్షాటననాదేయపానాదికం కర్మ కుర్వన్యతిర్బధ్యతే పుణ్యేన పాపేన వా.అతఏవ స తత్కర్మ కర్మేత్యుచ్యతే. తత్కర్తాపి పరమహంసపరివ్రాజకః కర్మీతి నోచ్యతే. పారిశేష్యాద్విహితం ప్రతిషిద్ధం వా కర్మ యః కరోతి స ఏవ కర్మీత్యుచ్యతే.తత్రాపి యో నిష్కామం విహితం కరోతి స యోగీత్యుచ్యతే."యోగః కర్మసు కౌశల"మితి గీతావచనాత్,అస్యైవ యోగినశ్చిత్తశుద్ధ్యాదిద్వారా క్రమముక్తిః.

---

ములుగా నున్నవి. అందు ఫలాభిలాషతోఁ గూడినది బంధకము. నిష్కామమైనది మోచకము భిక్షాటనాదికమగు కేవలశారీరకకర్మ యనుభయాత్మకము. అనగా-బన్ధకమును మోచకమునుగూడ కానివి. కేవలము శరీరము నిలచుటమాత్రమే ప్రయోజనముగాగల భిక్షాటన, నదీజలపానాది కర్మ ననుష్ఠించునట్టియతి పుణ్యముచేగాని, పాపముచేగాని బంధింపఁబడుట లేదుగదా! కావుననే యిట్టి (బంధకము మోచకముగూడ కాని) కర్మ నిజముగా గర్మయేగాదు. అట్టికర్మను జేయువాఁడు నిజముగా కర్మియుఁ గాఁడు. పరిశేషన్యాయముచే శాస్త్రవిహితమైనట్టి లేక-ప్రతిషిద్ధమైనట్టికర్మ నెవఁడనుష్ఠించునో, వాఁడే కర్మియనఁబడును. అందు "యోగఃకర్మసుకౌశలమ్" అను గీతావచనము ననుసరించి విహితకర్మను నిష్కామముగ నను

21. యస్తు సకామం విహితం కరోతి స ధూమాది మార్గేణ చన్ద్రలోకం గత్వా పునరావర్తతే,స ఏవ కర్మీత్యుచ్యతే,యస్తు ప్రతిషిద్ధకారీ స నరకం ప్రాప్నోతి. యోగీ చ యదీహైవ పరమాత్మానం సాక్షాత్కుర్యాత్తర్హి స బ్రహ్మైవ భవేత్,యది తు పారోక్ష్యేణ బ్రహ్మవిద్యాత్తర్హి అర్చిరాదిమార్గేణ బ్రహ్మలోకం గత్వా తత్ర బ్రహ్మాత్మసాక్షాత్కారం లబ్ధ్వా ద్విపరార్ధావసానే బ్రహ్మణా సహ ముచ్యేత,బ్రహ్మణా సహ తే సర్వే సమ్ప్రాప్తే ప్రతిసఞ్చరే,పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమితి వచనాత్,తదేవం యో

---

ష్ఠించువాఁడు 'యోగి'యని చెప్పఁబడును. ఇట్టియోగికే చిత్తశుద్ధ్యాదిద్వారమున క్రమముక్తి లభించును.

21. ఎవఁడు ఫలాపేక్షగలవాఁడై విహితకర్మ ననుష్ఠించునో, వాఁడు ధూమాదిమార్గమున చంద్రలోకమున కేగి కొంతకాలమునకు మరల భూమిపైఁ బుట్టును. ఇతఁడే కర్మియన బడును. నిషిద్ధకర్మ ననుష్ఠించువాఁడు నరకమును బొందును. యోగియన్నవాఁడు ఇచట (ఈజన్మమున)నే పరమాత్మ సాక్షాత్కారము గలవాఁడగునో బ్రహ్మభూతుఁ డగును. అట్లు గాక పరోక్షముగమాత్రమే బ్రహ్మవస్తువును దెలిసినవాఁడగునో, అర్చిరాదిమార్గమున బ్రహ్మ (హిరణ్యగర్భ) లోకమున కేగి యచట పరబ్రహ్మసాక్షాత్కారమును బడసి, పరార్ధద్వయకాలపరిసమాప్తిసమయమునం దా బ్రహ్మతో సహముక్తుఁడగును. "బ్రహ్మణాసహ...పరంపదం" అను వచన

గినామర్చిరాదిమార్గః సుకృతినాం ధూమాదిమార్గః దుష్కృతినాం నరకాదిమార్గశ్చేతి మార్గత్రయం శ్రుత్యారూఢమ్.

22. యోగశ్చ నిష్కామకర్మానుష్ఠానలక్షణః ప్రథమః,తత్రైవాసన్న్యాసినామధికారః, యమనియమాద్యనుష్ఠానలక్షణో ద్వితీయః,తత్ర సన్న్యాసినామేవాధికారః,సన్న్యాసం చ గృహస్థ ఏవ స్వీకుర్యాదితి న నియమః,కిన్తు విరాగీ బ్రహ్మచారీ గృహస్థో వా స్వీకుర్యాదేవ. బ్రహ్మచర్యాదేవ ప్రవ్ర

---

మీయర్థమును బోధించుచున్నది. ఈవిధముగ యోగుల కర్చిరాదిమార్గమనియు, సకామకర్మానుష్ఠాతలకు ధూమాదిమార్గమనియుం బాపులకు నరకమార్గమనియు మూడు మార్గములు శ్రుతియందు ప్రసిద్ధములై యున్నవి.

22. యోగము రెండువిధములుగానున్నది. అందు మొదటిది నిష్కామముగ నియతకర్మననుష్ఠించుటయే. సన్న్యాసులుగానివార లీయోగమునందుమాత్రమే యధికారులగుదురు. యమనియమాది రూపమగునట్టి యోగము రెండవది. ఇందు సన్న్యాసులకు మాత్రమె యధికారము. సన్న్యాసమును గృహస్థుమాత్రమే స్వీకరించవలెనను నియమము లేదు. మరేమన, వైరాగ్యముగలవాఁడగుచో బ్రహ్మచారియైనను స్వీకరింపవచ్చును. "బ్రహ్మచర్యాదేవ...ప్రవ్రజేత్ (బ్రహ్మచర్యమునుండిగాని, గార్హస్థ్యమునుండిగాని ఎప్పుడు వైరాగ్యముదయించునో అప్పుడే సన్న్యసింపవచ్చును)"అని శ్రుతి యుపదేశించుచున్నది. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము,

జేత్ గృహాద్వా. "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజే"దితి శ్రుతేః యమనియమప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధిలక్షణాష్టాఙ్గస్స యోగశ్చ కర్మైవ దేహేంద్రియప్రాణమనోనిర్వర్త్యత్వాద్యమాదీనామ్.

23. తత్రయమా ద్వాదశ, అహింసా సత్యమస్తేయమసంగో హ్రీరసంచయః, ఆస్తిక్యం బ్రహ్మచర్యం చ మౌనం స్థైర్యం క్షమాభయమితి నియమాశ్చ- ద్వాదశ బాహ్యశౌచమాభ్యంతరశౌచం జపస్తపో హోమశ్శ్రద్ధా చాతిథ్యమీశ్వరా

---

ప్రత్యాహారము, ధ్యానము, ధారణ. సమాధియనునట్టి యెనిమిదియంగములతోఁగూడిన యీయోగముసైతము దేహము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సునను వానిచే నిర్వర్తింపఁబడియుండుటంజేసి-కర్మలోనే యంతర్భూతమగుచున్నది.

23. అందు యమమనునది-అహింస, సత్యము, అస్తేయము, అసంగము, హ్రీ, అసంచయము, ఆస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, క్షమ, అభయము అను పండ్రెండు భేదములతో నొప్పుచున్నది. నియమముసైతము-బాహ్యశౌచము, అభ్యంతరశౌచము, జపము, తపస్సు, హోమము, శ్రద్ధ, ఆతిథ్యము, ఈశ్వరార్చనము, తీర్థాటనము, పరోపకారచింతనము, తృప్తి, ఆచార్యసేవయను పండ్రెండువిధములుగ నున్నది. ఆసనములు కూర్మము, భద్రము, పద్మము, మయూరము, సిద్ధము, శివము మున్నగు నానాభేదములనొప్పుచున్నవి. ప్రాణాయా

ర్చనం తీర్థాటనం పరార్థేహా తుష్టిరాచార్యసేవనమితి. ఆసనాని
కూర్మభద్రపద్మమయూరసిద్ధశవాదీని బహూని సంతి. ప్రాణా
యామస్త్రివిధః, రేచకః పూరకః కుమ్భకశ్చేతి, ఇంద్రియాణాం
హృదశ్చ విషయేభ్యస్సకాశాత్ప్రతినివర్తనం ప్రత్యాహారః, ధ్యే
యత్వేన మనసి కల్పితస్య వస్తునశ్చింతనం ధ్యానం, తస్మిన్నేవ
వస్తుని మనసస్స్థిరం స్థాపనం ధారణా, సమాధిశ్చిత్తసమాధా
నం, స చ ద్వివిధః. సవికల్పకో నిర్వికల్పకశ్చేతి, సవృత్తికస్స
వికల్పకః నిర్వృత్తికో నిర్వికల్పకః—ఇతి.

24. యదత్ర నియమేషూక్తమీశ్వరార్చనం తద్బా
హ్యం యత్తు ధ్యానం తదాంతరమీశ్వరార్చనమితి వివేకః.

---

మము—రేచకము, పూరకము, కుంభకమునని త్రివిధము. ప్రత్యా
హారమనగా—ఇంద్రియములను, మనస్సును విషయములనుండి
మరల్చుట. ధ్యానమన—మనస్సునందు ధ్యేయముగ కల్పించుకొ
నినవస్తువును జింతించుట. ధారణయన అట్టి ధ్యేయవస్తువునందు
మనస్సును స్థిరముగ నిలుపుట. సమాధియనగా-చిత్తసమా
ధానము. ఇయ్యది సవికల్పకమనియు, నిర్వికల్పకమనియు రెండు
విధములుగ నుండును. అందువృత్తివిశిష్టమైనది అనగా-త్రిపు
టితోఁగూడినది సవికల్పకమనబడును. వృత్తిరహితమైనది నిర్వి
కల్పకమనబడును.

24. పైనఁజెప్పఁబడిన నియమములలో నంతర్భూ
తమగు నీశ్వరార్చనము బాహ్యమనియు, ధ్యానము ఆంతరం

ద్వివిధస్య చాస్య భక్తియోగ ఇతి వ్యవహారః, తస్మాద్భక్తి యోగోఽపి కర్మైవ. దేహేంద్రియాదినిర్వర్త్యత్వాద్భక్తియోగస్య. దేహేంద్రియాదిచేష్టా హి కర్మ, తత్ర బాహ్యమీశ్వరార్చనం నామ విష్ణ్వాదిప్రతిమారాధనం తదేవ గృహస్థస్య నిత్యకర్మతయా విహితం. తత్ర యద్యపి సన్న్యాసినాం నాస్త్యధికారః తథాపి మతిగురూణాం సన్న్యాసినాం తద్దర్శనాదవేవాధికార ఇతి గమ్యతే, యద్వా అంతరీశ్వరమారాధయితుమశక్తానాం విరక్తానాం సన్న్యాసినాం తావత్ప్రతిమావాధికార ఇతి,

---

నీకమగు నీశ్వరార్చనమనియు గ్రహించునది. ఈరెండురీతుల ఈశ్వరార్చనము భక్తియోగమని వ్యవహరింపఁబడును. ఈ భక్తియోగముగూడ కర్మలోనే చేరుచున్నది. ఏలనన- దేహేంద్రియాదివ్యాపారములచే నిర్వర్తింపబడు దానినేగదా 'కర్మ' యని వ్యవహరించుచున్నాము. భక్తియోగముసైతము ఇట్లు దేహేంద్రియాది నిర్వర్త్యమే యగుచున్నది. కావున నిదియుఁ గర్మమే. అందు విష్ణ్వాదిప్రతిమల నారాధించుట బాహ్యమగు నీశ్వరార్చనము. ఇదియే గృహస్థునకు నిత్యకర్మగా విధింపఁబడినది. సామాన్యముగఁ జూచితిమేని యిందు సన్న్యాసుల కధికారము లేదనితోఁచును. కాని బాగుగ పరిశీలించినచో మతగురువులగు సన్న్యాసులలో నీబాహ్యపూజావిధానము సదాచారముగ నుండుటంజేసి యిందు సన్న్యాసులకుసైత మధికారము గలదనియే దోఁచుచున్నది. లేక- కేవలము మాన

ర్చనం నామ మనసి స్వాభీష్టం దేవతా
మానసికై రేవ పత్రపుష్పఫలాదిభి స్త
గృహస్థోపి మానసిక పూజాం కుర్యా దేవ.
తస్య తదసంభవాన్నాస్తి తత్ర గృహ
మ్. తస్మాదస్మిన్నపి భక్తియోగే వి
ర ఆభ్యంతరే.

తత్త్వమ్. అజితాత్మనః పురుషార్థసిద్ధే
కామిభిర్జితాత్మభిర్భవితవ్యమ్. స చాత్ర

---

ధనముఁ జేయు శక్తి జాలనివిరక్తులగు సన్యా
విధానమునందె యధికారమని యైనఁ
ఇక మనస్సునందు తనకభీష్టమగు దేవతా
మానసికములగు పత్రపుష్పఫలాదులతో
చుటయే యాభ్యంతరమగు నీశ్వరార్చ
కమీయాభ్యంతరపూజను సలుపవచ్చును.
సు సాంసారికవిషయములచే విక్షిప్తచిత్త
కి దుర్ఘటముగావున ముందు గృహస్థుల
చెప్పఁబడినది. కావున నీయాభ్యంతర
సైతము విరక్తుడగు సన్యాసికె యధి

యుండలిరహస్యము. ఏమనగా—ఆత్మజ
పురుషార్థము (మోక్షము)

ఆభ్యంతరమీశ్వరార్చనం నామ మనసి స్వాభీష్టం దేవతా విగ్రహం కల్పయిత్వా మానసికై రేవ పత్రపుష్పఫలాదిభిస్తస్య పూజనమ్, యద్యపి గృహస్థోపి మానసికపూజాం కుర్యాదేవ. తథాపి విక్షిప్తచిత్తస్య తస్య తదసంభవాన్నాస్తి తత్ర గృహస్థస్యాధికార ఇత్యుక్తమ్. తస్మాదస్మిన్నపి భక్తియోగే విరక్తస్యైవ యతేరధికార ఆభ్యంతరే.

25. అత్రేదం తత్త్వమ్. అజితాత్మనః పురుషార్థాసిద్ధేస్సర్వైరపి పురుషార్థకామిభిర్జితాత్మభిర్భవితవ్యమ్. స చాత్మ

---

సికముగ నీశ్వరారాధనముఁజేయు శక్తిజాలనివిరక్తులగు సన్యాసులకే బాహ్యపూజావిధానమునందె యధికారమని యైనఁ జెప్పవలసియున్నది. ఇక మనస్సునందు తనకభీష్టమగు దేవతామూర్తిని నిలుపుకొని మానసికములగు పత్రపుష్పఫలాదులతో నామూర్తిని పూజించుటయే యాభ్యంతరమగు నీశ్వరార్చనము. గృహస్థుఁడుసైతమీయాభ్యంతరపూజను సలుపవచ్చును. కాని బహువిధములగు సాంసారికవిషయములచే విక్షిప్తచిత్తుఁడై యుండు నాతనికిది దుర్ఘటముగావున ముందు గృహస్థులకిందధికారము లేదని చెప్పఁబడినది. కావున నీయాభ్యంతర భక్తియోగమునందుసైతము విరక్తుఁడగు సన్యాసికె యధికారము.

25. ఇది యిందలిరహస్యము. ఏమనగా—ఆత్మజయము లేనివారికి పురుషార్థము (మోక్షము)

జయశ్చతుర్విధః దేహజయ ఇన్ద్రియజయః ప్రాణజయశ్చిత్త జయశ్చేతి,తత్ర పూర్వపూర్వజయవత ఏవోత్తరజయసిద్ధిరితి తావద్దేహజయః కర్తవ్యః. దేహజయోనామ యథేచ్ఛం విహరతో దేహస్యైకస్మిన్ కర్మణ్యవస్థాపనం.యద్యపి పశుమారాదయః స్వదేహం పశుహననాదౌ వ్యవస్థాపయన్తి తథాపి న స దేహజయః.విహితే కర్మణి దేహావస్థాపనస్యైవ దేహజయత్వాత్.తస్మాత్ప్రవృత్తి స్వభావతయా స్వత ఏవ కుత్రచిత్కర్మణి వ్యగ్రం దేహం తావత్పురుషకర్మణి విహితే

---

సిద్ధింపదుగాన పురుషార్థకాములగు ప్రతి వారును జితాత్ములగుట యత్యావశ్యకము. ఆత్మజయము— దేహజయమనియు, నింద్రియమనియు, ప్రాణజయమనియు, చిత్తజయమనియు నాల్గువిధములుగనున్నది. ఈజయము క్రమసాధ్యమేగాని ముందువానిఁజయింపక, దరువాతవాని జయించుట యసాధ్యము. కావున మున్ముందు దేహజయమును సంపాదింపవలయును. దేహజయమనగా—యథేచ్ఛగా విహరించు శరీరము నొకనియతమగు కర్మయందు నిలుపుటయే. మాంసమునకై పశువుల వధించువారా యొక్కపనియందే తమదేహమును నియమించుచున్నను నది దేహజయముకాదు. బాగుగ పరిశీలించితిమేని శాస్త్రవిహితమగు కర్మయందు శరీరమును ప్రవర్తింపజేయుటయే దేహజయమగును. కావున ప్రవృత్తిస్వభావమగుటఁజేసి స్వయముగనే విధినిషేధముల నాదరింపక యే దేని

స్థాపయేత్.ఏవం విజితదేహః స్వతఏవ శబ్దాదివిషయవ్యగ్రాన్ శ్రోత్రాదీన్విహితేషు వేదశ్రవణాదిషు నియమయేత్తతోస్యేంద్రియజయస్స్యాత్.ఏవం జితేంద్రియః ప్రాణాయామం విధాయ ప్రాణజయం సంపాదయేత్.న హి ప్రాణాయామం వినా ప్రాణో జేతుం శక్యతే.అస్మింశ్చ ప్రాణజయే సన్న్యాసినామేవాధికారః,ప్రాణాయామినామూర్ధ్వరేతస్కతయా భావ్యత్వాత్.యద్యపి గాయత్రీమంత్రోచ్చారణపర్యంతకాలప్రాణాయామో గృహస్థస్యాపి విషయః, తథాపి దీర్ఘకాలికప్రాణా

---

రెయొక కర్మయందు లగ్నమగుచుండు దేహమును బురుషుఁడు ప్రయత్నపూర్వకముగ విహితకర్మలందుఁ బ్రవర్తింపఁ జేయవలయును. ఇట్లు దేహజయమును సంపాదించినపిదప శబ్దస్పర్శాదివిషయములందు స్వేచ్ఛాసంసక్తములై యుండు శ్రోత్రత్వగాదీంద్రియములను వేదశ్రవణాదివిహితములందు నియమింపవలయును.ఇట్లు జితేంద్రియుఁడైనవాఁడు ప్రాణాయామమును చేసి ప్రాణజయమును సంపాదింపగల్గును. ఏలయన, ప్రాణాయామము జేయక ప్రాణజయము శక్యముగాదుగద! ప్రాణాయామము జేయువారూర్ధ్వరేతస్కులుగానుండవలెగాన ఈప్రాణజయములో సన్న్యాసులకుమాత్రమె యధికారము. గాయత్రీ మంత్రోచ్చారణసమకాలమున జేయు లఘుప్రాణాయామము గృహస్థులకు సైతము స్నానసంధ్యావందనాది కర్మాంగముగ ప్రసక్తమగుచుండును. కాని దీర్ఘకాలిక ప్రాణాయామము మాత్రము గృహస్థవిషయకము గాదని తెలియునది. ఇట్లు ప్రాణ నిరోధరూపమగు

మాయామో న తస్య విషయ ఇతి వేద్యమ్. ఏవంసతి ప్రాణజయే ప్రాణనిరోధాత్మకే మనోజయస్సంభవతి, సత్యోర్హ్యుచ్ఛ్వాసనిశ్శ్వాసయోః ప్రాణవృత్త్యోః మనస్తత్తద్విషయాన్ కామయతే సుఖేన, ఏవం జితమానసః జితేంద్రియో భవతి, మనఃప్రవృత్తిపూర్వకత్వాదింద్రియవ్యాపారస్య. న హి మనసి శబ్దవ్యగ్రే చక్షురున్మీలితమపి రూపం గృహ్ణాతి. ఏవం జితేంద్రియో జితదేహశ్చ భవతి॥ ఇంద్రియవ్యాపారపూర్వకత్వాద్దేహవ్యాపారస్య. చక్షుషా త్వచా వా పురుషో ఘటం గృహీత్వా హి హస్తాభ్యాం గృహ్ణాతి:-న చ హస్తాదయః కర్మేంద్రియాణ్యేవ

---

ప్రాణజయము లభించినప్పుడె మనోజయము సంభవించును. ఏలయన ప్రాణవృత్తులగు నుచ్ఛ్వాస నిశ్శ్వాసము లున్నంతవరకే గదా మాయావిషయములను సులభముగ మనస్సు గోరుచుండుట! ఇట్లు మనస్సును జయించినవాఁడు జితేంద్రియుఁడగును. ఏలయన చక్షురాదీంద్రియములు నెరపు వ్యాపారమంతయు మనస్సుపై ఆధారపడియుండును. మనస్సు శ్రవణేంద్రియముతోఁ జేరి శబ్దమును గ్రహించుసమయమున కన్ను దెఱువఁబడియున్నను నీలపీతాదిరూపముల గ్రహింపఁజాలదు గదా! ఈవిధముగనే శరీరవ్యాపారమంతయు నింద్రియవ్యాపారాధీన మగుటంజేసి జితేంద్రియుఁడగువాఁడు జితదేహుఁడగును. చక్షురింద్రియముచేఁగాని, త్వగింద్రియముచేఁగాని ముందు తెలిసికొనియేగదా పిదప హస్తములచే గ్రహింపఁగడంగును!

న దేహా ఇతి వాచ్యమ్.కర్మేంద్రియాణాం దేహఏవాంతర్భావాత్.తస్మాన్మనోజయవతిస్సులభా అపీంద్రియజయాదయః మనోజయం ప్రత్యుపాయభూతా ఏవేతి కృత్వా తావద్దేహజయాయ నిష్కామకర్మానుష్ఠానమవశ్యం కర్తవ్యమ్.మత్తస్య దేహజయో దుష్కర ఇత్యభిప్రాయాదేవ ఏకాదశ్యుపవాసాదికం విహితం.కూర్మాసనాదీన్యపి దేహజయార్థాన్యేవ.న హి జితేష్వపి దేహాదిషు కదాచిత్కోఽపి విశ్వాసం కుర్యాత్.యేన జితదేహస్య సన్న్యాసినః పునర్దేహజయార్థమాసనవిధానం వ్యర్థమితి చోద్యేత.

---

హస్తాదులు సైతము కర్మేంద్రియములేగాని దేహముగాదుగదాయని శంకింపవలదు. కర్మేంద్రియములన్నియు దేహములో జేరినవేగద! కాగా మనోజయముగలవాని కింద్రియజయాదులు సులభములే యైనను మనోజయమునకివి సాధనభూతములగుటంజేసి మున్ముందు దేహజయమునకై నిష్కామకర్మానుష్ఠానమవశ్య కర్తవ్య మగుచున్నది. మదించియున్నవానికి దేహజయము దుష్కరమను నభిప్రాయముతోనే నేకాదశ్యాదులందుపవాసము విహితమైనది. కూర్మాసనాదులుసహితము దేహజయమున కుద్దేశింపఁబడినవే. ఈదేహము మిక్కిలి దుర్దాంతమైనట్టిది. దీనినొకప్పుడు జయించినను అంతటితో నమ్మియుండుట కవకాశములేదు. ఎప్పటికప్పుడు దానిని శిక్షించి సరియైన మార్గములోనుంచు టావశ్యకము. ఈరహస్యమును

26. ఏవం జితాత్మనే స్వముపపన్నాయ శిష్యాయ వక్ష్యమాణలక్షణం జ్ఞానయోగముపదిశేత్ తత్త్వవిత్. యస్తు అనేవంవిధాయ మహావాక్యోపదేశం కుర్యాత్స పతేదేవ॥ అజ్ఞస్యాశ్రద్ధధానస్య శుద్ధం బ్రహ్మేతి యో వదేత్। మహానరకజాలేషు స తేన వినియుజ్యతే ఇతి శ్రుతేః, నను శ్రౌత ఏవాయం నిషేధో న తు యౌక్తిక ఇతి చేన్నైనమ్, అజ్ఞో హి కర్మణ్యధికృతః ప్రాప్య మహావాక్యోపదేశం చిత్తశుద్ధ్యభావాజ్జ్ఞాన

---

నుత్పత్తిరితి చేసి, విహిత కర్మానుష్ఠానముచే బూర్వమే జితదేహుడై యుండు సన్యాసికి మరల దేహజయార్థము కూర్మాసనాదుల విధించుట వ్యర్థమను శంక గలుగజాలదు.

26. ఈవిధముగ జితాత్ముడై తనకడకు జనుదెంచిన శిష్యునకు తత్త్వవేత్తయగునాతడు ముందుచెప్పబోవు జ్ఞానయోగము నుపదేశింపదగును. ఇట్టియోగ్యతలేనివానికి మహావాక్యముల నుపదేశించువాడు పతితుడై తీరును. "అజ్ఞస్యాశ్రద్ధధానస్య...వినియుజ్యతే (అజ్ఞానకును, శ్రద్ధావిరహితునకును బ్రహ్మతత్త్వము నుపదేశించువాడు మహానరకముల పాలగును.)" అను శ్రుతి యీయర్థమును బోధించుచున్నది. ఈవిషయము శ్రుతిప్రాప్తమేగాని యుక్తిసిద్ధముగాదని శంకింపరాదు. అజ్ఞానదశలో కర్మాధికారియై యుండువాడు మహావాక్యోపదేశమును బొందినచో సరియగు చిత్తశుద్ధి లేకపోవుటచే తత్త్వజ్ఞానము లభింపకుండుటయు, విహితకర్మానుష్ఠాన

మప్రాప్యైవ విహితకర్మత్యాగాత్పతతీత్యస్వారస్యస్యాయౌక్తికత్వాత్. కిఞ్చ అజితాత్మా హి విద్యామదేనాభక్ష్యభక్షణమగమ్యాగమనం చ కుర్వన్ క్రమేణ తాం విద్యామపి విస్మృత్యాధః పతేదేవ, తస్మాజ్జితాత్మనః ప్రశాన్తస్యైవాత్మవిద్యాయామధికారః. అతఏవ శాన్తో దాన్త ఉపరత స్తితిక్షుస్సమాహితశ్శ్రద్ధావిత్తో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యేదితి శ్రూయతే, యద్యప్యుపరతిశ్చిత్తవిక్షేపాభావ ఏవ స సన్న్యాస ఇతి సిద్ధాన్తస్తథాప్యసన్యాసినశ్చిత్తవిక్షేపాభావాభావాదుపరతిస్సన్న్యాస ఇత్యుచ్యతే లక్షణయా॥ అతఏవ సన్న్యాసిన ఏవ జ్ఞానమార్గే వక్ష్యమాణేఽధికారః.

---

మును పరిత్యజించుటయు సంభవించి పతితుఁడగుననువిషయము యౌక్తికమేయగును. మఱియు నజితాత్ముఁడగువానికి బ్రహ్మవిద్య నుపదేశించినచో నాతఁడా విద్యామదముచే నభక్ష్యభక్షణము, అగమ్యాగమనము మున్నగువానిఁ జేయుచు క్రమముగ నావిద్యనుగూడ విస్మరించి యధఃపాతము నొందితీరును. కాగా నాత్మజయము గలిగిన ప్రశాంతుఁడుమాత్రమే యాత్మవిద్యయం దధికారి కావుననే "శాంతోదాంతఉపరత...పశ్యేత్" అని శ్రుతియుపదేశించుచున్నది. ఈశ్రుతివాక్యములోని యుపరతిపదమునకు 'చిత్తవిక్షేపము లేకుండుట'యే సహజమగు నర్థము. కాని సన్న్యాసమర్థము గాదనియే సిద్ధాంతము. అయినను సన్న్యాసిగానివానికి చిత్తవిక్షేపము లేకుండుట యసం

27. యద్యపి గృహస్థస్య విప్రస్య వేదాధ్యయనసత్త్వా దుపనిషదధ్యయనమపి సిద్ధమేవేతి వేదాన్తాధికారోఽస్త్యేవ. తథాపి న గృహస్థస్య బ్రహ్మమీమాంసాయామధికారః. న హి వేదాన్తాధ్యయనమాత్రసత్త్వే న బ్రహ్మమీమాంసాధికార స్సంభవతి. తస్మాద్గృహస్థో వేదాన్తాన్ పఠిత్వా తదర్థమాపాతతో జ్ఞాత్వా తేనైవ నిత్యానిత్యవస్తువివేకసత్త్వాత్తస్య ముముక్షా జాయతే. పశ్చాత్సన్న్యస్యైవ స బ్రహ్మమీమాంసాం కుర్యాత్, బ్రహ్మమీమాంసా చ భగవతా బాదరాయణ

---

భావితముగాన నుపరతిశబ్దమునకు లౌకికముగ సన్న్యాసమే యర్థమని గ్రహించునది. కావున సన్న్యాసికే చెప్పబోవు జ్ఞానమార్గమునం దధికారము.

27. సామాన్యముగ జూచినచో గృహస్థుఁడగు బ్రాహ్మణునకుఁగూడ వేదాధ్యయనకాలమునం దంతర్భూతమగు నుపనిషదధ్యయనము సైతము సిద్ధించియుండునుగాన వేదాంతాధికారముండియేయున్నది. అయినను గృహస్థునకు బ్రహ్మమీమాంసయం దధికారము లేదు. వేదాంతాధ్యయనము చేసినంతమాత్రమున బ్రహ్మమీమాంసయం దధికారము సంభవించదుగదా! అందువలన గృహస్థుఁ డుపనిషత్తులఁ బఠించి దదర్థము నాపాతమాత్రముగ గుర్తించును. తన్మూలమున నిత్యానిత్యవస్తువివేకము గలుగుటం జేసి యాతనికి ముముక్షు (ముక్తి నందవలెననుకోరిక) యుదయించును. అనంతరము సన్న్యసించి

అథాతో బ్రహ్మజిజ్ఞాసేత్యాదిశ్చతురధ్యాయీ. చకృత శ్రీశఙ్కరాచార్యైః సభాష్యాయాస్తస్యా స్త్రశాస్త్రమితి వ్యవహారః. నైతావన్మాత్రేణ షు శాస్త్రత్వం శఙ్కనీయం, వేదాన్తకుసుమగ్రథ రీరకసూత్రాణాం. తస్మాదధీతవేదాంతానామపి ం నశారీరకసూత్రాధ్యయనాధికారః, అతఏవ పా రాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోరితి శారీ రాం భిక్షుసూత్రత్వముక్తమ్. భగవద్గీతాధ్యయనే

---

మాంస (విచారము)కు బూనుకొనవలయును. మాంసను భగవద్బాదరాయణమహర్షి 'అథాతో సా' యను సూత్రముతో నారంభించి నాలుగధ్యా ంథముగ వెలయించెను. తద్భాష్యము శ్రీశంకరా చేత నిం ప్రసిద్ధినందినది. భాష్యముతో గూడిన యీ మాంసకే వేదాంతశాస్త్రమని వ్యవహారము. ఉప ములు శాస్త్రమెట్లగునని శంకింపరాదు. విడివిడిగా పనిషద్వాక్యములనెడి పుష్పములనొక దారమునకు లు శారీరకసూత్రము పూర్వపక్షసిద్ధాంతపఙ్క్తికతో పరచుటంజేసి శాస్త్రత్వం సిద్ధించియున్నది. ఈశాస్త్ర ంటకుపనిషదధ్యయనంచేసినను గృహస్థులకధికారము నే వ్యాకరణసూత్రప్రణేతయగుపాణిని "పారాశర్యశి భిక్షునటసూత్రయోః" అనుసూత్రమున శారీరకసూ

ణేన కృతా అథాతో బ్రహ్మజిజ్ఞాసేత్యాదిశ్చతురధ్యాయీ. తద్భాష్యఞ్చకృత శ్రీశఙ్కరాచార్యైః.సభాష్యాయా స్తస్యా ఏవ వేదాన్తశాస్త్రమితి వ్యవహారః. నైతావన్మాత్రేణ వేదాన్తానామశాస్త్రత్వం శఙ్కనీయం, వేదాన్తకుసుమగ్రథనార్థత్వాచ్ఛారీరకసూత్రాణాం. తస్మాదధీతవేదాంతానామపి గృహస్థానాం నశారీరకసూత్రాధ్యయనాధికారః,అతఏవ పాణినాపి పారాశర్యశలాలిభ్యాం భిక్షునటసూత్రయోరితి శారీరకసూత్రాణాం భిక్షుసూత్రత్వముక్తమ్. భగవద్గీతాధ్యయనే

---

బ్రహ్మమీమాంస (విచారము) కు బూనుకొన వలయును. బ్రహ్మమీమాంసను భగవద్బాదరాయణమహర్షి 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా'యను సూత్రముతో నారంభించి నాలుగధ్యాయముల గ్రంథముగ వెలయించెను. తద్భాష్యము శ్రీశంకరాచార్య ప్రణీతమై ప్రసిద్ధినందినది. భాష్యముతో గూడిన యీ బ్రహ్మమీమాంసకే వేదాంతశాస్త్రమని వ్యవహారము. ఉపనిషద్వాక్యములు శాస్త్రమెట్లగునని శంకింపరాదు. విడివిడిగానున్న యుపనిషద్వాక్యములనెడి పుష్పములనొక దారమునకు గ్రుచ్చినటుల శారీరకసూత్రము పూర్వపక్షసిద్ధాంతయుక్తితో సమన్వయపరచుటం జేసి శాస్త్రత్వం సిద్ధించియున్నది. ఈశాస్త్ర మభ్యసించుటకుపనిషదధ్యయనం చేసినను గృహస్థులకధికారము లేదు కావుననే వ్యాకరణసూత్రప్రణేతయగు పాణిని "పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః" అనుసూత్రమున శారీరకసూ

ఘ గృహస్థోఽప్యధికరోత్యేవ, ఏవం భిక్షుసూత్రాధ్యయనాభావే ఽపి గీతాధ్యయనేన గృహస్థోఽపి తత్త్వం జానీయాదేవేతి కృత్వా కేచిద్గృహస్థస్యాప్యాత్మవిద్యాధికారోఽస్తీతి బ్రువతే. ఏవం తత్త్వస్యాషా ప్రబంధాధ్యయనవశాత్ తత్తద్భాషావిదస్సర్వేఽపి తత్త్వం విద్యురేవ, అతఏవ సర్వేషామపి జ్ఞానేఽస్తి స్త్రీశూద్రాదీనామప్యధికార ఇతి శ్రీశఙ్కరాచార్యా ఊచుః.

28. మమత్వేవం ప్రతిభాతి. యః ప్రశాంతో జితేంద్రియశ్చ ముముక్షయా తత్త్వం జిజ్ఞాసతి జ్ఞాతుం చ శక్నోతి,

---

త్రములను భిక్షు(సన్యాసి)సూత్రములనుగ నిర్దేశించి యున్నాడు. భగవద్గీతాధ్యయనమునందు గృహస్థునకునైత మధికారము గలదు. పైనఁజెప్పినరీతిని భిక్షుసూత్రముల నధ్యయనము సేయుటకధికారము లేకపోయినను భగవద్గీతాధ్యయనముచే గృహస్థుఁడు తత్త్వజ్ఞానమును సంపాదింపవచ్చునని యేర్పడుచుండుటచే గృహస్థునకుఁగూడ నాత్మవిద్యాధికారము గలదని కొందఱు చెప్పుచున్నారు. ఇట్లే ఆయాభాషలలోని ప్రబంధములను పఠించుటమూలమున నాయాభాషలఁ బరిచయముగలవారందరును తత్త్వజ్ఞానమును బడయవచ్చును. కనుకనే స్త్రీశూద్రాదులతోసహ సర్వులకును జ్ఞానమునందధికారము గలదని శ్రీ శంకరాచార్యులు పలికిరి.

28. నాకుమాత్రమిట్లుతోఁచుచున్నది. ఎవఁడు ప్రశాంతుఁడై, జితేంద్రియుఁడై ముక్తినందు తలంపుతో దత్త్వమును

స యేన కేనాపి విధినా తత్త్వం జానీయాదేవ,జ్ఞాతే తు తత్త్వే కూపఖానకన్యాయేన శాస్త్రాతిక్రమణజన్యపాపస్య నిర్మూలం నాశసద్భావాదితి. తస్మాత్తత్త్వజ్ఞానోపయోగిచిత్తశుద్ధ్యర్థం నిష్కామకర్మానుష్ఠానలక్షణం కర్మయోగం గృహస్థః-

శ్రీ శ్రీ శ్రీ

---

దెలియఁగోరునో, అట్లు దెలియసమర్థుఁడై గూడనుండునో యట్టి వాఁడేవిధముగనైనను తత్త్వజ్ఞానమును సంపాదించి తీరును. తత్త్వజ్ఞానముదయించినతోడనే-బావినిత్రవ్వినపుడు శరీరమున కంటుకొనినపంక మాబావిలోనినీటిచేతనే ప్రక్షాళితమగునట్లు-శాస్త్రాతిక్రమణజనితమగు పాపముసమూలముగ నున్మూలిత మగును. పర్యవసానములో-తత్త్వజ్ఞానోపయుక్తమగు చిత్తశుద్ధి గల్గుటకై నిష్కామ కర్మానుష్ఠానరూపమగు కర్మ యోగమును గృహస్థుఁడును, నష్టాంగ యోగానుష్ఠానరూప

శ్రీ శ్రీ శ్రీ

అష్టాంగయోగానుష్ఠానలక్షణం కర్మయో
కుర్యాదితి స దేవః.

ఇతి మోక్షప్రాసాదస్య ప్రథమం కర్
శ్రీ హయగ్రీవార్పణమస్తు
విరోధికృత్ ఫాల్గుణబహుళ ప్ర

---

మగు యోగమును సన్న్యాసియు దప్పక
సారాంశము.

ఇది మోక్షప్రాసాదముయొక్క కర్మసో
ప్రథమసోపానము.

శ్రీ హయగ్రీవార్పణమస్తు

విరోధికృన్నామసంవత్సర ఫాల్గుణ
పాడ్యమినాడు రచింపఁబడె

ఆంధ్రవివరణకర్త
పూర్వమీమాంసాప్రవీణ సన్నిధానం లక్ష్మీనా
మునిసిపల్ హైస్కూలు పండిత
విజయవాడ

కోటేశ్వర ప్రెస్, నరసరావుపే

శ్రీ హయగ్రీవాయ నమః

# అథ

# మోక్షప్రాసాదస్య

## ద్వితీయం జ్ఞానసోపానమ్

1. ద్వావేవ పదార్థౌ ఆత్మా అనాత్మా చేతి. న చ పరమాత్మేతి తృతీయః పదార్థోస్తీతి వాచ్యమ్. స ఆత్మేతి శ్రుత్యా పరమాత్మన ఏవాత్మత్వాత్. న చ తర్హి జీవస్తృతీయో స్తీతి వాచ్యమ్. జీవాత్మనోరభేదాత్ 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్యే'తి శ్రుతేః. తయోరాత్మానాత్మనోరవగతిర్జ్ఞానం, తచ్చాత్మా

---

1. ఆత్మయనియు, అనాత్మ (ప్రపంచము) యనియు రెండుపదార్థములుగలవు. పరమాత్మయను మూడవపదార్థము గలదనుట సరిగాదు. ఏలయన-"స ఆత్మా"అను శ్రుతిననుసరించి పరమాత్మయే ఆత్మయని తెలియుచున్నది. కావున నీరెండును వేర్వేరుపదార్థములు గాజాలవు. జీవుడను వేరొక పదార్థముగలదనుటయు భ్రమయే. కారణమేమన "అనేనజీవేనాత్మనానుప్రవిశ్య" అను శ్రుతిననుసరించి జీవుడాత్మకన్న భిన్నుడుగాడని విదితమగుచున్నది. ఈయాత్మానాత్మలనెఱుంగుటయే జ్ఞానమనబడును. ఈజ్ఞానము ఆత్మానాత్మలలక్షణములపై ఆధారపడి యున్నది. లోకమున సయితము కంబు

అష్టాంగయోగానుష్ఠానలక్షణం కర్మయోగం యతిశ్చావశ్యం కుర్యాదితి సజ్జేపః.

ఇతి మోక్షప్రాసాదస్య ప్రథమంకర్మసోపానమ్

శ్రీ హయగ్రీవార్పణమస్తు

విరోధికృత్ ఫాల్గుణబహుళ ప్రతిపత్

---

మగు యోగమును సన్యాసియు దప్పక చేయవలయునని సారాంశము.

ఇది మోక్షప్రాసాదముయొక్క కర్మసోపాన మనెడి

ప్రథమ సోపానము.

శ్రీ హయగ్రీవార్పణమస్తు

విరోధికృన్నామసంవత్సర ఫాల్గుణ బహుళ

పాడ్యమినాడు రచింపంబడెను.

ఆంధ్రవివరణకర్త

"పూర్వమీమాంసప్రవీణ" సన్నిధానంలక్ష్మీనారాయణమూర్తి

మునిసిపల్ హైస్కూలు పండితుడు

విజయవాడ

---

కోటేశ్వర ప్రెస్, నరసరావుపేట.

నాత్మనోఽర్లక్షణాధీనం.న హి కంబుగ్రీవాదిలక్షణమవిజ్ఞాయ కోఽపి ఘటం జానాతి.

2. తచ్చ లక్షణం స్వరూపం తటస్థం చేతి ద్వివిధం.తత్ర స్వరూపలక్షణమాత్మనస్సచ్చిదానందం "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ.విజ్ఞానమానందం బ్ర"హ్మేతి చ శ్రుతేః.జగజ్జన్మస్థితిలయకారణత్వమాత్మనస్తటస్థలక్షణం."యతో వా ఇమాని భూతాని జాయంతే.యేన జాతాని జీవంతి,యత్ప్రయన్త్యభిసంవిశంతి.తద్బ్ర"హ్మేతి శ్రుతేః.అనృతం జడం దుఃఖఞ్చానాత్మనస్స్వరూపం.కార్యత్వం తు తటస్థలక్షణమనాత్మనః.

---

గ్రీవాదిలక్షణము నెఱుంగక యెవఁడుగాని ఘటాదివస్తువులను గుర్తింపజాలఁడుగద!

2. ఆలక్షణముగూడ స్వరూపలక్షణమనియు, తటస్థలక్షణమనియు రెండువిధములుగ నుండును. అందు "సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" "విజ్ఞానమానన్దంబ్రహ్మ" అను శ్రుత్యనుసారము సచ్చిదానందమే ఆత్మకు స్వరూపలక్షణమని తెలియునది. ఇక 'జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణమై యుండుట' ఆత్మకు తటస్థలక్షణము. "యతోవా...తద్బ్రహ్మ"అను శ్రుతివలన నీయర్థము సిద్ధించుచున్నది. ఇట్లే-అనృతజడదుఃఖాత్మకమైయుండుట అనాత్మరూపమగు ప్రపంచమునకు స్వరూపలక్షణము, కార్యత్వము - అనగా - ఇతరవస్తువులనుండి పుట్టినదై యుండుట తటస్థలక్షణము.

3. కారణత్వాదేవాత్మా సత్యః, కార్యత్వాదేవానాత్మాఽనృతః. యథా కారణత్వాన్మృత్తికా సత్యా, కార్యత్వాద్ఘటాదిరనృతః. "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్య"మితి శ్రుతేః.

4. ఆత్మనా చానాత్మా వేద్యత ఇత్యాత్మా జ్ఞానస్వరూపః, జడస్త్వనాత్మా. న చాత్మాపి మనసాఽనాత్మనా

---

ఆత్మకు సత్యజ్ఞానానందములు స్వరూప లక్షణమనియు, అనాత్మకు అనృతజడదుఃఖములు స్వరూపమనియు పైన పేర్కొన బడినది. ఈయాత్మానాత్మస్వరూపములిక. క్రమక్రమముగ వివరింప బడును.

3. కారణముగావుననే యాత్మ సత్యమైనది. కార్యమగుటం జేసియే యనాత్మభూతమగు ప్రపంచమనృతము. మృత్తునుండి ఘటశరావాదులు బుట్టుచున్నవి. అందు కారణమగు మృత్తు సత్యమనియు, కార్యములగు ఘటశరావాదిరూపము లనృతము లనియు మనకు తెలియును. ఈయర్థము నే "వాచారంభణం... సత్యం" అను శ్రుతి సమర్థించుచున్నది.

4. ఆత్మచే అనాత్మ తెలియబడుచున్నదిగాన ఆత్మ జ్ఞానస్వరూపము, అనాత్మ జడము. ఇచట కొందరు—"మనసైవాను ద్రష్టవ్యం" అను శ్రుతి యాత్మసాక్షాత్కారమునకు అనాత్మ వస్తువగు మనస్సు సాధనమని బోధించుచున్నది. ఐనపుడు తెలుసుకొనునదిగాన మనస్సె జ్ఞానస్వరూపమనియు, తెలియు

వేద్యతే. మనసైవానుద్రష్టవ్యమితి శ్రుతేరితి వాచ్యం, మనసా య ఆత్మానం వేత్తి స ఆత్మైవ వేత్తి. అతఏవ స్వయంజ్యోతిరాత్మా. జ్ఞానం సర్వావభాసకం స్వప్రకాశఞ్చ. న హి జ్ఞానమన్యేన

---

జడమనదిగాన ఆత్మయే జడమనియు నేలచెప్పరాదు? అని శంకింప వచ్చును. సమాధానమునువినుడు—మనస్సుచే ఆత్మ తెలియబడు ననువిషయము సరియైనదే. కాని అట్లాత్మను తెలిసుకొనునది ఆత్మయేకాని మనస్సుకాదు. తెలిసుకొనుటలో మనస్సు ఉపకరణముమాత్రమే. కావుననే యాత్మ స్వయంజ్యోతీ రూపముగ చెప్పబడినది. జ్ఞానము సర్వమును ప్రకాశింప జేయునదిమాత్రమేగాక స్వప్రకాశముగూడ నైయున్నది. అనగా—తాను ప్రకాశించుట కితరాపేక్ష గలదిగాక తనకుతానై ప్రకాశించునది. జ్ఞానముగూడ మఱియొక దాని సాహాయ్యముచే ప్రకాశించునని చెప్పినచో దానిని ప్రకాశింప జేయుటకు మఱియొకటియు, తత్ప్రకాశమునకు వేరొకటియు, ఇట్లనంతములగు ప్రకాశకవస్తువుల నంగీకరింపవలసివచ్చి అనవస్థాదోషము సంక్రమించును. ఇట్లు జ్ఞానస్వరూప మగుటనుబట్టి గూడ ఆత్మ ఇతరముచే తెలియబడునదిగాదు. ఇందుపై మఱియొకశంక బయలుదేఱుచున్నది. ఏమనగా – ఆత్మజ్ఞాతయే (తెలిసుకొనువాడే)గాని జ్ఞానము (తెలివి) గాదుగద.—కాగా పైనచెప్పినట్లు స్వయంప్రకాశాదికము జ్ఞానమునకు సంభవించినను జ్ఞాతయగు ఆత్మకెట్లుఘటించును? అని. ఇందుకు సమాధా

భాస్యతే,అన్యథా అనవస్థాదోషాత్ .ఏవం జ్ఞానస్వరూపత్వాద
ప్యాత్మా నాన్యేన వేద్యతే.న చ జ్ఞాతైవాత్మా న జ్ఞానమితి
వాచ్యం,జ్ఞాతురేవ జ్ఞానం స్వరూపమితి.తచ్చ జ్ఞానమేకమే
వేత్యాత్మైక ఏవ,ఘటాదివిషయభేదాదేవ జ్ఞానభేదవ్యవహారః.

5. స చాత్మా భూమత్వాత్సుఖరూపః,యత్ర నాన్య
త్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా, యో వై

---

నము -ఇతరస్థలములలో జ్ఞాతకును జ్ఞానమునకు నభేదవ్యవహార
మున్నవిషయమును కాదనుటలేదు. కాని యచట జ్ఞానశబ్ద
ముచే ముఖ్యజ్ఞానముగాక, అంతఃకరణవృత్తియే చెప్పబడు
చుండును. ప్రకృతమునందన్ననో అట్లుగాక జ్ఞాతయగు ఆత్మకు
స్వరూపభూతమగుజ్ఞానమును గ్రహింపవలసియున్నది. అట్టిచో
నిక పై శంక కవకాశముండదని విజ్ఞులు తెలియకపోరు. ఇట్టిజ్ఞాన
మొక్కటియేగాని యిందునానాత్వములేదు. జ్ఞానమొక్కటి
యైనపుడు జ్ఞానస్వరూపమైన యాత్మయునొక్కటియే యనక
తప్పదు. ఘటజ్ఞానము, పటజ్ఞానము ఇట్లు నానాజ్ఞానములు
వ్యవహారములో నున్నవిగద. జ్ఞానమొక్కటేయనుటయెట్లు
పొసంగునని కొందరనవచ్చును. అదిసరిగాదు. ఏలయన-నిజము
నకీనానాత్వము జ్ఞేయములగు (తెలియబడు) ఘటపటాది
వస్తువులకు సంబంధించినదేగాని జ్ఞానమునకు చెందినదిగాదు.

5. ఆయాత్మవస్తువు భూమమగుటంజేసి సుఖరూపమై
యున్నది. "యత్రనాన్యత్పశ్యతి...తదమృతమ్"అను శ్రుతి

భూమా తదమృతమితి చ శ్రుతేః. సర్వస్య పుత్రమిత్రకళత్రాదే రాత్మార్థమేన ప్రియత్వేన ప్రియతమత్వాదాత్మా హి సుఖరూపః. సుఖం హి సర్వేషాం ప్రీతివిషయః, ఆత్మనస్సుఖరూపత్వాదేవ సర్వే సుషుప్తిం వాంఛంతి గచ్ఛంతి చ, సుషుప్తావేక ఏవాఽఽత్మానుభూయతే. నాన్యః కోఽపి ప్రపంచః, ఉత్థితశ్చ స్వానుభూతమాత్మసుఖం స్మరతి, సుఖమహమస్వాప్సమితి. తస్మా

---

వలన నీవిషయము తెలియుచున్నది. ప్రతివానికిని తనకుపయోగింతురను కారణమున నేగదా పుత్రమిత్రకళత్రాదులు ప్రియులగుచున్నారు. దీనినిబట్టి యాలోచించినచో వీరికన్న నాత్మ ప్రియతమమని యేర్పడుచున్నది. ఎవరుగానీ ప్రేమించునది సుఖము నేగద! ఆత్మ సుఖరూపమైనది గావున ఎల్లవారును సుషుప్తిని (నిద్రను) కోరుచుండుటయు, దానినిపొందుటయు సంభవించుచున్నది. ఏలయనగా – గాఢనిద్రలో ఆత్మానుభవముమాత్రమే యుండును. కాని వేఱుప్రపంచమేమియు గోచరింపదు. నిద్రనుండి మేల్కాంచినవాఁడు "నేనుహాయి (సుఖము)గా నిద్రించితిని అని తానుభవించిన యాత్మసుఖమును స్మరించుచుండును. కావున నాత్మ సుఖస్వరూపమని యంగీకరింపకతప్పదు. ఇందుపై కొందఱు– "ఆత్మసుఖస్వరూపమగుచో, మనకు గలుగుచుండు సుఖమనిత్యము గావున నాత్మయు ననిత్యముగావలసి వచ్చునుగదా"యని ప్రశ్నింప వచ్చును. కాని మనకుగలుగుసుఖ మనిత్యమగుటకు కారణ

త్సుఖరూపఏవాత్మా.న చైవమనిత్య ఆత్మేతి మన్తవ్యం, తత్త
ద్విషయానిత్యత్వాదేవ విషయసుఖస్యానిత్యత్వం,న తు వస్తుత
ఇతికృత్వా సుఖస్య నిత్యత్వాత్ .అంతర్ముఖమనోవృత్తిప్రతి
ఫలితమాత్మసుఖం హి విషయసుఖమితి వ్యపదిశ్యతే.యథా
ఘటాద్యాకారమనోవృత్తిప్రతిఫలితం చైతన్యం జ్ఞానమితి.
అనాత్మా తు దుఃఖరూపఏవ. దేహాదేస్తథాత్వదర్శనాత్ .న
చ ప్రియత్వాదనాత్మా సుఖరూపశ్చేతి వాచ్యమనాత్మగతస్య

---

మాయాసుఖసాధనములగు విషయము లనిత్యములగుటయే
గాని యన్యముగాదు. కావున సుఖస్వరూపమగునాత్మ నిత్య
మగుట కెట్టిసందియమును లేదు. బాహ్యప్రదేశమునందలి ఘట
పటాదులను మనము గ్రహించునపుడు మనమనోవృత్తి బహి
ర్ముఖమై ఆయాఘటపటాద్యాకారములను ధరించును. అట్టి
వృత్తిలో ప్రతిబింబించిన చైతన్యరూపమగు నాత్మయే 'జ్ఞాన'
మని చెప్పబడుచుండును. అట్లే అంతర్ముఖమైన మనోవృత్తిలో
ప్రతిబింబితమైన సుఖరూపమైన యాత్మయే 'సుఖ'మనివ్యవహ
రింపబడును. అనాత్మయంతయు దుఃఖరూపమే. దేహాదులు
దుఃఖరూపములనునదియందఱెఱిగినదేగద!పుత్రమిత్రకళత్రాదిక
మగు ననాత్మవస్తుజాలమునైతము ప్రియమగుటఁజేసి సుఖ
రూపమనుట సరిగాదు. ఈయనాత్మవస్తువులయందు మనకు
గలుగుచుండు ప్రీతి యాత్మవస్తువును నిమిత్తముజేసికొనికలుగు
నదియేగాని వాస్తవికముగాదు, ఆత్మకు సుఖమునుగలిగించు

ప్రియత్వస్య తస్యాత్మోపాధికత్వేనాతాత్త్వికత్వాత్. ఆత్మనస్సుఖజనకో హ్యనాత్మా ప్రియ ఇత్యుచ్యతే. కిఞ్చ ప్రియోప్యనాత్మా అనిత్యత్వాద్దుఃఖరూప ఏవ. సంసారిణో హి పుత్రాదిషు ప్రీతిం కుర్వాణాస్తన్నాశాచ్ఛోచంతో దృశ్యంతే. న హ్యేవమాత్మరతః పరమహంసశ్శోచతి, నిత్యత్వాదాత్మనః, తస్మాత్సచ్చిదానంద ఆత్మా అనృతజడదుఃఖరూపో నాత్మేతి సిద్ధమ్.

6. ఏవం సత్యత్వేన నిత్యత్వాదేవ ఆత్మా సర్వానాత్మకారణమిత్యుచ్యతే, అసత్యత్వేనానిత్యత్వాదేవానాత్మవర్గః కా

---

టనుబట్టియేగదా యనాత్మ ప్రియమని చెప్పబడుచుండుట! మఱియు ననాత్మవస్తువొకవేళ ప్రియమని యంగీకరించినను అది యనిత్యమగుటచే దుఃఖరూపమనక తప్పదు. పుత్రాదులు ప్రీతిపాత్రములుగనున్నను అవి నశించినపుడు సంసారులెంతగా శోకింతురో మనము చూచుచునేయున్నాము. కాని యాత్మరతుడగు పరమహంస అట్లుదుఃఖింపడుగద! ఇట్లగుటకు కారణమేమి? ఆత్మవస్తువు నిత్యమగుటకన్న వేఱుకారణమేమున్నది. కావున ఆత్మ సచ్చిదానందస్వరూపమనియు, అనాత్మ అనృతజడదుఃఖాత్మకమనియు సిద్ధించుచున్నది.

6. ఇట్లాత్మపదార్థము సత్యమగుటచే నిత్యముగూడ నగుచున్నది. కావుననే అనాత్మభూతమగు సమస్తజగత్తునకు కారణమని చెప్పబడుచున్నది అసత్యముగావున. అనిత్యమగుటం జేసియే యనాత్మవర్గము 'కార్య' మనబడుచున్నది. ఇచట

ర్యమిత్యుచ్యతే. నను కార్యకారణయోస్సాలక్షణ్యనియమా
న్నాత్మకార్యమనాత్మేతి చేన్నైవమ్, అనాత్మకారణస్యాన్యస్యా
భావాత్. అనాత్మనః కార్యత్వేన తత్కారణస్యావశ్యకత్వా
చ్చ. కార్యకారణయోస్సాలక్షణ్యనియమః రజ్జుసర్పాదౌ భగ్న
ఏవ. తస్మాదాత్మైవానాత్మకారణమ్.

---

కొందఱు-"కార్యకారణములు చాలవరకు సమానలక్షణములు గలవై యుండుట (ఘటము-మృత్తు, పటము-తంతువులు ఇత్యాదులలో) మనకనుభవసిద్ధమైయున్నది. కాని కారణమగు ఆత్మ సత్యజ్ఞానానంద స్వరూపమనియు, కార్యమగు అనాత్మ అనృతజడదుఃఖాత్మకమనియు చెప్పుటచే నీరెండు పదార్థములకు సాలక్షణ్యమిసుమంతయు లేకపోగా, పై పెచ్చువైలక్షణ్యము (పరస్పరవిరుద్ధలక్షణములు గల్గియుండుట) తటస్థించుచున్నది. కావున నీకార్యకారణభావము సరిగాదు" అని శంకింపవచ్చును. ఇందుకుసమాధానమును తెలుపుచున్నాము అసలున్నవి ఆత్మానాత్మలు రెండేవస్తువులని మొదటనే నిరూపించియున్నాము. అందనాత్మ కార్యరూపమనియు పేర్కొనియుంటిమి. ఉన్నవి రెండేవస్తువులైనపుడు, అందనాత్మ కార్యరూపమైనపుడు పరిశేషన్యాయముచే ఆత్మ కారణమైయుండక తప్పదుగదా! కారణములేని కార్యముండుటయు సర్వానుభవవిరుద్ధము. ఇంతియగాదు. కార్యకారణములు సమానలక్షణములుగలవై యుండవలెనను నియమముగూడ సార్వత్రికము

7. స చానాత్మా తావదేకఏవ అవ్యాకృతపదార్థః అస్యైవావ్యాకృతస్య మాయేతీశ్వరశక్తిరితి ప్రకృతిరిత్యవ్యక్త మితి చ నామాని సంతి.నీలపీతాదిరూపాని తు న సంతి.స చావ్యాకృతః సత్త్వం రజస్తమశ్చేతి త్రివిధో జాతః.ఏవం త్రిగుణాత్మకాదవ్యాకృతాత్త్రివిధో మహాఞ్ జాతస్తతస్త్రి విధోహఙ్కారో జాతః.తస్మాచ్చాహఙ్కారాత్సాత్త్వికాన్మ నో దేవాశ్చ జజ్ఞిరే.రాజసాత్త్వింద్రియాణి తామసాదహఙ్కా

---

గాదు. రజ్జుసర్పాదులయం దానియమము వ్యభిచరించక తప్పదుగదా! కావున నాత్మయే యనాత్మకు కారణమనుట కెట్టియాటంకమును లేదు.

7. ఆ యనాత్మయొకేలఅవ్యాకృతపదార్థముగ నుండెను. ఈయవ్యాకృతమునకే మాయయనియు, ఈశ్వరశక్తియనియు, ప్రకృతి యనియు, అవ్యక్తమనియు నామములు మాత్రము గలవు. కాని నీలపీతాదిరూపములెవ్వియు లేవు. ఆ యనాత్మ సత్త్వము, రజస్సు తమస్సుఅను మూడువిధములుగ నయ్యెను ఇట్లు త్రిగుణాత్మకమగు అవ్యాకృతమునుండి త్రివిధమగు మహత్పదార్థమును అట్లే మహత్తునుండి త్రివిధాహంకార మును జనియించెను. అందు సాత్త్వికాహంకారమునుండి మన స్సును దేవతలును బుట్టెరి. రాజసాహంకారమునుండి యింద్రి యములును, తామసాహంకారమునుండి'శబ్ద'మను గుణముతోఁ గూడిన యాకాశమును నుత్పన్నములయ్యెను. "తస్మాద్వా. . .

రాత్తావచ్ఛబ్దగుణకమాకాశమాసీత్.న చ ఆత్మన ఆకాశస్సంభూత ఇతి శ్రుతేరాత్మన ఏవాకాశం జాతమితి వాచ్యం,మాయామహదాదిక్రమేణ జాతమితి తదర్థాత్.ఆకాశాద్వాయుశ్శబ్దస్పర్శగుణో జాతః వాయోరగ్నిశ్శబ్దస్పర్శరూపగుణో జాతః.అగ్నేర్జలం శబ్దస్పర్శరూపరసగుణం జాతం జలాచ్చ భూమిశ్శబ్దస్పర్శరూపరసగంధగుణా జాతా.తత్ర యో బాహ్యో వాయుస్స ఏవాంతరః ప్రాణ ఇత్యుచ్యతే.యద్వా యో మహానిత్యుక్తస్స ఏవ ప్రాణః.హిరణ్యగర్భరూపత్వా

---

సంభూతః"అను శ్రుతిననుసరించి ఆత్మనుండి యాకాశము పుట్టినట్లు తెలియుచుండ, తామసాహంకారమునుండి పుట్టినదనుటయెట్లు పొసగునని శంకింపవలదు. ఇతర శ్రుతివచనములతో నీశ్రుతి సమన్వితము గావలెనన్నచో ఆత్మనుండి యాకాశము పుట్టుట మాయామహదహంకారాది క్రమముననేయని యంగీకరింపవలసియున్నది. శబ్దగుణకమగు నాకాశమునుండి శబ్ద, స్పర్శగుణములతోగూడిన వాయువును, అందుండి శబ్ద, స్పర్శ, రూప, గుణములుగల అగ్నియు, దానినుండి శబ్ద స్పర్శ రూప రస గుణములుగల జలమును అద్దానివలన శబ్ద, స్పర్శ, రూప, రస, గన్ధగుణములుగల పృథివియు జనియించెను. అందు బాహ్యదేశమున సంచరించువాయువే శరీరాంతర్భాగమున చరించినపుడు 'ప్రాణ'మని వ్యవహరింపబడును. లేదా— హిరణ్యగర్భతత్త్వము సమష్టిప్రాణమగుటచే మహత్పదార్థమే

న్నమహాత్తః. హిరణ్యగర్భస్య చ సమష్టిప్రాణత్వాదితి. ఏతేభ్యః పంచభ్యో భూతేభ్య ఆకాశాదిభ్య ఈశ్వరేణ మాయినా పంచీకృతేభ్యస్సకాశాత్స్థావరజంగమాత్మకం భౌతికజాతం సర్వం జాతమచేతనం చ పర్వతాదికమితి దిక్.

8. అయమేవానాత్మవర్గో భోక్తురాత్మనో భోగ్యం భవతి. యద్యప్యకర్తాఽభోక్తా చ కేవలఆత్మా తథాపి తత్తదనాత్మతాదాత్మ్యాధ్యాసాత్తం తం భోగమనుభగవతీవ. తథాహి అవ్యాకృతాజ్ఞానాదినామకకారణశరీరాధ్యాసాత్సుషుప్తమానందమజ్ఞానం చాత్మానుభవతి. ఇంద్రియపంచకప్రాణపంచకతన్మాత్రాపంచకాంతః కరణరూపషోడశతత్త్వాత్మక లిఙ్గశరీరతాదా.

---

ప్రాణమని చెప్పబడునని గ్రహించునది. ఈయాకాశాది పంచభూతములును మాయి(వశీకృతమాయుడు, మాయోపాధికుడు) అగు నీశ్వరునిచే పంచీకృతములుకాగా వానినుండిస్థావరజంగమాత్మకమగు చేతనాచేతన భౌతికప్రపంచమంతయుఁబుట్టినది. ఇది సృష్టిక్రమసంగ్రహము.

8. ఆత్మభోక్త. ఆతనకీయనాత్మవర్గ(ప్రపంచ)మంతయు భోగ్యము. నిజమునకాత్మ కర్తృత్వముగాని, భోక్తృత్వముగాని లేని శుద్ధస్వరూపుడే. అట్లయ్యును ఆయాయనాత్మపదార్థముతో తదాత్మ్యమును పొందుటచే ఆయాభోగము ననుభవించుచున్నట్లుండును చూడుము! అవ్యాకృతము, అజ్ఞానము మున్నగు పేర్లతో పిలువబడు కారణశరీరము నభిమానించు

తాత్మ్యాధ్యాసం చ ప్రపద్యస్వప్నాననుభవతి.దృశ్యమానమనుష్య
పశ్వాదిస్థూలశరీర తాదాత్మ్యాధ్యాసమపి ప్రపద్యజాగ్రద్భోగా
ననుభవతి.ఏవమయం తం తం భోగమనుభవంతం యావన్మన్యతే
తావత్సంసారసాగరే మజ్జతి.యావత్తు గురూపదేశాదినా
నిష్కలం నిష్క్రియం శాంతం సచ్చిదానందమాత్మానం
మన్యతే,తదా ముక్తో భవతి.“సమానే వృక్షే పురుషో నిమగ్నో
నీశయా శోచతి ముహ్యమానః,జుష్టం యదా పశ్యత్యన్యమీ
శమస్య మహిమానమితి వీతశోక” ఇత్యుపనిషత్ప్రమా
ణాత్.

---

టంజేసి యాత్మ సుషుప్తికాలములోని యానందమును అజ్ఞాన
మును అనుభవించును. అట్లే పంచజ్ఞానేంద్రియములు, పంచ
ప్రాణములు, పంచతన్మాత్రలు అంతఃకరణమునను పదునాఱు
తత్త్వముల సమష్టిరూపమగు లింగశరీరాభిమానముచే స్వా
ప్నిక పదార్థముల ననుభవించును. ఆవిధముగనే మనకిపుడు
గోచరించుచున్న మనుష్య పశ్వాది స్థూలశరీరముల నభిమా
నించుటమూలమున జాగ్రత్కాలికములగు భోగముల ననుభ
వించును. ఇట్లాత్మ తన్నాయాభోగముల ననుభవించువానినిగ
నెంతకాలము భావించునో అంతవఱకు సంసార సాగరమున
నిమగ్నుడై యుండును. ఎన్నడు గురూపదేశాదులవలన తన
స్వరూపము-నిష్కలము, నిష్క్రియము, శాంతము, సచ్చిదా
నందమునని తెలియునో, అపుడు ముక్తుడగును. ఈవిషయము

9. నను కథమీశ్వరస్యైవ సంసారసముద్రే మజ్జనమితి చేత్పృచ్ఛ! మాయాం. న హి వయం మాయాకృత్యం నిరూపయితుం శక్నుమః. సా హి సర్వమప్యఘటితం ఘటయతి.

10. యద్వా ఏక ఏవాత్మా బింబప్రతిబింబభావే నేశజీవభావం ప్రాప్తః. తత్ర బింబేశ్వరస్య నాంతఃకరణసంసారః కిం తు ప్రతిబింబజీవస్యైవ, ఉపాధేః ప్రతిబింబపక్షపాతిత్వాత్ ॥

---

"సమానవృక్షే...ఏతశ్లోకః" అను ఉపనిషద్వచన ప్రామాణ్యముచే సిద్ధించుచున్నది.

9. "ఈశ్వరుడే సంసారసముద్రములో మునుగుటయా! ఇది యెట్లు?" అను ప్రశ్నను మమ్మడుగకుడు అంతగ నడుగవలసినచో ఆమాయనె యడుగుడు. అఘటిత ఘటనా పటీయసియగు నామాయయొక్క విలాసమును నిరూపించుటకు మే మెంతవారము?

10. లేక ఒకేయాత్మ బింబప్రతిబింబభావముచే ఈశ్వరుడనియు, జీవుడనియు పేర్కొనబడుచున్నాడు. అట్టిచో నీయంతఃకరణకృతమగు సంసారమంతయు తత్ప్రతిబింబభూతుడగు జీవునకు సంబంధించినదేగాని, బింబభూతుడగు నీశ్వరునకు సంబంధించినది గాజాలదు. ఉపాధి ప్రతిబింబపక్షపాతియైయుండుట సర్వానుభవసిద్ధమే. నీరుచలించుచున్నపుడందలి సూర్యప్రతిబింబమే చలించుచుండునుగాని యాకాశమందలి సూర్యబింబము చలింపదుగదా! ఇట్లే అంతఃకరణము సంచరించినపుడు తత్ప్రతి

జలేచలతి ఖలు ఖద్యోతప్రతిబింబఏవ; చలతి న తు గగనగతః ఖద్యోతబిమ్బః. ఏవమంతఃకరణే సంసరతిసతి తత్ప్రతిబింబజీవఏవ సంసరతి న త్వీశ్వరః,ప్రతిబింబస్యాప్యయం ధర్మో న స్వాభావికః,కిం తూపాధికృతఏవేతి వస్తుతోऽసంసార్యేవ జీవః. ఏవమనాదేరంతఃకరణతాదాత్మ్యాధ్యాసాత్సంసరన్నయం జీవో యదా శ్రవణమననాదినా తదంతఃకరణమాత్మప్రవణం విదధ్యాత్తదా స్వస్వరూపం పరమాత్మానమాత్మత్వేన విదిత్వా ముచ్యేత.ప్రతిబింబస్య హి బింబో భవతి స్వరూపమాత్మా చ. అస్య చ విదుషో యావద్దేహపాతమంతః.కరణభంగాభావాజ్జీ

---

బింబ భూతుడగు జీవుడే సంసారియగునుగాని యీశ్వరుడంగా జాలడు. ప్రతిబింబమునకు సైత మీసంసారము స్వాభావికము గాదు. మరేమన అంతఃకరణరూపమగు నుపాధిని నిమిత్తముగ జేసికొని యేర్పడినట్టిదే. కాగా వస్తుస్థితిలో జీవుడసంసారియే ఇట్లనాదియగు నంతఃకరణ తాదాత్మ్యాధ్యాసమువలన సంసారిగానున్న యీజీవుడు శ్రవణమననాదుల ద్వారమున నంతఃకరణము నాత్మప్రవణముగ జేయజాలినపుడు తనను పరమాత్మస్వరూపునిగ గుర్తించి ముక్తుడగును. ప్రతిబింబమునకు వాస్తవికస్వరూపము బింబమేగదా! ఇట్టి తత్త్వవేత్తకు వర్తమానశరీరపాత (వినాశ) పర్యంతము లింగశరీరము భంగము నొందక నిలచియుండుసుగాన జీవన్ముక్తియే లభించును. శరీరపాతమైనపిదప లింగశరీరభంగమగుటచేసి విదేహముక్తియే

వన్ముక్తిరేవ. పతితే తు దేహే లింగభంగాద్విదేహముక్తిరేవ, ఇమామేవ కైవల్యమితి బ్రహ్మసాయుజ్యమితి చ వదంతి.

11. ఇదం చ పరమాత్మవేదనం ప్రత్యక్షమితి పరోక్షమితి చ ద్వివిధమ్. తత్ర ప్రత్యక్షాదేవ సాక్షాన్ముక్తిః. "తద్విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి" ఇతి శ్రుతేః. పరోక్షాద్వేదనాత్తు బ్రహ్మలోకప్రాప్తిద్వారా క్రమముక్తిః. జ్ఞానస్య పరోక్షత్వప్రత్యక్షత్వే తు స్వానుభవైకవేద్యే "అహం బ్రహ్మా"స్మీతి నిశ్చయస్తు ద్వివిధాదపి జ్ఞానాత్సంభవతి. యస్య తు నాస్తి స నిశ్చయస్స పరోక్షజ్ఞాన్యపి

---

సిద్ధించును. ఈవిదేహముక్తినే కైవల్యమనియు, బ్రహ్మసాయుజ్యమనియుఁ జెప్పుదురు.

11. ఈ యాత్మజ్ఞానము ప్రత్యక్షమనియు, పరోక్షమనియు ద్వివిధము. అందు ప్రత్యక్షజ్ఞానమే సాక్షాన్ముక్తిసాధనము. "తద్విద్వాన్...సామ్యముపైతి (తత్త్వజ్ఞానసంపన్నుడు పుణ్యపాప సంబంధ బంధములేక నిరంజనుడై సాక్షాత్పరమాత్మభావమునే పొందుచున్నాడు.)" అని శ్రుతియీవిషయమును తెలుపుచున్నది. పరోక్షజ్ఞానమువలన నన్ననో బ్రహ్మలోకప్రాప్తిద్వారమున క్రమముక్తి లభించును. జ్ఞానము ప్రత్యక్షమా పరోక్షమాయన్న విషయము స్వానుభవైకవేద్యము. "అహంబ్రహ్మాస్మి" (నేనుబ్రహ్మస్వరూపిని) అన్న నిశ్చయము ప్రత్యక్షపరోక్ష జ్ఞానములరెంటను సంభవించును. ఎవనికట్టినిశ్చయముండదో, ఆతడు పరోక్షజ్ఞానికూడ గాజాలడు. రాగద్వేషా

స భవత్యేవ. యస్య తు కామాదిలక్షణహృదయగ్రంథిర్నాస్తి స విద్వాన్కృతాత్మసాక్షాత్కార ఇత్యుచ్యతే. "భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః. క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" ఇతి శ్రుతేః. తస్మాన్ముముక్షుణాఽఽత్మైవ జ్ఞాతవ్యః. "ఆత్మా వాఽరే ద్రష్టవ్య" ఇతి "తమేతం విదిత్వాఽతిమృత్యుమే" తీత్యాదిశ్రుతేః. ఆత్మజ్ఞానాదన్యో నాస్తి ముక్తిమార్గః. "నాన్యః పన్థా విద్యతేఽయనాయే" తిశ్రుతేః. తచ్చాత్మజ్ఞానం శ్రవణమనననిదిధ్యాసనాధీనం. తత్ర శ్రవణం నామ గురుసకాశాద్వేదాన్తశాస్త్రశ్రవణం, మననం నామ శ్రుతియుక్తిభ్యాం తదర్థావధారణం, నిదిధ్యాస

---

లక్షణమగు హృదయగ్రంథి యెవనికి విడివడునో, యట్టివిద్వాంసుడే యాత్మసాక్షాత్కారముగలవాడని చెప్పబడును. "భిద్యతే ...పరావరే" అని శ్రుతి యుపదేశించుచున్నది. కావున "ఆత్మావా రేద్రష్టవ్యః" "తమేతంవిదిత్వాఽతిమృత్యుమేతి" "నాన్యఃపన్థావిద్యతేఽయనాయ" ఇత్యాదిశ్రుతులననుసరించి ముముక్షువున కాత్మజ్ఞానసంపాదన మత్యావశ్యకమనియు ముక్తి నందుటకు వేఱుమార్గము లేదనియు తెలియుచున్నది. ఆ యాత్మజ్ఞానము శ్రవణమనన నిదిధ్యాసనములపై నాధారపడి యున్నది. అందు శ్రవణమనగా-గురుసమీపమునుండి వేదాంతశాస్త్రమునువినుట మననమనగా-శ్రుతియుక్తులతో గురూపదిష్టమైన యర్థమును నిర్ధారణము గావించుట. నిదిధ్యాసనమనగా-ఆత్మ తత్త్వమునందే మనస్సును లగ్నముచేయుట

నం నామాత్మన్యేవమనసః స్థాపనమితి వివేకః. తత్ర మననమేవ జ్ఞానసోపానత్వేనేహోదాహ్రియతే. నిదిధ్యాసనం తు భక్తిసోపానత్వేన వక్ష్యతే.

12. తథాహి గురుణా తత్త్వమసీత్యుపదిష్టమహావాక్యః శిష్యః స్వయం విజనే దేశే తిష్ఠన్నేవం విచారయేత్. "అనాదికాలాదారభ్య జన్మమరణాదిలక్షణసంసారసముద్రే పతితస్య శోచతో జీవస్య మమ కథమసంసారీశ్వరభావః? గురుణా చ

---

యని గ్రహించునది. అందు మననమనునదియే యీ ప్రకరణమున జ్ఞానసోపానముగ నుదాహరింపబడుచున్నది. నిదిధ్యాసనమన్ననో భక్తిసోపాన రూపమున ముందు ప్రకరణమున జెప్పబడును.

12. ఆ మననము చేయురీతియే నిరూపింపబడుచున్నది. గురువువలన "తత్త్వమసి (ఆపరబ్రహ్మమే నీవై యున్నావు)" అను మహావాక్యోపదేశమును బడసి శిష్యుడేకాంతప్రదేశమున గూర్చుండి స్వయముగ నిట్లు విచారింపవలయును. అనాదికాలము నుండి జననమరణప్రవాహరూపమగు సంసారసాగరములో బడి దుఃఖించుచున్న జీవుడను గదా నేను! ఇట్టి నేను అసంసారియగు బ్రహ్మనగుట యెట్లు? గురువులు నాకు జీవేశ్వరుల కభేదమను విషయమును బోధించియున్నారు. అయ్యది శ్రుత్యారూఢమై గూడ నుండుటచే అప్రమాణము గాజాలదు. కాగా దీని కేమి యుపపత్తి? ఔను, నిజమే! వస్తుస్థితిలో జీవుడసంసారియే.

జీవస్యేశ్వరభావ ఉపదిష్టో మమ? స చ శ్రుత్యారూఢత్వాన్న ప్రమాణం,అతః కాన్యస్యార్థస్యోపపత్తిరితి విమృశ్య సత్యమ సంసారిత్వాజ్జీవస్యేశ్వరభావ ఉచిత ఏవ.సంసారో హ్యనాత్మగతః.జన్మసత్త్వవృద్ధివిపరిణామాపక్షయనాశానాం షడ్భావవికారాణాం సంసారసముద్రగతానాం దేహధర్మత్వాత్.క్షుత్పిపాసయోః ప్రాణధర్మత్వాత్సుఖదుఃఖయోర్మనోధర్మత్వాచ్చ.యద్యయం సంసార ఆత్మధర్మస్తర్హి సుషుప్తావపి స ఉపలభ్యేత.ఆత్మా హి సుషుప్తావప్యస్తి,అన్యథా సుషుప్తేరసాక్షికత్వాపత్తేః.కామాదయశ్చ మనోధర్మా ఏవ.కామాదీన్ప్రి

---

అందువలన నాత్మనికీశ్వరభావ ముచితమే. ఈసంసారమంతయు ననాత్మగతమే. సంసార సముద్రగతములగు పుట్టుట, ఉండుట, పెరుగుట,విపరిణామము, అపక్షయము (వినాశోన్ముఖమగుట) నశించుటయను నాఱువికారములును దేహధర్మములై యున్నవి.ఆకలిదప్పులుప్రాణధర్మములు సుఖదుఃఖములు మనోధర్మములు. ఈసంసారమాత్మధర్మమే యగునో సుషుప్తికాలమున సైతమదియుండవలసియుండునుకానియట్లుండుటలేదు.ఆత్మమాత్రము సుషుప్తిలోగూడ నున్నది. సుషుప్తిలో ఆత్మకూడలేనిచో నిక మనము సుషుప్తి ననుభవించితిమనుటకు సాక్షియే లేకపోవలసివచ్చును. కామాదులుసైతము మనోవికారములే యనుట "...సర్వంమన ఏవ" అనుశ్రుతి తెలుపుచున్నది. సుషుప్తిలో మనస్సేయుండనప్పుడిక మనోవికారములగు కామాదులకు

కృత్స్నం సర్వం మన ఏవేతి శ్రుతేః. సుషుప్తౌ మనసోఽభావే కామాద్యభావాచ్చ. ఏవం కామాదిసాహిత్యరాహిత్యయోర్మనోధర్మత్వాదేవ మన ఏవ పురుషస్య బన్ధమోక్షయోర్హేతుః "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః. గుణేషు సక్తం బన్ధాయ రక్తం వా పుంసి ముక్తయే" ఇతి. వస్తుతస్తు బన్ధమోక్షావప్యంతఃకరణగతావేవ. అంతఃకరణస్య విషయాసక్తిర్బన్ధః. అన్తఃకరణనాశ ఏవ మోక్ష ఇతి. న చాన్తఃకరణస్య స్వనాశః కథమ్పురుషార్థ ఇతి వాచ్యమంతఃకరణనాశో జీవస్య పురుషార్థ ఇతి వచనాత్. యద్వా అంతఃకరణమాత్మరూపేణ తిష్ఠతి

---

తా వెట్లు? ఇట్లు కామక్రోధాదులు మనోధర్మములు గాన నే అవియుండుట, లేకపోవుట యను నవి మనస్సుపై నాధారపడియున్నవి. కాగా పురుషునిబంధమునకుగాని మోక్షమునకుగాని మనస్సే కారణము. "మనఏవ...ముక్తయే (మనస్సే మనుష్యుల బంధమోక్షములకు కారణము. సత్త్వరజస్తమోగుణములయందు నాసక్తమైనపుడు బంధకమగును. పరమాత్మయందనురక్తమైనపుడు ముక్తిహేతువగును)" అని శ్రుతిచెప్పుచున్నది. వస్తుస్థితిలో బంధమోక్షములుగూడ నంతఃకరణగతములే. అంతఃకరణము విషయాసక్తమైయుండుట బంధము. అంతఃకరణవినాశమే మోక్షము. ఇందుపై తానునశించుటయే తనకు మోక్షమా? అగునో నిదిపురుషార్థమా (పురుషులచేగోరదగినదె)ట్లగును? అనుశంక కవకాశములేదు, ఏలయన—అంతః

ముక్తావితి న స్వనాశప్రసజ్గః,సర్వం హి కార్యం కారణరూపేణ వర్తమానం సద్వినష్టమిత్యుచ్యతే,యథా భగ్నో ఘటో మృద్రూపేణ వర్తమానస్సన్వినష్ట ఇతి.తదేవం బ్రహ్మణస్సకాశాదుదితమిదం సర్వం జగద్బ్రహ్మైవ.మృద ఉదితో ఘటాదిర్యథా మృదేవ.అతఏవ "సర్వం ఖల్విదం బ్రహ్మేతి"శ్రూయతే. ఏవమాత్మకార్యస్యానాత్మవర్గస్యైవ బ్రహ్మత్వే సతి కా పునర్మమాత్మాంశస్య జీవస్యాత్మభావే విప్రతిపత్తిః?జీవో హ్యాత్మ

---

కరణ నాశమున సిద్ధించెడి పురుషార్థము(మోక్షము) జీవునకు గాని యంతఃకరణమున కనుటలేదుగద! లేక ముక్తిదశలో అంతఃకరణము నశించుటయనగా ఆత్మరూపమై యుండుటయే యని గ్రహించునది. ఘటాదివస్తుజాతముశిథిలమై మృద్రూపముగా నున్నపుడు 'నశించిన'దని చెప్పుచున్నట్లె కార్యజాతమంతయు కారణరూపమైనపుడు వినాశమునొందినట్లు వ్యవహరింపబడును. మృత్తునుండిపుట్టిన ఘటాదికము మృద్రూపమైనట్లే బ్రహ్మనుండిపుట్టినయీజగత్తంతయు బ్రహ్మరూపమే. కావుననే "సర్వంఖల్విదంబ్రహ్మ"అని శ్రుతియుద్ఘోషించుచున్నది. ఇట్లాత్మకార్యమగు అనాత్మవర్గమే బ్రహ్మరూపమైనపుడిక ఆత్మయొక్కయంశమేయగు జీవుడాత్మరూపుడగుటకాటంకమేమి? ఘటాకాశము మహాకాశముయొక్క అంశమైనట్లు జీవుడీశ్వరునియంశమే. కావుననే గీతలలో "మమైవాంశో జీవలోకేజీవభూతస్సనాతనః"

రస్యాంశః. ఘటాకాశ ఇవ మహాకాశస్య. అత ఏవ "మమైవాంశో
జీవలోకే జీవభూతస్సనాతన" ఇతి గీతం భగవతా. అయం
చాంశాంశిభావః కల్పితో మాయయా నిరంశే అపరిచ్ఛిన్నేఽ
ద్వైతే ఆత్మని భూమ్ని. సతి హ్యంతఃకరణాదిద్వైతే ఘటాదినేవ
తేనాత్మనః పరిచ్ఛేదస్స్యాత్. సతి చ పరిచ్ఛేదే గగనవదా
త్మాపి జడ ఏవ స్యాత్. తస్మాదపరిచ్ఛిన్నోఽద్వైత ఏక ఏవా
నంశ ఆత్మా మాయయా పరిచ్ఛిన్న ఇవానేక ఇవ సాంశ ఇవ
ప్రతిభాతి. యథా మాయయా రజ్జుస్సర్ప ఇవ ప్రతిభాతి తద్వత్.

13. నను పరమాత్మా భవత్వేకః. జీవస్తు నైకః, ప్రతి

---

అని భగవానునిచే బోధింపబడినది. నిజమునకీ యంశాంశి
భావము సైతము నిరంశమై, అపరిచ్ఛిన్నమై, అద్వితీయమై, సర్వ
వ్యాపకమైన యాత్మతత్త్వమునందు మాయచే కల్పింపబడినది
యేగాని వాస్తవికముగాదు. ఎట్టిపరిచ్ఛేదమును (విభాగములు)
లేనట్టి యాకాశము ఘటాదివస్తువులచే పరిచ్ఛిన్నమైనట్లు
ఆత్మయు అంతఃకరణము మున్నగు ద్వైతప్రపంచమున్నపుడు
పరిచ్ఛిన్నమగును. పరిచ్ఛిన్నమైనపుడు ఆకాశాదులవలె జడము
గూడ గాకతప్పదు. కాగా అజ్ఞానముచే త్రాడుపాముగ భాసి
చినట్లు అపరిచ్ఛిన్నము, అద్వైతము, ఏకము, అనంశమునగు
ఆత్మ—మాయచే పరిచ్ఛిన్నముగ, అనేకముగ, సాంశముగ
గోచరించుచున్నది.

13. పరమాత్మ యొకడేకావచ్చును. జీవులుమాత్ర

జీవం సుఖాదిభోగభేదాదితి చేన్నైవమ్.అపరిచ్ఛిన్నస్య జీవస్య నానాత్వాయోగాత్, అనన్తో హి జీవః.స చానన్త్యాయ కల్పత ఇతి శ్రుతేః.,అనంతత్వం దేశవస్తుకాలత్రయ పరిచ్ఛేద రాహిత్యం. నిత్యత్వాదాత్మనో జీవస్య న కాలతః పరిచ్ఛేదః. వ్యాపిత్వాన్న దేశతః.సర్వాత్మత్వాన్న వస్తుతః.న చాణుర్జీవ ఇతి వాచ్యమనన్తస్య తస్యాణుత్వాయోగాత్. అతఏవ న మధ్యమపరిమాణోపి.న చాసర్వాత్మా జీవ ఇతి వాచ్యం "పుర

---

మనేకులే. ప్రతిజీవునకును గలుగుచుండు సుఖదుఃఖానుభవములు భిన్నభిన్నములుగ నున్నట్లు మనకు తెలియును. అట్టిచో జీవైకత్వవాద మెట్లుసరిపడును?"అని కొందరుశంకింతురు. అది సరిగాదు.జీవుడపరిచ్ఛిన్నుడుగాననతనికినానాత్వముఘటింపదు. "సచానన్త్యాయకల్పతే"అను శ్రుత్యనుసారము జీవుడనంతుడై యున్నాడు. దేశముచేగాని, కాలముచేగాని, వస్తువుచేగాని విభాగముచేయ శక్యముగాని పదార్థ మనంత మనబడును. జీవుడు నిత్యుడగుటంజేసి 'ఈకాలముననున్నాడు. ఆకాలమున లేడు'అని విభాగముచేయుట శక్యముగాదు. సర్వవ్యాపకుడగుటంజేసి 'ఈదేశమునగలడు-ఆదేశమునలేడు'అని వేరుచేయుటకును వలనుపడదు. సర్వాత్మకుడగుటంజేసి 'ఈవస్తువు జీవస్వరూపము-ఈవస్తువుకాదు'అని విభజించుటయు నసంభవము. కాగా త్రివిధపరిచ్ఛేదములులేని జీవు డనంతుడగుటకు సందియమేమి? కావుననే జీవు డణుస్వరూపుడనియు, మధ్యమ

త్రయే క్రీడతి యస్తు జీవ స్తతస్తు జాతం సకలం విచిత్ర"మితి శ్రుత్యా సర్వకారణస్య జీవస్య సర్వాత్మత్వాత్, స్వప్నే జీవాత్మన ఏవ సర్వజగదుదయస్థితిలయహేతుత్వస్య సర్వవిదితత్వాచ్చ. ఏవమన న్తస్య జీవస్య నానాత్వం కథం సఙ్గచ్ఛేత? సత్సు హ్యనేకేషు జీవేషు తేషామన్యోన్యం వస్తుపరిచ్ఛేదస్స్యాత్. యత్రైకో జీవోఽస్తి తత్రాన్యజీవస్థిత్యయోగాద్దేశ పరి

---

పరిమాణుడనియు, జెప్పుమతములు సయితము నిస్సారములని తెలియవలయును. అనంతపదార్థమున కణుత్వముగాని, మధ్యమ పరిమాణముగాని సంభవించదనుటలో నాశ్చర్యమేమి? జీవునకు సార్వాత్మ్యము లేదనువాదమును భ్రమజనితమే "పురత్రయే... విచిత్రం" అను శ్రుతిననుసరించి సర్వకారణుగా నున్న జీవుడు సర్వాత్మకు డగుటయు నుచితమేగద! ఇంతయేల, స్వప్నావస్థలో బాహ్యేంద్రియ విషయజాతమంతయు నుపరతమై యున్నతరి, నానావిధప్రపంచసృష్టిస్థితిలయములుజరుగుచుండుట కాధారము జీవతత్త్వమునకన్న వేరేమున్నది? వేరేమియు లేదని యందరెఱింగినవిషయమే. ఈవిధముగ విమర్శించుచో జీవు డనంతుడని యేర్పడుచుండ నాతనికి నానాత్వ (అనేకత్వ) మెట్లుఘటించును? జీవులనేకులైన పక్షమున వారిలో పరస్పరము వస్తుకృతమగు పరిచ్ఛేదము ప్రాప్తించును. ఒక జీవు డున్నచోట మఱియొక జీవుడుండుటకు వలనుపడదు గావున దేశనిమిత్తకమగు పరిచ్ఛేదముసయితమనివార్యమగును. ఇట్లు

చ్ఛేదోఽపి స్యాత్.ఏవం పరిచ్ఛేదే సతి జీవస్యాదేవ జడో ఘటాదివత్.న హి పరిచ్ఛిన్నమజడం స్యాత్.న చ జ్ఞానం పరిచ్ఛిన్నమేవేతి వాచ్యం. విషయపరిచ్ఛేదాద్జ్ఞానపరిచ్ఛేద భ్రమ ఏవ.అపి చ యది పరిచ్ఛిన్నా జీవాస్స్యుస్తర్హీశ్వరోఽపి పరిచ్ఛిన్న ఏవ స్యాత్.జీవైరీశ్వరస్య వస్తుతః పరిచ్ఛేదః. యత్ర జీవోఽస్తి తత్ర నేశ్వర ఇతి దేశతః పరిచ్ఛేదోఽపి.ఉభయమపీద

---

జీవునకు పరిచ్ఛేదమునంగీకరించుచో జడత్వమునుగూడ నంగీకరింపవలసివచ్చును. ఏవస్తువుగాని పరిచ్ఛిన్నమై యుండుటయు, జడముగాకుండుటయు ఘటింపదుగద! జ్ఞానమునందన్నచో పరిచ్ఛేదము భ్రమాత్మకమేగాని వాస్తవికముగాదు. అయ్యది విషయపరిచ్ఛేద మూలకము అనగా—జ్ఞేయములగు వస్తువులు భిన్నభిన్నములుగనున్న వగుటంజేసి వానిని గ్రహించుజ్ఞానములుగూడ భిన్నభిన్నములుగనున్నట్లు భ్రమించుచున్నామేగాని నిజమునకు జ్ఞానములో నెట్టిభేదములును లేవు. అది యేకాకారమే. ఇంతియేగాదు. జీవులు పరిచ్ఛిన్నులగుచో నీశ్వరుడును పరిచ్ఛిన్నుడేగావలసి వచ్చును. ఏలయన—జీవులద్వారమున నీశ్వరునకు వస్తుపరిచ్ఛేదము ప్రాప్తించును. మఱియు "జీవుడున్నచోట నీశ్వరుడు లేడ"ని చెప్పుటకు బాధకములేదుగాన దేశపరిచ్ఛేదముసయితము ప్రసక్తమగును. ద్వైతమతావలంబులకుసైత మీశ్వరునకిట్టి పరిచ్ఛేదములు గలవనుట సమ్మతముగాదు. ద్వైతులీశ్వరుని సర్వవ్యాపకునిగను, అనంతుని

మనిష్టం ద్వైతినామపి, ద్వైతినోపి హీశ్వరం సర్వవ్యాపినమ నన్తమాచక్షతే. అన్యథా ఈశ్వరస్య సర్వజ్ఞత్వాదికం న స్యాత్, తస్మాజ్జీవభేదవాదః జీవేశ్వరభేద వాదశ్చ నిర్మూల ఏవ.

14. న చైవం "ద్వాసుపర్ణాసయుజాసఖాయా" ఇతి జీవేశ్వర భేదవాదిన్యాః శ్రుతేః కా గతి రితి వాచ్యమ్. కిమస్మా భిః వేశ్వరయో ర్వస్తుతోఽభేదః ప్రతిపాద్యతే ఉత వ్యవహారతః? ఆద్యే వస్తుతో జీవస్య భోగ ఏవ నాస్తీతి కథ న్తస్యా జీవేశ్వర

---

గను చేయుచున్నారు. అట్లుగానిచో ఈశ్వరునకు సర్వజ్ఞ త్వాదులుసయితము సిద్ధింపకపోవలసి వచ్చును. కావున జీవ భేదవాదమును, జీవేశ్వర భేదవాదమునుగూడ నిరాధారములని యెఱుంగవలెను.

14. ఇట్లగుచో జీవేశ్వర భేదవాదినియగు "ద్వాసు పర్ణాసయుజాసఖాయా" అనుశ్రుతికి గతియేమియని కొందరు ప్రశ్నింపవచ్చును. కాని జీవేశ్వరులకు మేముప్రతిపాదించునట్టి యభేదము వాస్తవికమా లేక వ్యావహారికమాయను విషయ మును గ్రహించుచో నిట్టిప్రశ్నయే పుట్టదు. ఏలయన-వస్తు స్థితిలోజీవునకుభోగమే లేనపుడాశ్రుతి జీవేశ్వర భేదమును బోధిం చు టెట్లుఘటించును? ఇకవ్యవహారమున నన్ననో-జీవేశ్వర భేద మును మేమునంగీకరించుచునే యున్నాము. జీవుడువ్యావహారిక దశలోనున్నంతవఱకు ననాత్మ తాదాత్మ్య ధ్యాసమువలన

భేదవాదిత్వం?ద్వితీయే తు వయమపి జీవేశ్వరభేదం బ్రూమ ఏవ.జీవో హి యావద్వ్యవహారమనాత్మతాదాత్మ్యాధ్యాసాద్భోగానసుభవత్యనేకశ్చ భవతి బిభేతి చేశ్వరాత్. తస్మాద్వావహారికం జీవేశ్వరభేదమనువదత్యేవ సా శ్రుతిః.న తు తత్త్వమసీత్యాదిశ్రుతిప్రసిద్ధమభేదమపలపతి.

15. న చ భేదశ్రుతిరేవ ప్రమాణం,వ్యవహారానురోధాదితి వాచ్యం.భేదశ్రుతేరుపపత్తిశూన్యత్వేన దుర్బలత్వాత్, సా చోపపత్తిర్దర్శితైవ.పునరప్యుపపత్త్యంతరం దర్శయామి. సతి జీవేశ్వరభేదే తయోరేకో ద్రష్టృత్వేన చిద్రూపస్స్యా

---

భోగముల ననుభవించుటయు, నానాత్వముగల్గియుండుటయు, ఈశ్వరునివలన భయపడుటయు అన్నియునున్నవే. కాగా "ద్వాసుపర్ణా"అను శ్రుతి వ్యావహారికమగుజీవేశ్వరభేదమునను వదించునేగాని, "తత్త్వమసి" మున్నగుశ్రుతివచనములచే సిద్ధమగు వాస్తవికమైన యభేదమును బాధింపఁజాలదు.

15. అందుపై కొందరు-తత్త్వమస్యాదివాక్యములభేదమును బోధింపవచ్చును. కాని వ్యవహారానురోధిని యగుటచే భేదశ్రుతియే దానికన్న ప్రబలప్రమాణమని యేలచెప్పరాదు? అనిశంకింతురు. కాని భేదబోధకశ్రుతి నిర్యుక్తికమగుటంజేసి దుర్బలమైయగునుగాని యభేదబోధకశ్రుతికన్న ప్రబలమెన్నటికిఁగాజాలదు. భేదబోధకశ్రుతి దుర్బలమనుట కింతకుమున్నె

వన్యో దృశ్యత్వేనాచిద్రూపస్స్యాత్, తత్ర యదీశ్వర ఏవ ద్రష్టేత్యుచ్యతే, తర్హి దృశ్యస్య జీవస్యేశ్వరదర్శనాయోగాద్వేదాంతశాస్త్రస్యైవ వైయర్థ్యమ్, యది జీవ ఏవ ద్రష్టేత్యుచ్యతే తర్హీశ్వరస్యాసర్వజ్ఞత్వాపత్తిః. యది తూభావపి ద్రష్టారౌ దృశ్యౌ చేత్యుచ్యతే, తర్హి ద్రష్టృదృశ్యధర్మద్వయసాఙ్కర్యం స్యాత్, కిఞ్చ నాన్యోఽతోఽస్తి ద్రష్టేతి శ్రుత్యా ద్రష్ట్రన్తరం నిషిధ్యతే తచ్చానుపపన్నం స్యాదితి జీవాభిన్న ఏవేశ్వర ఏకో ద్రష్టా 'సలిల ఏకో ద్రష్టాఽద్వైత' ఇతి శ్రుతేః. నాపివ్యావహారికో

---

యుపపత్తిచూపఁబడినది. మఱల వేఱొకయుపపత్తినిచటఁజూపుచున్నాము. ఏమనగా—జీవేశ్వరులకు భేదమునంగీకరించినపుడా యిరువురిలో నొకఁడు ద్రష్టయగుటంజేసి చిద్రూపుఁడగును. రెండవవాఁడు దృశ్యత్వమునంజేసి జడరూపుఁడగును. అందును ఈశ్వరుఁడే ద్రష్టయన్నచో దృశ్యరూపియగు జీవుని కీశ్వరదర్శనము సంభవింపదు గావున (ఈశ్వరసాక్షాత్కారమున ముక్తిని బోధించు) వేదాన్తదర్శనమే వ్యర్థముగావలసివచ్చును. అట్లు గాక జీవుఁడే ద్రష్టయన్నచో ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు కాకపోవలసి వచ్చును. జీవేశ్వరు లుభయులును ద్రష్టలు, దృశ్యులునగుదురన్నచో వ్యవస్థితములై (విభిన్నవస్తుగతములై) యుండవలసిన ద్రష్టృత్వదృశ్యత్వములకు సాంకర్యము (ఏకవస్తుగతత్వము) సంభవించును. మఱియు "నాన్యోఽతోఽస్తిద్రష్టా" (ఇంతకన్న ద్రష్టయగువాఁడు వేఱొకఁడు లేఁడు)" అను శ్రుతియు మరియొక ద్రష్ట

జీవేశ్వరభేదో నాపలపనీయ ఇతి వాచ్యమ్,వ్యవహారస్యాజ్ఞాన మూలకత్వాత్.అభేదస్యైవ విద్వద్వ్యవహార సిద్ధత్వాచ్చ. "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ. యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునే"రితిగీతా వచనాన్నైకోఽస్తి వ్యవహారోఽజ్ఞప్రాజ్ఞయోః॥ప్రాజ్ఞో హ్యాత్మ రతిరాత్మక్రీడశ్చ భవతి.అజ్ఞస్తు బాహ్యరతిర్బాహ్యక్రీడశ్చేతి:- నైకోఽస్తి వ్యవహారో విద్వదవిదుషోః. అపి చ విద్వాంస ఏక

---

యున్నాడనుటను నిషేధించుచున్నది. అయ్యది యసంగతము కావలసి వచ్చును. "సలిలఏకోద్రష్టాఽద్వైతః" అను శ్రుతియు జీవాభిన్నుడగు ఈశ్వరుడొకడే ద్రష్ట యని బోధించుచున్నది. 'లోకవ్యవహారసిద్ధమగు జీవేశ్వరభేద మునుమాత్రము కప్పిపుచ్చుట యుచితమా'యని కొందరన వచ్చును. కాని యీవ్యవహారమంతయు నజ్ఞానమూలకమను విషయమును విస్మరింపరాదు. పైపెచ్చు విద్వద్వ్యవహారమున నభేదమే గోచరించుచున్నది. "యానిశా......మునేః" అనుగీతావచనము ననుసరించి అజ్ఞప్రాజ్ఞవ్యవహారములు విభిన్నములనువిషయము విదితమగుచున్నది. ప్రాజ్ఞుడాత్మరతిగల్గి యాత్మవస్తువునందే క్రీడించుచుండును. అజ్ఞుడన్ననో బాహ్య రతినిదగిలి బాహ్యవస్తువునందే క్రీడించుచుండును. కాగా విద్వ దవిద్వద్వ్యవహారము లేకరీతినుండవు. మఱియు ఆస్తికులు దేహా తిరిక్తాత్మవస్తువు కలదనియు, నాస్తికులు దేహమేయాత్మ

ఏవాత్మేతి వ్యవహరన్తి.అవిద్వాంసస్తు నానేతి. యథా ఆస్తికా దేహవ్యతిరిక్త ఆత్మేతి నాస్తికాస్తు దేహ ఏవాత్మేతి.

16. న చైవమేకజీవవాదే చైత్రానుభూతం మైత్రః స్మరేదితి వాచ్యమ్.యేనాన్తఃకరణేనానుభవస్తేనాన్తఃకరణేనైవ స్మరణమితి కృత్వా తద్దోషాయోగాత్.తస్మాదేక ఏవ

---

యనియు జెప్పినట్లు విద్వాంసు లాత్మయొక్కటేయని వ్యవహరించుచున్నారు. అవిద్వాంసు లనేకాత్మలనుచున్నారు.

16 ఇచటకొందఱు–"లోకములో ఏవ్యక్తి యనుభవించిన సుఖదుఃఖముల నావ్యక్తియే కాలాన్తరమున స్మరించుచుండుటను మనము చూచుచున్నాము. కాని పైనఁజెప్పినట్లు జీవుడొకడేయనుపక్షమున చైత్రుడను వ్యక్తిచే అనుభూతములైన సుఖాదులను మైత్రుడను వేరొకవ్యక్తిచేసయితము స్మరింపబడవలసి వచ్చును. కాని యట్లుస్మరించుటను కనము. కావున నేకజీవవాదము సరికాదు"అని శంకింతురు. సమాధానమును వినుడు. జీవుడొకడేకావచ్చును. కాని యాతడు స్వతంత్రముగ సుఖదుఃఖముల ననుభవించడు. అందుకంతఃకరణము ముఖ్యసాధనము లాతనికిఁగావలసియుండును. అట్లేస్మరించుటకునయిత మంతఃకరణమే సాధనము. కాగా ఏసుఖదుఃఖముల ననుభవించుట కేయంతఃకరణము జీవున కాలంబన మయ్యెనో వానిని స్మరించుటకుగూడ నదియేయాలంబన మగుచున్నది. మేము జీవున కేకత్వముఁ జెప్పుచున్నామేగాని యంతఃకరణ

జీవస్య చేశ్వరాదనన్య ఇతి సిద్ధాంతః.

17. నను యద్యేవం జీవేశ్వరాభేద స్తర్హి జీవాతిరిక్తేశ్వరాభ్యుపగమస్యావ్యర్థత్వాన్నిరీశ్వరసాఙ్ఖ్యవాద ఏవాద్వైతిన స్తవ ప్రాప్తః. సాంఖ్యా హి వర్ణయంతి – "మూలప్రకృతి ర వికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త। షోడశకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుష"ఇతి చేన్నైవమ్ వస్తుతో

---

ములకు చెప్పుటలేదు గద! కావున నేక జీవవాదమునం బూర్వోక్తదోషము ప్రసక్తముగాదని గ్రహించునది. పర్యవసానమున–జీవుడొకడే యనియు, అతడీశ్వరుని కన్న భిన్నుడు గాడనియు సిద్ధాంతము.

17. "ఇట్లు జీవేశ్వరుల కభేదమే యగుచో జీవునికన్న భిన్నముగ నీశ్వరునొకని నంగీకరించుటం నిరర్థకమేయగుటం జేసి నిరీశ్వరసాంఖ్యవాదము నే యద్వైతులగు మీరంగీకరించినట్లైనది. సాంఖ్యులు 'మూలప్రకృతి... పురుషః'(మూలప్రకృతి యొక్కటియే సమస్తమునకును ప్రకృతి. అది యేపదార్థమునకును వికృతియును గాదు. మహత్తు, అహంకారము పంచతన్మాత్రలు అనబడు పదార్థము లేడును వక్ష్యమాణషోడశ పదార్థములకు జనకములును, మూలప్రకృతి జన్యములు నగుటం జేసి ప్రకృతులు వికృతులు గూడ నగుచున్నవి. ప్రాణ పంచకము, జ్ఞానేంద్రియ పంచకము. కర్మేంద్రియ పంచకము అన్తఃకరణము అను నీపదునారు పదార్థములును కేవలము వి

జీవస్యానన్యత్వేపీశ్వరాద్వ్యవహారతోఽన్య ఏవేతి జీవాతిరిక్తే శ్వరోఽస్మాభి రభ్యుపగత ఏవ యావద్వ్యవహారమ్, 'భీషాఽస్మా ద్వాతః పవతే'' ఇత్యాదిశ్రుతేః. కిఞ్చ వయం పురుషం సర్వజగత్కారణం బ్రూమ ఇతి కృత్వా న ప్రకృతిర్న వికృతిః పురుష ఇతి వదతస్సాంఖ్యస్య మమ చైకమత్యమ్, యద్యపి పురుష ఆత్మా వస్తుతో న జగత్ప్రకృతిః, వస్తుతో జగత ఏవాభావాత్తథాపి మాయాతో జగత్ప్రకృతిరేవ. అపి చ సాఙ్ఖ్యాః స్వతన్త్రాం ప్రకృతిమేవ జగత్కారణం బ్రువతే వయం తు

---

కృతులై, ఇవి వేనికిని బ్రకృతులుగావు. పురుషుడు(ఆత్మవాంత్రి) ము దేనికిని ప్రకృతియుగాడు వికృతియును (గాడు)" అనియే గదా వర్ణించుచున్నారు! అను నొక శంక వొడముచున్నది వస్తుస్థితిలో—ఈశ్వరుని కన్న జీవుడు వేరుకాక పోయినను వ్యవహారమును బట్టి భిన్నుడే యగుటంజేసి వ్యవహార దశలోనున్నంతవఱకు "భీషాస్మాద్వాతః పవతే" ఇత్యాది శ్రుత్యనుసారము జీవునికన్న భిన్నముగ నీశ్వరుని మేమంగీకరించుచున్నాము. మఱియు మేము పురుషుని(ఆత్మను) సర్వజగత్కారణముగ జెప్పువార మగుటంజేసి 'న ప్రకృతిర్న వికృతిః పురుషః' అని చెప్పు సాంఖ్యులతో మాకేకీభావము చేకూరదు. వస్తుస్థితిలో జగత్తే లేదుగాన పురుషుడు (ఆత్మ) జగత్తునకు ప్రకృతియగుట సంఘటింపక పోవచ్చును. కాని మాయాసృష్టిలో జగత్ప్రకృతి యగుచునే యున్నాడు. ఇంతియేగాదు. సాంఖ్యులు ప్రకృతి

ప్రకృతిరస్వతన్త్రా జడత్వాన్న జగన్నిర్మాణక్షమేతి బ్రూమః, "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినన్తు మహేశ్వరమితి శ్రుతేర్వయం పురుషం మాయినం బ్రూమః, సాఙ్ఖ్యాస్తు నిర్మాయమేవ. తస్మాన్నాస్మాకం సాఙ్ఖ్యవాదః.

18. నను భవన్తో వస్తుతోఽభేదం వ్యవహారతశ్చ భేదం వదన్తీతి భేదాభేదవాదిన ఏవేతి చేన్నైవమ్, దశాభేదేన భేదాభేదయోరుపపన్నత్వేనాదోషత్వాత్. ఏకస్యామేవ దశాయాం భేదాభేదవాదో హ్యనుపపన్నత్వాద్దుష్టః. తస్మాత్

---

స్వతంత్రముగ జగత్కారణమగు ననుచున్నారు. మేమన్ననో ప్రకృతి యస్వతంత్రయనియు, జడమనియు కావుననే జగన్నిర్మాణ క్షమము గాజాలదనియు ప్రాశుక్కచ్చుచున్నాము. "మాయాంతు........ ... మహేశ్వరం" అను శ్రుత్యనుసారము పురుషుడు 'మాయి' (మాయాధిష్ఠానము— లేక వశీకృతమాయుడు) అని చెప్పుచున్నాము. వారో 'పురుషుడు నిర్మాయు' డనుచున్నారు. అందువలన మేము సాంఖ్యవాదమున కంగీకరించితి మనుకొనుట పొరపాటు.

18. పారమార్థికముగ నభేదమును, వ్యావహారికముగ భేదమును నంగీకరించుటంజేసి మీరు భేదాభేదవాదము నంగీకరించినట్లేగదా యని కొందరనవచ్చును. అదిసరిగాదు ఒకేదశలో భేదాభేదముల రెంటిని నంగీకరించుట నిర్యుక్తికమగుటచే నిందితము గావచ్చును కాని దశా (అవస్థా) భేద

వస్తుతః కిమపి ద్వైతం నాస్తి, 'నేహ నానాస్తి కిఞ్చనేతి శ్రుతేః. న చైతావతాస్మాకం బౌద్ధవాదాపత్తిః తే హి జగతోఽత్యంతాపలాపం బ్రువన్తి. వయం తు వ్యవహారతో జగతస్సత్త్వమభ్యుపగచ్ఛామః. ప్రతీయతే బాధ్యతే చేతి మిథ్యైవేదం జగన్న తు శశశృఙ్గాభమ్, ఇతి.

19. నను విజ్ఞానం బ్రహ్మైవ మాయావశాజ్జగద్రూపేణ ప్రతిభాతీతి వదతస్తవ విజ్ఞానవాదిబౌద్ధత్వం ప్రాప్తమితి

---

ముచే భేదాభేదముల రెండింటినంగీకరించుట న్యాయమగుటచే పారమార్థికాభేదమును వ్యావహారిక భేదమును సంగీకరించుటలో దోసము పొసంగదు. కావున "నేహనానాస్తికించన" అను శ్రుతిననుసరించి పరమార్థదశలో నీ ద్వైతప్రపంచ మేమియు లేదు. ఇట్లు చెప్పినంతమాత్రమున బౌద్ధవాదము నంగీకరించినట్లు భ్రమించగూడదు. బౌద్ధులు జగత్తును (శశశృంగముల వలె) అత్యంతాసత్తు ననుచున్నారు. మేమన్ననో వ్యావహారిక సత్యత్వము నంగీకరించుచున్నాము. అజ్ఞాన (వ్యావహారిక) దశలో నీ జగత్తు భాసించుచుండుటయు, విజ్ఞాన (పారమార్థిక) దశలో బాధితమగుచుండుటయు నుండుటచే 'మిథ్య' యేగాని, కుందేటికొమ్మువంటిది (అత్యంతాసత్తు) మాత్రము కాదు.

19. ఇందుపై — "విజ్ఞానరూపమగు బ్రహ్మమే మాయావశమున జగదాకారముగ గోచరించుచున్నదను విజ్ఞా వా

చేన్నైవం, న వయం బౌద్ధా ఇవ క్షణికం విజ్ఞానం బ్రూమః కిన్తు నిత్యమేవేతి, నను కిం విజ్ఞానం సతో బాహ్యార్థస్యాకారం ప్రతిపద్యతే ఉతాసతః? ఆద్యే జగత్సదేవేతి ప్రాప్తం, ద్వితీయే కిమితి శశశృఙ్గాద్యాకారం విజ్ఞానం న ప్రాప్నుయాదితి చేదుచ్యతే, "తస్మాన్న విజ్ఞానమృతేఽస్తి కిఞ్చిత్క్వచిత్కదాచిద్ద్విజ వస్తుజాత" మితి పరాశరవచనాద్విజ్ఞానాతిరిక్తం కిమపి నాస్త్యేవ. మాయయా తు విజ్ఞానే బ్రహ్మణి జగత్క

---

దమునకును, బౌద్ధుల విజ్ఞానవాదమునకును భేదములేకపోవలసి వచ్చును" అని కొందరు శంకింపవచ్చును. కాని ఇందలితత్త్వమును మిక్కిలి మెలకువతో తెలియవలసియున్నది. మేము బౌద్ధులవలె విజ్ఞానము క్షణికమనుటలేదు. మఱినిత్యమనుచున్నాము. మఱియు బౌద్ధులు విజ్ఞానమె బాహ్యార్థముల (వస్తువుల) యాకృతిని ధరించుచున్నదనుచున్నారుగద! అట్టిచో—వాస్తవికములగు బాహ్యార్థములుండుట నంగీకరించి తదాకారమును విజ్ఞానము పొందుచున్నదనియా వారియాశయమా? లేక—బాహ్యార్థములనునవి ప్రత్యేకముగ లేకనే వాని యాకృతిని ధరించుచున్నదనియా? అని విమర్శింపవలసియున్నది. మొదటిపక్షమున—జగత్తు సద్రూపమని యొప్పుకొనుచున్నది, కాని యిదివారికి సమ్మతముగాదు. ఇక రెండవపక్షమునో — ఈవిజ్ఞానము (వ్యవహార సిద్ధములగు) బాహ్యార్థముల యాకృతినే ధరింపనేల? (అత్యంతాసత్తులగు

ల్పితం. తజ్జగదాకారస్తు సాభాసమంతఃకరణం ప్రతిపద్యతే, సాభాసమంతఃకరణం హి చక్షుర్ద్వారా బహిర్నిర్గత్య ఘటాత్మనా పరిణమతే. స ఏషో౽న్తఃకరణ పరిణామ ఏవ వృత్తిరిత్యుచ్యతే. ఇయం చ వృత్తిః క్షణికా, ఇమామేవ వృత్తిం విజ్ఞానమితి బౌద్ధాః, జ్ఞానమితి తార్కికాదయశ్చ వదన్తి. న తు నిరవయవస్య నిర్వికారస్య చ బ్రహ్మణః కదాచిదపి జగదాకారతాపత్తిర్యేన జగత్సత్యత్వాదికం చోద్యేత, తస్మాద్ఘటాదిజగ

---

శశ్వత్వంగా మలయాకృతి నిర్ధరింపకుండు టెల? అను ప్రశ్నకు వారు సముచితమగు సమాధాన మీయజాలకున్నారు. కాని యద్వైత మతానుసారమీ విషయమిట్లు పరిష్కృతముగావచ్చును, "తస్మాన్న విజ్ఞానజాతం..... (విజ్ఞానరూపమగు ఆత్మతత్త్వముకన్న భిన్నమగు వస్తుప్రపంచ మెన్నడుగాని లేదు) అను పరాశర వచనము ననుసరించి విజ్ఞానాతిరిక్తమగు పదార్థమేదియు లేనేలేదు. విజ్ఞానాత్మకమగు బ్రహ్మమునందు మాయచే జగత్తు కల్పింపబడినది. చైతన్య ప్రతిబింబముతో గూడిన యంతఃకరణమె జగదాకారమును పొందుచున్నది. అదియెట్లనగా—చిత్ప్రతిబింబముతో గూడిన యంతఃకరణమె చక్షురాదీంద్రియముల ద్వారమున వెలుపలకు వచ్చి ఘటాదిరూపమున పరిణమించును. అయ్యాయ అంతఃకరణ పరిణామములకే 'వృత్తి' యని నామము. ఇయ్యది క్షణికము. ఈ వృత్తినే బౌద్ధులు 'విజ్ఞాన'మని వ్యవహరించుచున్నారు. తార్కికులు మున్నగువారు 'జ్ఞాన'మని చెప్పుచున్నారు. సావ

ద్రూపేణ పరిణమమానాద్వృత్తిరూపాత్క్షణికాచ్చ విజ్ఞానాద
న్యదేవాపరిణతం బ్రహ్మనామకం విజ్ఞానం నిత్యమ్.

20. న చాద్వైతే కేవలే బ్రహ్మణి మాయాపి కథంస్యాదితి
వాచ్యమ్. యస్య జగద్భ్రమోఽస్తి తద్దృష్ట్యైవ బ్రహ్మణి మాయాఽస్తి
యథా ఘూకదృష్ట్యైవ సూర్యే తమః, యస్య పునరాత్మజ్ఞస్య న
జగద్భ్రమః, తద్దృష్ట్యా బ్రహ్మణి నైవాస్తి మాయా. యథా మను
ష్యాదిదృష్ట్యా సూర్యే నాస్తి తమః, తత్ర యా భ్రాంతదృష్టిస్సైన

---

యవములగు పదార్థములు పదార్థాంతరములుగ పరిణమించుట
కవకాశముండునేగాని నిరవయవమై నిర్వికారమైన బ్రహ్మము
జగద్రూపముగ పరిణమించు టెన్నటికిని ఘటింపని
విషయము. కాగా—జగత్తుసత్యమనుశంకకు తావేలేకుండ పోయి
నది. కావున ప్రాపంచికములగుఘటాదిరూపములం బరిణమించు
చుండెడి 'వృత్తి' రూపమగు విజ్ఞానమునకన్న పరిణామర
హితమునిత్యమునగుబ్రహ్మవిజ్ఞానముసర్వవిధముల భిన్నమైనది.

20. అద్వితీయమగు కేవలబ్రహ్మతత్త్వమందుమాయ
కుమాత్రము తావెక్కడ?' అని శంకింప నవసరములేదు.
జగద్భ్రాంతి కలవానికి మాత్రమే (భ్రాంతదృష్టిచే) బ్రహ్మ
మునందు మాయయుండుటయును, తత్త్వవేత్తయగు ఏమహా
త్మునకు ప్రపంచభ్రాంతి నశించెనో, వాని (తత్త్వ) దృష్టి
ననుసరించి బ్రహ్మమునందు మాయ లేనేలేదు. గ్రుడ్లగువ్వ

న్వ్యవహారదశేతి. యాతు తత్త్వదృష్టిస్సైవ పరమార్థదశేతి చోచ్యతే తథాచ తత్త్వదృష్ట్యా బ్రహ్మణి మాయాయా ఏవాభావాదద్వైతమేవ బ్రహ్మ, యద్వా అగ్నేఃస్వదాహకత్వశక్త్యా యథా న సద్వితీయత్వం తథా బ్రహ్మణఃస్వశక్త్యా మాయయా న సద్వితీయత్వమ్. న చైవమగ్నిశక్తేరివ బ్రహ్మశక్తేరపి యావద్ద్రవ్యనాశమనాశ ఏవ. బ్రహ్మ చ నిత్యత్వాన్న నశ్యతి నైవ మాయాయా నివృత్తిరిత్యనిర్మోక్షఏవేతి వాచ్యమ్,

---

(దివాంధము) చూపునకుమాత్రమె సూర్యునియందు తమస్సు గోచరించునుగాని మానవదృష్టికట్లు గోచరింపదుగద! అందు భ్రాంతదృష్టియె వ్యవహారదశయనియు, తత్త్వదృష్టి పరమార్థదశయనియుఁ జెప్పఁబడును. కాగా — తత్త్వదృష్టిలో బ్రహ్మయందు మాయయే లేకపోవుటనుబట్టి బ్రహ్మవస్తువద్వైతమనుటకెట్టి యాటంకమును లేదు. లేక — అగ్నిలో 'దాహశక్తి' యున్నట్లంగీకరించుచు చున్నాము. అంతమాత్రమున (శక్తి యొకటి యున్నంతమాత్రమున) అగ్నిని రెండుపదార్థములని యెవరును భావించుటలేదు. అట్లేమాయయు బ్రహ్మశక్తియె యగును తన్మూలమున బ్రహ్మకు సద్వితీయత్వము ప్రసక్తముకాదు. కాని యిట్లు చెప్పినపుడు "అగ్నియొక్క శక్తి అగ్నియున్నంతకాలముండును అగ్ని నశించినపుడు తానును నశించును. అంతియేగాని అగ్నియుండగా — తచ్ఛక్తి నశించుట యనునది యస్వాభావికము, అట్లేమాయయు

యథా మన్త్రౌషధాదినా అగ్నేస్సత్త్వేపి తద్గతదాహకత్వశక్తే ర్నివృత్తి స్తథా తత్త్వజ్ఞానాన్మాయాయా నివృత్తిః, జ్ఞానాజ్ఞాన యోర్విరోధాత్. ఇదం చ మాయానివర్తకం జ్ఞానం న బ్రహ్మణః స్వరూపభూతం.మాయాబ్రహ్మణో ర్నాశ్రయాశ్రయి

---

బ్రహ్మశక్తియైనపుడు బ్రహ్మ నశించినగాని మాయనశించుటకు నవకాశములేదు. కాన నిత్యమగు బ్రహ్మ వస్తువు నశించునదిగాదు. కాగా మాయయు నశించునది గాదని యేర్పడుచున్నది. మాయ నశింపకున్న నేమందురా? ఇక ముక్తికి ప్రసక్తియే లేకపోవలసి వచ్చును గద!" అని శంకయుదయించుటకవకాశము లేకపోలేదు. కాని దీనికి సమాధానమును లేకపోలేదు. వినుడు—అగ్నియందు దాహకత్వ శక్తి బొత్తుగా నశింపకున్నను మణి మంత్రౌషధాదుల బలమున (అగ్నియుండగనే) నివృత్తమగుట సంభావితమే గదా! ఆవిధముగనే బ్రహ్మము నిత్యమే యైనను తత్త్వజ్ఞానముచే బ్రహ్మలోని యజ్ఞానరూపమగు మాయాశక్తి నివర్తించును. జ్ఞానాజ్ఞానములకు తేజస్తిమిరములకువలె విరోధమున్న విషయము సర్వవిదితమే. కాగా ముక్తికెట్టి విపత్తియు నుండబోదు. ఈయజ్ఞానరూపమగు మాయను నివర్తింపజేయునట్టి జ్ఞానము బ్రహ్మస్వరూప జ్ఞానము మాత్రము గాజాలదు. అట్లగుచో పరస్పర విరోధముగల నీరెండు(మాయ—బ్రహ్మ) పదార్థములకు నాశ్రయాశ్రయిభావమే సంభవింపక పోయియుండును. పరస్పర

ఘావేనావిరోధాత్. కిం తు బ్రహ్మాకారపరిణతాంతఃకరణ
వృత్తిరూపమహంబ్రహ్మాస్మీతి నిశ్చయజ్ఞానం.

21. నను యది విదుషాజ్ఞానేనబ్రహ్మనిష్ఠా మాయా నాశితా తర్హి నిర్మాయమేవ తద్బ్రహ్మేతి కథమ్పునస్తస్మాద్బ్రహ్మణస్సంసారోదయః? ఏకముక్తేరేవ సర్వముక్తేర్భవితవ్యత్వాదితి చేన్నైవమ్. యస్య మణిమంత్రాదికమస్తి తస్యైవాగ్నిరదాహకః, నాన్యస్య. ఏవం యస్య తత్త్వజ్ఞానమస్తి తస్యైవ బ్రహ్మ సంసారాజనకం నాన్యస్యేతి.

---

విరుద్ధములగు వస్తువు లొకదాని నాశ్రయించి మరియొకటి యుండుటెందును గానము గద! మరేమన—బ్రహ్మాకారాకారితమైనయంతఃకరణవృత్తిరూపమగు అహం బ్రహ్మాస్మి, అనునిశ్చయాత్మక జ్ఞానమే మాయను నివర్తింప చేయునది,

21. తత్త్వవిదుడు జ్ఞానముచే బ్రహ్మాయందలి మాయను నశింపజేసి నప్పుడా బ్రహ్మము మాయా విరహిత మగుచున్నది గదా! అట్టిశుద్ధ బ్రహ్మ పదార్థము నుండి మరల సంసారము(ప్రపంచము)దయించుటెట్లు ఘటించును? కాగా ఒకడు ముక్తుడగుచో (వానిజ్ఞానముచే బ్రహ్మనాశ్రయించియున్న మాయ నశించినదిగాన) సర్వులును ముక్తులు గావలసి యుండునుగదా యని యడుగ వచ్చును. కాని యెవనికి మణి మంత్రౌషధాదులు గలవో వానికి మాత్రమే అగ్నిదాహకము గాక తదితరులకు దాహకమగునట్లు తత్త్వజ్ఞానము గలవానికిమాత్రమే

**22.** నన్వేవం జీవన్ముక్తస్య విదుషస్సంసారాభావో భవతు,విదేహముక్తస్య తు బ్రహ్మసాయుజ్యప్రాప్త్యా అహం బ్రహ్మాస్మీతి జ్ఞానాభావాద్భవేదేవ సంసార ఇతిచేన్నైవం సంస్థాః.యథాఽగ్నిరాత్మానం న దహతి ఏవం బ్రహ్మాప్యాత్మభూతం ముక్తం న సంసారయతి—యద్వా ద్వివిధం బ్రహ్మ సమాయం నిర్మాయం చేతి.తత్ర సమాయం బ్రహ్మ ఈశ్వర ఇత్యుచ్యతే.నిర్మాయం తు కేవలమితి,ఈశ్వరః పునరవిద్వాం సమేవ సంసారయతి న తు విద్వాంసం,యథా రాజా చోరమేవ శిక్షయతి నాచోరం.యథా చ మర్త్యః పశుమేవ హినస్తి నాత్మానం. విద్వాన్ ఖల్వీశ్వరస్యాత్మభూతః, "జ్ఞానీ త్వాత్మైవ మే మతమితి గీతావచనాత్,స చ విద్వాన్ దేహపాతే

---

మాయా విలయమగుటంజేసి శుద్ధమగుబ్రహ్మపదార్థముసంసార సంపాదక కాకము పోవచ్చునుగాని.యితరుల కేల కాకపోవును!

22. జీవన్ముక్తుడగు విద్వాంసునకుసంసార సంబంధము నశించుగాక. కాని విదేహముక్తుడుబ్రహ్మ సాయుజ్యము నధిగమించిన వాడగుటంజేసి యాతనికి అహంబ్రహ్మాస్మి, యను జ్ఞానముండుట కవకాశము లేకపోవుటచే సంసారము తప్పనిసరియగును గదా! యని కొందరు పూర్వపక్షముం జేయుదురు. కాని—అగ్నిస్వేతర పదార్థముల దహించును గాని తన్నుందా దహించనట్లు బ్రహ్మయుస్వస్వరూపి యైన ముక్తుని సంసారినిగ జేయదని వారుగ్రహింప వలసియున్నది. లేదా—బ్రహ్మము

నిర్మాయమేవ బ్రహ్మ ప్రాప్నోతి న తు సమాయమితి న ముక్తస్య సంసారాపత్తిర్నాప్యజ్ఞజనస్య విద్వన్ముక్త్యా నిర్ముక్తిః. నన్వేకమేవ బ్రహ్మేతి కథం తస్య ద్వైవిధ్యమితి వాచ్యం. వస్తుత ఏకమపి వ్యవహారతో ద్వివిధమేవ ఇతి.

---

సమాయమనియు, నిర్మాయమనియు ద్వివిధము. అందు సమాయము బ్రహ్మమేయీశ్వరుడనంబడును. నిర్మాయము కేవల (శుద్ధ) బ్రహ్మము. ఈశ్వరుడజ్ఞానిని మాత్రమె సంసారినిగ జేయును కాని విజ్ఞునట్లు చేయడు. లోకమున నైతము దొంగతనము జేసిన వానినే రాజుశిక్షించును గాని చేయని వానిని శిక్షింపడుగద! మఱియు మనుజులు (స్వేతరములగు) పశ్వాదులను హింసించుచుండుటను చూచుచున్నాము. కాని తమ్మున్ దాహింసించుకొను వారినెచ్చటను గాంచము. జ్ఞానినైత మీశ్వరుని కాత్మభూతుడను నీయంశమును "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అనుగీతావచనము పదేశించుచున్నది. అట్టిజ్ఞాని వర్తమాన దేహావసానమున నిర్మాయముగు బ్రహ్మస్వరూపమును బొందును. కాగా—ముక్తునకు మరల సంసార ప్రసక్తిగాని, జ్ఞాని ముక్తుడగుచో నజ్ఞానులు నైతము ముక్తులగుటగాని ఘటింపదని యెఱుంగునది.

ప్ర॥ ఒక్కటియే బ్రహ్మమని వెనుకం జెప్పియుంటిరి కద. మరల నిపుడు సమాయ, నిర్మాయ భేదముచే ద్వివిధముగనున్నదనుచున్నారె! ఇందేది సత్యము?

ఉ॥ వస్తుస్థితిలో బ్రహ్మమేకరూపమే కాని వ్యవహా

23 ఇయం చ కైవల్య లక్షణా ముక్తిః పదార్థతత్త్వజ్ఞానాధీనేత్యుక్తమ్. పదార్థా చ దర్శితావాత్మానాత్మానౌ, తత్ర ఆత్మనస్తత్త్వం బ్రహ్మైవ. బ్రహ్మణ ఏవాత్మత్వాత్ అనాత్మనాం చ తత్త్వం బ్రహ్మైవ. కల్పితస్య హ్యధిష్ఠానమేవ తత్త్వం కార్యస్య చ కారణమ్ ఏవం బ్రహ్మణస్తత్త్వాదేవ తత్త్వం నారాయణః పర ఇతిశ్రూయతే,యద్యప్యేవంబ్రహ్మైకమేవ తత్త్వం, తథాపి కేచిత్ చతుర్వింశతితత్త్వాని వ్యవహారంతి, ప్రకృతిః మహాన్ అహఙ్కారః దశేంద్రియాణి భూతపఞ్చకం ప్రాణపఞ్చకం పురుషశ్చేతి, కేచిత్పఞ్చవింశతితత్త్వాని ఈశ్వరేణ సహ తాన్యేవ, కేచిత్ షడ్వింశతి తత్త్వాని

---

రమును బట్టి యీభేదము కల్పింపబడినవి. కాన నిందు విరోధ మేమియు లేదు.

23 కైవల్య రూపమగు ఈముక్తి పదార్థ తత్త్వజ్ఞానాధీనమని మున్ను తెలిపి యున్నాము. పదార్థమును నయితమాత్మానాత్మ భేదమున రెండని నిరూపించి యున్నాము.అందు- కల్పిత వస్తువు(సర్పము)యొక్క తత్త్వము అనగా-సత్యస్వరూపము అధిష్ఠాన (రజ్జ్వాదిక) మైనట్లు కార్యము యొక్క తత్త్వము కారణ మైనట్లు అనాత్మ యొక్క తత్త్వము బ్రహ్మమేగాని తదన్యము గా జాలదు. ఇట్లు బ్రహ్మము తత్త్వస్వరూపము గావుననే "తత్త్వం...పరః (పరబ్రహ్మస్వరూపియగు నారాయణుడే పరమార్థ తత్త్వము)"అని శ్రుతి తెలు

బ్రహ్మణా చ సమం తాన్యేవ, కేచిత్ సప్తవింశతి తత్త్వాని, మనసా చ సమం తాన్యేవ కేచిద్ద్వాత్రింశత్తత్త్వాని శబ్దాదితన్మాత్రా పఞ్చ కేనాపి సహ తాన్యేవ, కేచిదష్టత్రింశత్తత్త్వాని ధనంజయాద్యుపవాయుపఞ్చకేనాపి సమం తాన్యేవ. వస్తుతస్తు బ్రహ్మ తదుపాధిః ప్రకృతిః జీవః, తదుపాధిరవిద్యా అంతఃకరణఞ్చ. త్వక్చక్షుః శ్రోత్రం జిహ్వా ఘ్రాణఞ్చేతి జ్ఞానేన్ద్రియపఞ్చకం, వాక్పాణిపాదపాయూపస్థాఖ్యకర్మేంద్రియపఞ్చకం, శబ్దస్పర్శరూపరసగంధపఞ్చకం పృథివ్యప్తేజో వాయ్వాకా

---

పుచున్నది. ఇట్లు బ్రహ్మ యొక్కటే తత్త్వమై యున్నను కొందఱు—ప్రకృతి, మహత్తు, అహఙ్కారము, పంచ జ్ఞానేన్ద్రియములు, పంచ కర్మేన్ద్రియములు, పంచభూతములు, పంచప్రాణములు, పురుషుడు అను ఇరువదినాల్గు తత్త్వము లనుచున్నారు. మరికొందరు—ఈశ్వరునితో గలసి యిరువదియైదు తత్త్వములని చెప్పుచున్నారు. ఇంకను కొందరు—బ్రహ్మను గూడ జేర్చి యిరువదియారు తత్త్వములని పలుకు చున్నారు. మనస్సును సయితము లెక్కించి యిరువదియేడు తత్త్వములని మరికొందరందురు. పంచతన్మాత్రలను గూడ జేర్చి గణించి ముప్పదిమూడు తత్త్వము లను వారు నింకకొందరు గలరు. ఉపవాయు పంచకమును గూడ జేర్చి ముప్పదియెనిమిది తత్త్వము లను వారును లేకపోలేదు. కాని వస్తుస్థితిలో—బ్రహ్మ, తదుపాధియగు ప్రకృతి జీవుడు తదుపాధియగు అవిద్య. అంతః

శపంచకం చేతి పఞ్చవింశతి తత్త్వాని. తత్రాన్తఃకరణం శక్తిద్వయాత్మకం, జ్ఞానశక్తిః క్రియాశక్తిశ్చేతి శక్తిద్వయం. తత్ర సంశయ నిశ్చయ గర్వ స్మరణాఖ్య వృత్తి భేదాత్ మనోబుద్ధ్యహఙ్కారచిత్త నామభిశ్చతుర్ధా జ్ఞానశక్తిర్వ్యవహ్రియతే, క్రియాశక్తిస్తు ప్రాణః, సచ ప్రాణనాదివృత్తిభేదాత్పఞ్చవిధః, ప్రాణోఽపానో వ్యానస్సమాన

---

కరణము త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియములైదు, వాక్పాణి పాదపాయూపస్థలను కర్మేంద్రియములైదు, శబ్దస్పర్శ రూపరస గన్ధములైదు, పృథివ్యప్తేజోవాయ్వాకాశము లైదు కలసి మొత్తమిరువది యైదు తత్త్వములని తెలియునది. అందంతః కరణము—జ్ఞానశక్తి క్రియా శక్తుల సమిష్టి రూపము. సంశయ, నిశ్చయ, గర్వ, స్మరణములనబడు వృత్తిభేదముల ననుసరించి మనస్సు,బుద్ధి, అహంకారము, చిత్తమను నాల్గు నామములతో జ్ఞానశక్తి వ్యవహరింపబడుచున్నది. క్రియాశక్తి ప్రాణస్వరూపము. అయ్యది ప్రాణనాది వృత్తి భేదములను బట్టి ప్రాణము—అపానము—వ్యానము—సమానము—ఉదానము అను ఐదు రీతుల పిలసిల్గుచున్నది. ఈచెప్పబడిన తత్త్వములలో ప్రకృత్యవచ్ఛిన్నమగు బ్రహ్మ తత్త్వమెయ్యది కలదో, అదియె అవిద్యావచ్ఛిన్నమై జీవతత్త్వముగ వ్యవహరింప బడును. ఇట్టుపాధులు (ప్రకృతి-అవిద్య) భిన్నములైనను ఉపహితమగు వస్తువేకమే గాన

ఉదానశ్చేతి. ఉక్తేషు తత్త్వేషు యత్ప్రకృత్యవచ్ఛిన్న మీశ్వరాఖ్యం బ్రహ్మ తదేవావిద్యావచ్ఛిన్నం సజ్జీవ ఇత్యుచ్యతే. తదేవముపాధిభేదేప్యుపహితాభేదవ వేతి బ్రహ్మైవ జీవః, తదేవోపదిష్టం తత్త్వమసీతి మహావాక్యేన.

24. తథాహి, తత్పదస్య మాయావచ్ఛిన్నం చైతన్య మర్థః, త్వమ్పదస్యావిద్యావచ్ఛిన్నం చైతన్యమర్థః. ఉభయో రసిపదోపదిష్టైక్యా సమ్భవాదత్ర భాగత్యాగలక్షణా ప్రవ

---

జీవుడు బ్రహ్మమేగాని తద్భిన్నుడు గాడు. కావుననే "తత్త్వమసి" యను మహావాక్యము జీవబ్రహ్మల కేకత్వమును బోధించుచున్నది.

24 తత్త్వమసి మహావాక్యమున జీవబ్రహ్మల కేకత్వమును బోధించు విధానము విశదీకరింప బడుచున్నది. ఈవాక్యమునందు తత్ త్వం అసి అనుమూడు పదములున్నవి. వానిలో 'తత్' పదమునకు మాయావచ్ఛిన్న చైతన్య (బ్రహ్మ) మర్థము. 'త్వం' పదమునకు అవిద్యావచ్ఛిన్న చైతన్యము (జీవుడు) అర్థము. ఈరెండు పదార్థములకును 'అసి' పదము బోధించు నట్టి యైక్యము సంభవింపదు గాన నీ (తత్—త్వం) పదద్వయము నందును భాగత్యాగ లక్షణను (అనగా—పదములు సహజ శక్తిచే బోధించిన యర్థమునందు కొంత భాగమును విడచి మిగిలిన భాగమును మాత్రమే స్వీకరించుట)

ర్త్తతే, ముఖ్యార్థబాధో హి లక్షణాబీజమ్. తయా మాయావిద్యయోరుపాధ్యోస్త్యాగే శుద్ధం చైతన్యం నిర్భేదమవశిష్యత ఇతి మహావాక్యస్య చైతన్యమర్థః, అయమేవాఖణ్డార్థ ఇత్యుచ్యతే.



25 ననుపదద్వయే లక్షణావ్యర్థా, ఏకస్మిన్నేవ పదే లక్షణాశ్రయణేన నిర్బాధార్థసిద్ధేః. ఉపాధిద్వయే సతి హి ముఖ్యార్థబాధః, నత్వేకోపాధిసత్త్వే ఇతి చేన్నైవమ్. విగమ



---

ప్రవర్తింప జేయవలసి యున్నది. ముఖ్యార్థ బాధయే గదా లక్షణా వృత్తి నంగీకరించుట లోగల బీజము! కాగా తత్-త్వం పదముల ముఖ్యార్థములలో విశేషణాంశముల(మాయావచ్ఛిన్నము—అవిద్యావచ్ఛిన్నము అను అంశముల) విడువగా ఎట్టిభేదములును లేని శుద్ధమగు చైతన్యమే మిగులుటంజేసి మహావాక్యము చైతన్యార్థక మగుచున్నది. ఇదియే అఖండార్థమనియు వ్యవహరింపబడుచున్నది.



25 ఇచట కొందరు—"లక్షణాంగీకరణ మగతికగతి గదా! అట్టిచో తత్-త్వం పదములలో నొక దానికి మాత్రమే లాక్షణికార్థము స్వీకరించినను నిర్బాధముగ నర్థము సరిపోవుచుండ రెండు పదములలో లక్షణ నంగీకరింప నేల? చూతుము! విశేషణద్వయము నంగీకరించినపుడు గదా (విశేషణమునకు వ్యావర్తనమే—అనగా ఇతరవస్తువునుండి ప్రకృత వస్తువును వేరుపరచుటయే ప్రయోజనము గాగలవి

నావిరోహేణ పదద్వయేపి లక్షణా ప్రవర్తత ఏవ. కిఞ్చ ఏ:
పదే లక్షణాశ్రయణాత్ చైతన్యమవిద్యావచ్ఛిన్నచైతన్యా
చ్చైకమితి, చైతన్యం మాయావచ్ఛిన్నచైతన్యం చైకమితి వా
సమ్పద్యతే ఖల్వర్థః స చ దుష్టః, శుద్ధచైతన్యస్యావిద్యా
చ్ఛిన్నత్వే నాశుద్ధచైతన్యస్య చైక్యాయోగాత్. ఏవం శు

---

గాన) ముఖ్యార్థము బాధితమగుట. విశేషణ మొకట్ల
యే యైనపుడట్టి బాధకు తావులేదు. కాగా పదద్వయము లక్ష
ణాంగీకరణ మన్యాయ్యము" అనిశంకింపవచ్చును. సమాధా
నము నవధరింపుడు. ఈలక్షణను 'తత్' పదమునం దంగీకరి
ప వలెనా? లేక 'త్వం' పదములో నంగీకరింప వలెనా యని
శంకించి నపుడు ఏదొక పక్షమును గాని సాధించునట్టి ప్రబల
ప్రమాణము లేనపుడు అగతికముగ రెండు పదములలో లక్ష
ణ నంగీకరింపక తప్పదు. మఱియు నొక (తత్)పదమునం
లక్షణ నంగీకరించుచో "చైతన్యము—అవిద్యా వచ్ఛిన్న
చైతన్యము నొకటే" అనిగాని (త్వం పదమున లక్షణ న
గీకరించుచో) మాయావచ్ఛిన్న చైతన్యము—చైతన్యము
నొకటేయని గాని యర్థము సిద్ధించును శుద్ధ చైతన్యము
నకును, అవిద్యావచ్ఛిన్న మగుటచే నశుద్ధమగు చైతన్యము
నకు నేకత్వము ఘటించుట. అశుద్ధ చైతన్య మాయావచ్ఛి
న్న చైతన్యములకు, నయుత మైక్యమసంగతము. కావున
మితి మనుచితమని గ్రహించునది.

చైతన్యస్య ప్రకృత్యవచ్ఛిన్న చైతన్యస్య చాయుక్తమేవైక్య మితి.

26. నను లక్షణయా విశేషణాంశత్యాగాజ్జీవేశ్వరయో రైక్యమితి యదుక్తం తత్ప్రభుత్వభృత్యత్వ ద్వయపరిత్యాగే భవతి రాజభృత్యయోరైక్యం మనుష్యత్వాదితి వదపహాస్యాస్పదమేవ.న హి వాఙ్మాత్రేణానాదిసిద్ధోపాధినివృత్తిః, యతః

---

26 " లక్షణావృత్తి నంగీకరించి విశేషణాంశముల విసర్జించుటవలన జీవేశ్వరుల కైక్యము సిద్ధించునని మీరు చెప్పుట—ప్రభుత్వ భృత్యత్వములఁ బరిత్యజించి కేవల మనుష్యత్వమును మాత్రము పరిగ్రహించుచో రాజభృత్యుల కైక్యము సిద్ధించు ననుటవలె పరిహాసాస్పదమే యగును. అనాది సిద్ధములగు మాయావిద్యోపాధులు మాటమాత్రమున తొలగిచనునా! జీవుఁడు తన యవిద్యోపాధిని ఈశ్వరుని మాయోపాధిని గూడ ఘటమునువలె భగ్నము గావించుట ఘటించుచో ఘటాకాశము మహాకాశము నందైక్యము నొందునట్లు జీవేశ్వరుల కైక్యము సిద్ధింపవచ్చును" అనుకొందరి శంకకు సమాధానమును వినుడు:—అసంగుఁడగు ఈశ్వరునకుగాని, జీవునకుగాని, ఉపాధి సంబంధము కల్పితమే గాని వాస్తవికము కాదు. అట్టి కల్పనా మాత్ర (మిథ్యాభూత) మగు సంబన్ధము వాఙ్మాత్రమున నివర్తించుట యసంభావితము కానక్కరలేదు. భ్రమవశమున రజ్జువు సర్పముగ భా

నాపి హేన పదద్వయేపి లక్షణా ప్రవర్తత ఏవ, కిఞ్చ ఏక పదే లక్షణాశ్రయణాత్ చైతన్యమవిద్యావచ్ఛిన్నచైతన్యం చైకమితి, చైతన్యం మాయావచ్ఛిన్నచైతన్యం చైకమితి వా సమ్పద్యతే ఖల్వర్థః, స చ దుష్టః, శుద్ధచైతన్యస్యావిద్యావచ్ఛిన్నత్వే నాశుద్ధచైతన్యస్య చైక్యాయోగాత్. ఏవం శుద్ధ

---

గాన) ముఖ్యార్థము బాధితమగుట. విశేషణ మొక్కటియే యైనపుడట్టి బాధకు తావులేదు. కాగా పదద్వయ లక్షణాంగీకరణ మనావశ్యకము" అనిశంకింపవచ్చును. సమాధానము నవధరింపుడు. ఈలక్షణను 'తత్' పదమునందంగీకరింపవలెనా? లేక 'త్వం' పదములో నంగీకరింపవలెనాయని శంకించినపుడు ఏదొక పక్షమును గాని సాధించునట్టి ప్రబల ప్రమాణము లేనపుడు అగతికముగ రెండు పదములలో లక్షణ నంగీకరింపక తప్పదు. మఱియు నొక (తత్)పదమునందే లక్షణ నంగీకరించుచో "చైతన్యము—అవిద్యా వచ్ఛిన్న చైతన్యము నొక్కటే" అనిగాని (త్వం పదమున లక్షణ నంగీకరించుచో) మాయావచ్ఛిన్న చైతన్యము—చైతన్యము నొక్కటేయని గాని యర్థము సిద్ధించును శుద్ధ చైతన్యమునకును, అవిద్యావచ్ఛిన్న మగుటచే నశుద్ధమగు చైతన్యమునకు నేకత్వము దుర్ఘటము. అట్లే శుద్ధ చైతన్య మాయావచ్ఛిన్నచైతన్యములకు, నయిత మైక్యమసంగతము. కావున నీమతి మనుచితమని గ్రహించునది.

తు జీవః స్వోపాధిమీశ్వరోపాధిం చ ఘటవన్నాశయేత్తర్హి భవేజ్జీవేశ్వరైక్యం ఘటాకాశమహాకాశైక్యవత్ ఇతి చేదుచ్యతే. అసఙ్గేశ్వరస్య జీవస్య వా ఉపాధిసమ్బన్ధాయోగాన్మిథ్యాభూతతత్సమ్బన్ధస్య వాఙ్మాత్రేణ నివృత్తిస్సమ్భవత్యేవ, రజ్జురేషేత్యాప్తోపదేశేన హి సర్పో నివర్తతే.

27. న చైవం జ్ఞానోదయకాలే ఏవ విదుషః కిమితి న శరీరనాశ ఇతి వాచ్యమశరీరస్య విదుషశ్శరీరస్యైవాభావాత్కథం తన్నాశః. "అశరీరం వా వసన్తం న ప్రియాప్రియే

---

సించునపుడాప్తుడగు వాడు వచ్చి 'ఇది రజ్జువేగాని సర్పము కాదు' అనిచెప్పినంత మాత్రముననే అంతవరకు మహాభీతిహేతువైన సర్పము మటుమాయ మగుటలేదా?

27 "బ్రహ్మజ్ఞానముదయించుటతోడనే అజ్ఞానము నశించునుగాన అజ్ఞాన కల్పితము ననాత్మభూతమునగు తత్త్వవిదుని శరీరముగూడ నశించుట లేదేమి" యనిశంకింప నక్కఱలేదు. ఎప్పుడు తత్త్వజ్ఞానముదయించెనో, అపుడే యాత డశరీరియగుచున్నాడు. కాఁగా శరీరమే లేనపుడది నశించుటెట్లు? "అశరీరం... స్పృశతః (అశరీరిగానున్న తత్త్వవిదుని, శరీరసంబన్ధనిమిత్తకములగు సుఖదుఃఖములు స్పృశింపవు" అనిగదా శ్రుతియుద్ఘోషించుచున్నది! అజ్ఞానులకు మాత్రమే ప్రారబ్ధక్షయమగునంతవఱకు తత్త్వవేత్తశరీరము గోచరించుచుండును. పురుషుడాత్మ

స్పృశత' ఇతి హి శ్రూయతే, అవిదుషా తు యావత్ప్రారబ్ధం విద్వద్దేహో దృశ్యతే. తస్మాద్యదైవ పురుషస్యాత్మసాక్షాత్కారో జాతస్తదైవ కైవల్యప్రాప్తిః. కేవలత్వాదాత్మనః పురుషస్య చాత్మత్వాదితి.

28. య ఏవమాత్మానం ప్రత్యఞ్చం పరమాత్మాభిన్నం సాక్షాత్పశ్యతి,స వదత్యుచ్చైః 'అహం బ్రహ్మాస్మీతి' తదేవానూదితం శ్రుత్యా 'అహం బ్రహ్మాస్మీతి'. అస్యాపి మహావాక్యస్య చైతన్యమిత్యేవ లాక్షణికోర్థః, ఏవం ప్రజ్ఞానం బ్రహ్మ' 'అయమాత్మా బ్రహ్మ' ఇతి మహావాక్యయోరపి చైతన్యమిత్యేవార్థః.తచ్చ చైతన్యం సజాతీయవిజాతీయస్వగతభేదరహితత్వాదద్వైతం.స చ జగతా సద్వితీయమితి వాచ్యం

---

స్వరూపుడు, ఆత్మ కేవలు (శుద్ధు) డు. కాగా పురుషునకెప్పుడాత్మసాక్షాత్కారము లభించునో, అపుడె కైవల్యము సిద్ధించును.

28. ఎవడిట్లు ప్రత్యగా (జీవా) త్మను పరమాత్మాభిన్నునిగ సాక్షాత్కరించుకొనునో, అట్టివాడు 'నేనే బ్రహ్మమైయున్నాను' అని యుచ్చైస్స్వరముగఁ బలుకును. దీనినే 'అహంబ్రహ్మాస్మి' అను శ్రుతి యనువదించుచున్నది. ఈ మహావాక్యమునకు సయితము లక్షణావృత్తిచే చైతన్యార్థకత్వము

జగతో వస్తుతోఽభావాత్, నాపి జీవేన సద్వితీయం, జీవబ్రహ్మణోరభేదాత్. నాపి జగదభావేన, తస్యావస్తుత్వాన్నాపి మాయయా, తస్యా మిథ్యాత్వాత్. అతఏవోక్తం శ్రుత్యా 'ఏకమేవాద్వితీయం బ్రహ్మే'తి. య ఏవం వేత్తి స బ్రహ్మైవ భవతీత్యర్థః.

---

నిర్దేశించుచున్నది. ఇట్టి "ప్రజ్ఞానం బ్రహ్మ" "అయమాత్మా బ్రహ్మ" అను మహావాక్యద్వయమునకు గూడ చైతన్యార్థకత్వమును గ్రహించునది. ఆచైతన్యము సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమగుటం జేసి యద్వైతమగుచున్నది. జగత్తను రెండవ పదార్థముండగా నద్వితీయ మెట్లగునని యాశంకింపరాదు. వస్తుస్థితిలో జగత్తే లేదని వెనుక జెప్పియేయున్నాము. జీవబ్రహ్మైక్యము ప్రతిపాదింప బడియుండుటం జేసి జీవుని మూలమున గూడ చైతన్యము సద్వితీయము కాజాలదు. అభావమున వస్తువే గానందున జగదభావద్వారమున గూడ చైతన్య మద్వితీయ మగుట కాటంకము లేదు. మిథ్యారూపము గాన మాయవలనం గూడ చైతన్యాద్వైతమునకు చెరుపు లేదు. కావుననే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని శ్రుతి చెప్పుచున్నది. ఇట్లెవ్వడు తెలుసు కొనునో వాడే బ్రహ్మవేత్త యని చెప్పుచున్నాడు.

29. యద్యయం జీవన్ముక్తిసుఖమిచ్ఛేత్తర్హి వక్ష్యమాణం భక్తిసోపానమారుహేత్. విదేహముక్తిః పునరస్మాదేవ జ్ఞానసోపానాధిరోహణాత్సిద్ధ్యతి. యద్వా దర్శితజ్ఞానసోపానాధిరోహణాద్యస్య నాత్మసాక్షాత్కారస్స భక్తిసోపానాధిరోహణాదేవ ముచ్యతే. అతఏవ "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" ఇతి శ్రోతుర్మన్తుశ్చ నిదిధ్యాసనం విహితం శ్రుత్యా. తస్మాత్ జ్ఞానవతోఽపి భక్తిరావశ్యక్యేవ. యద్యపీదం

---

29. ఇట్టి బ్రహ్మవిదుడు జీవన్ముక్తిసుఖము నభిలషించుచో చెప్పబోవు భక్తిసోపానము నధిరోహింపవలసి యుండును. విదేహముక్తిమాత్ర మీ జ్ఞానసోపానారోహణమాత్రమున నే చేకూరును. లేక—ఇపుడు ప్రదర్శించిన జ్ఞానసోపానము నధిరోహించికూడ నెవఁడాత్మ సాక్షాత్కారమును పొందజాలఁడో, వాడు భక్తిసోపానము నధిష్ఠించిన నె ముక్తుఁ డగును. కావుననె 'శ్రోతవ్యో......ధ్యాసితవ్యః' అను శ్రుతి శ్రవణమననముల ననుష్ఠించినవానికిసైతము నిదిధ్యాసనమును విధించుచున్నది. అందువలన జ్ఞానికి సయితము భక్తి యావశ్యకమె. మననాత్మకమైన యీజ్ఞాన మొకవిధమగు మానసిక క్రియయే యయినను సాక్షాత్కార సాధనమగుట

జ్ఞానం మననాత్మకం మానసికీ క్రియైవ,తథాప్యవగతి హేతుత్వాన్మననమిదం జ్ఞానమిత్యుక్తమితి వేద్యమ్.

ఇతి శ్రీ బెల్లంకొండ రామరాయకవికృతిషు మోక్షప్రాసాదస్య జ్ఞానసోపానమ్.

శ్రీ హయగ్రీవార్పణమస్తు

విరోధికృత్ఫాల్గున బహుళ ద్వితీయా.

---

జేసి జ్ఞానరూపముగ నిచట నిర్దేశింపఁబడినదని గ్రహింపవలయును.

ఇతి దిశ్రీబెల్లంకొండ రామరాయకవికృతులయందు మోక్షప్రాసాదమున—జ్ఞానసోపానము.

శ్రీ హయగ్రీవార్పణమస్తు

విరోధికృత్ఫాల్గుణబహుళద్వితీయ:

ఆంధ్రవివరణకర్త:– 'పూర్వమీమాంసాప్రవీణ'
సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి
1–9–1951

---

కోటేశ్వర ప్రెస్ నరసరావుపేట.

శ్రీ హయగ్రీవాయ నమః

# విద్యార్థ విద్యోతః



1. ధర్మార్థకామమోక్షా ఇతి చత్వారః పురుషార్థాః. పురుషైరర్థ్యన్తే ప్రార్థ్యన్తే సుఖాయ దుఃఖమోక్షాయ చేతి పురుషార్థా ఏతే. పురి శరీరే శేరత ఇతిపురుషా జీవాః.అన్తః కరణోపహితాః మాయోపహితస్యేశ్వరస్యాంశా మహాకాశ స్యేవ ఘటాకాశాః.

---

శ్రీ హయగ్రీవాయ నమః

# విద్యార్థ విద్యోతము



1. 'ధర్మము—అర్థము—కామము—మోక్షము' అనినాల్గు పురుషార్థములు గలవు. సుఖప్రాప్తిని, దుఃఖవిముక్తిని బడయ గోరి పురుషులీ నాల్గింటిని ప్రార్థింతురుగాన వీనికి బురుషార్థ ములను పేరు చెల్లుచున్నది. పురుషులన—జీవులు. పురమన గా శరీరము. పురమున శయనించువారుగాన అనగా దేహ ముతో నివసించువారుగాన జీవులు పురుషులని పిలువబడు

2. ఏతేషాం చతుర్ణామపి పురుషార్థానాం సాధనం విద్యా. న హి విద్యావిహీనః కమపి పురుషార్థం సాధయితుం శక్నోతి. 'అర్థీ సమర్థో విద్వాన్ జాతపుత్రః కృష్ణకేశోఽగ్నీనాదధీతే' త్యాదిశ్రుతేర్జ్యోతిష్టోమాదిధర్మానుష్ఠానం విద్యాసాధ్యమ్, అర్థఞ్చ విద్యావానేవ సమ్పాదయతి, కామశాస్త్రాదివిదేవ కామమ్, ఉపనిషదాదివిద్యావానేవ మోక్షమితి.

3. నను—"తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ, తం త్వౌపనిషదం పురుషంపృచ్ఛా

---

చున్నారు. అంతఃకరణము వీరి నివాసమునకు ముఖ్యమగు నాధారము. ఒక్కయాకాశము ఘటమునందు మఠమునందు ప్రవేశించుటచే ఘటాకాశము మఠాకాశమునని ఎటుల పిలువబడుచున్నదో అటుల చైతన్య మొక్కటియే మాయయందు ప్రతిఫలించుటచే నీశ్వరుడనియు, అవిద్యయందు ప్రవేశించి జీవుడనియు వ్యవహరింప బడుచున్నది.

2. పై దెల్పిన నాల్గు పురుషార్థములను సాధించునది విద్య. విద్యలేనివాడొక్క పురుషార్థమును గూడ సాధింపజాలడు. 'అర్థీసమర్థో విద్వాన్ జాతపుత్రః కృష్ణకేశోఽగ్నీనాదధీత' అను వేదవాక్యము అగ్న్యాధానము చేయుగోరు పురుషుని యోగ్యతల దెల్పుచున్నది. ద్రవ్యముగలవాడు

మి" ఇత్యాదిశాస్త్రైదస్తు మోక్షసాధనత్వ ముపనిషద్విద్యాయాః. అన్యే త్రయస్తు విద్యావిహీనైరపి సమ్పాద్యన్త ఇతి న విద్యాయా ధర్మాదిత్రయసాధనత్వమితి చేన్నైవమ్.

4. యద్యప్యవిద్వాంసశ్శూద్రాదయోఽపి వాపీకూపతటాకారామాలయ నిర్మాణాదినా ధర్మం సమ్పాదయన్తి, కృషివాణిజ్యాదినా చార్థమ్, శరీరేన్ద్రియపాటవేన కామమ్-తథాపి—'అనేన కర్మణాయమ ధర్మః స్వర్గాదిహేతుర్భవిష్యతి. ప్రాచీనైర్బహుభిశ్చ సద్భిరయమనుష్ఠితో ధర్మః, మయాపితదనుయాయినావశ్య మిద మనుష్ఠేయమ్, విద్వాం

---

వృద్ధకాయుడు వేదార్థమెరిగినవాడు పుత్త్రవంతుడు యువకుడునగువాడు యజ్ఞముచేయవలెనని దానియర్థము. ఈ యోగ్యతలు విద్యపై నాధారపడి యున్నవి. ఎట్లన—జ్యోతిష్టోమాదియజ్ఞము లాచరింపవలెనన్న తద్విషయమైనజ్ఞానమావశ్యకము. అందుకై విద్యకావలెను. యజ్ఞమును నెరవేర్చుటకు గావలసిన ధనమునుగూడ విద్యావంతు డార్జించును. కామశాస్త్రజ్ఞానము గలవాడు కామ మనుభవించును. వేదాన్తవిజ్ఞానము గలవాడే మోక్షసామ్రాజ్యము నధిగమించును.

ప్ర:- 3. ఆత్మతత్త్వమును గుర్తించినవాడు మృత్యువు నతిక్రమించుననియు. మోక్షమునకు వేఱొకమార్గము లేదనియు ఆత్మపదార్థ ముపనిషన్మాత్రవేద్యమనియు వేదము

శ్చాయం బ్రాహ్మణో మామిదం సత్కర్మ కుర్వితిచోదయతి, వర్ణానాం బ్రాహ్మణో గురురితి హి పురాణేషు శ్రూయతే' ఇత్యాదివిద్యావన్త ఏవ శూద్రాదయః కుర్వన్తి ధర్మకార్యాణి.

5. తథా దేశం కాలం విధిం చ జ్ఞాత్వా క్రియమాణైవ కృషిస్సస్యం ఫలతి. న హి కృషివిధిమజానన్తః కృషిం కుర్యుః ఏవం దేశకాలాద్యభిజ్ఞా ఏవ వణిజో వాణిజ్యేనార్థం సమ్పాదయన్తి న తు మూఢాః. కామశ్చ కలాశాస్త్రాభిజ్ఞా

---

పేక్షించు మన్నంమన మోక్షసాధనమైనది ఉపనిషద్విద్యయే కావచ్చును. తక్కిన మూడు పురుషార్థములు విద్యావిహీనులచే సంపాదింపదగియున్నవి. కావున ధర్మార్థ కామములకు గూడ విద్యయే సాధనమనుట యెట్లుపొసగును?

ఉ:- 4. విద్యలేని శూద్రాదులుగూడ బావులుత్రవ్వించియు చెరువులు నిర్మించియు దేవాలయముల గట్టించియు నిట్టికార్యములద్వారా ధర్మమును సంపాదింపవచ్చును. వ్యవసాయము వ్యాపారము నొనర్చి యర్థము (ధనము) ను, ఇతరకార్యములవలన కామమును సంపాదింపవచ్చును. కాని యీ సంపాదనముగూడ నందుకు దగిన జ్ఞానమున్నవారే చేయఁగలరు. ఎట్లన—ఒక ధర్మకార్యము చేయబూనినవాడు ఇది ధర్మమనియు. దీనిచే స్వర్గము లభించుననియు, పూర్వీకులు చాలమంది యీధర్మము నాచరించిరనియు,

ఏవ యథావిధి యథాకాలం స్త్రీపురుషతత్త్వానుగుణం సంయోగం కుర్వన్త ఏవ సమ్పాదయన్తి. అనభిజ్ఞాస్తు పశువద్యయా కయాచిద్యథా కథఞ్చిన్మైథునంకృత్వా రోగాదికమనిష్టమేవ సమ్పాదయన్తి. తస్మాత్పురుషార్థకామిభిస్సర్వైరపి పురుషైర్విద్యావద్భిర్భవితవ్యమ్.

---

వారివలె నేనుగూడ దీనిజేయవలెననియు ఈ సత్కార్యమును జేయవలసినదిగా బ్రాహ్మణు డుపదేశించుచుండెననియు, వర్ణమాలయందు బ్రాహ్మణవర్ణము శ్రేష్ఠమైనదని పురాణములు వెల్లడించుచుండెననియు నీవిధముగా దెలిసికొనినవాడే ధర్మకార్యముల జేయును. ఈ జ్ఞానమునే విద్యయని చెప్పవలెను. చదువుట వ్రాయుట మాత్రమే విద్యకాదు. కావున ధర్మకార్యముల జేయు ప్రతివాడును విద్యావంతుడసియే యెఱుంగవలెను.

5. "దేశము—కాలము—విధానము" వీనిని గుర్తించి చేయుబడు వ్యవసాయమే పంటను పండించును. వ్యవసాయ పద్ధతి నెఱుగనివారు వ్యవసాయ మొనర్పరు ఇట్లే దేశకాల పరిస్థితుల దెలిసినవారే వ్యాపార మొనర్చి ధనముసంపాదింతురు కాని మూర్ఖులాగ్గింపజాలరు. కామశాస్త్రము దెలిసికొని కాలానుగుణముగ, స్త్రీపురుష తత్త్వములగుర్తించి రమించువారే కామమను పురుషార్థమును సంపాదింతురు. కళాశాస్త్రము దెలియనివారు పశువులవలె క్రీడించి రోగములపాలగు

6. నను—కేయం విద్యా నామ? ఉచ్యతే, సాభాసాన్తఃకరణవృత్తిర్విద్యా. అన్తఃకరణం హి సత్త్వమయత్వేనాతిస్వచ్ఛమాత్మానం ప్రతిబిమ్బం గృహ్ణాతి, సూర్యప్రతిబిమ్బమివ ముకురః. దేహస్తు మలినత్వాన్న తత్ప్రతిబిమ్బగ్రాహీ, యథా ఘటస్సూర్యప్రతిబిమ్బం న గృహ్ణాతి.

7. అస్య చాన్తఃకరణస్య సాదిత్వేన సావయవత్వాత్పరిణామోఽస్తి. నిరవయవం హి వస్త్వపరిణామి. ఇదిజ్ఞాన్తః

---

మని. కావున బహుశాస్త్రముల సాధింపదలచిన వారందఱు విద్యావంతులై యుండవలెను.

6. విద్యయన నెద్ది? వినుడు!

చిత్ప్రతిబింబముగల యంతఃకరణవృత్తి విద్యయని పిలువబడును. ఆ వృత్తి యెట్లేర్పడునో చూడుడు! అంతఃకరణము సూక్ష్మభూతముల సత్త్వాంశములచేఁ దయారైనది గాన మిక్కిలి స్వచ్ఛముగా నుండును. అందుచే నద్దము సూర్యుని ప్రతిబింబమును గ్రహించినట్లంతఃకరణ మాత్మయొక్క ప్రతిబింబమును తనలోనికి గ్రహించును. దేహము మలినమైనదిగాన మట్టికుండ యెట్లు గ్రహింపజాలదో అట్లే ఆత్మప్రతిబింబమును గ్రహింపజాలదు.

7. ఈ యంతఃకరణము సూక్ష్మభూతము (పంచతన్మాత్రల) ద్వారా సృజింపఁబడినది గాన నిది "ఆదిగల"

కరణమన్తస్సుఖాద్యాకారేణ స్వయమేవ పరిణమతే, బహిస్తు చక్షురాదిద్వారా. యథా తటాకోదకం కుల్యాత్మనా నిర్గత్య కేదారం ప్రవిశ్య చతుష్కోణత్వాద్యాకారం భజతే, తథా అన్తఃకరణమపి చక్షుర్ద్వారా నిర్గత్య ఘటాది విషయాకారం భజతే. సోఽయమన్తఃకరణ పరిణామో వృత్తిరిత్యుచ్యతే.

---

వస్తువు (అనాదికాదు) మఱియు నైదు తన్మాత్రల సత్త్వాంశములగలిపి సృజింపబడినదిగాన నిది సావయవ పదార్థము (అనగా నవయవములుగలది). కావున దీనికి పరిణామము (మార్పు) జెందు స్వభావముకలదు. అవయవములేని (నిరవయవ) వస్తువే పరిణామ రహితమైనది. ఈ యంతఃకరణమొకప్పుడు సుఖాకారముగ మఱియొకప్పుడు దుఃఖరూపముగా నిట్లు వేర్వేరు రూపములుగ దేహాంము౦దుండియే పరిణమించుచుండును. ఇట్లే నేత్రములద్వారా దేహము వెలుపలకు వచ్చియు వస్తువులయాకారము ధరించుచుండును. ఎట్లన— చెరువులోని నీరు తూములనుండి వెలుపలకువచ్చి కాలువగా ప్రవహించి చలుచదరమైన మడిలోజేరి తానును నలుచదరమగు నాకారము ధరించును. అట్లే యంతఃకరణము గూడ నేత్రములద్వారా బయటకువచ్చి ఆయాపదార్థముల యాకారమును ధరించును. ఇట్టి యంతఃకరణ పరిణామమునకే 'వృత్తి' యని పేరు.

8. ఏతద్వృత్తిప్రతిఫలితచైతన్యం జ్ఞానమిత్యుచ్యతే జ్ఞానావచ్ఛేదకత్వాద్వృత్తేః. సచైతన్యాభాసేయం వృత్తిరేవ విద్యా, అనయా హి విద్యయా ఘటాదివిషయావారకమవిద్యాపరపర్యాయమజ్ఞానం నాశ్యతే. తతశ్చ విద్యాగతచైతన్యాంశవశాద్ఘటాదిస్ఫురణంజాయతే. అచిద్రూపస్య ఘటాదేః స్వతఃస్ఫురణా—యోగాత్. తతోఽయం ఘట ఇతి ప్రత్యక్షంజాయతే.

9. ఏవం వేద్యన్తే ఘటాదయః పదార్థా అనయేతి

---

8. ఈ వృత్తియందు ప్రతిఫలించిన చైతన్యమునే 'జ్ఞాన'మని వ్యవహరింతురు. ఒక్కొకవృత్తి ఒక్కొకవిషయజ్ఞానమును వేరుపరచుచుండును. చైతన్య ప్రతిబింబముగల యంతఃకరణ వృత్తియే విద్య. ఈ విద్య ప్రాపంచిక పదార్థముల నావరించియున్న యజ్ఞానమును నశింపజేయును. పిమ్మట నావృత్తియందలి చైతన్యాంశము వలన నాయాజ్ఞాన ముదయించుచున్నది ఘటాది పదార్థములు జడములగాన స్వయం తటదాము తెలియబడవు. వృత్తియందలి చైతన్యము వలననే పదార్థస్ఫురణగలిగి అటుపై ప్రత్యక్షము కలుగుచున్నది.

9. 'విద్యా' అను శబ్దమునకు పైదెల్పిన యర్థము 'వేద్యన్తే పదార్థా అనయా' అను వ్యుత్పత్తిచే లభించుచున్నది. అనగా దేనిచేత ప్రపంచమందలి పదార్థములన్నియు తెలిసికొనబడుచున్నవో అది విద్యయని వ్యుత్పత్త్యర్థము.

విద్యా. అనయేతి కరణే తృతీయా. విద్యా హి వేత్తురాత్మనః కరణమ్.

10. న చాన్తఃకరణోపహితస్యాత్మనః కథ-మన్తః కరణం కరణమితి వాచ్యమ్. అన్తఃకరణస్య హి కర్త్రంశః కరణాంశ ఇత్యస్త్యంశద్వయమ్, సావయవత్వాత్. అతఏవాహమిచ్ఛామీతి మమ మన ఇతి చ ప్రతీతిర్ద్విధా భవతి.

11. తత్ర కర్త్రంశభూతాన్తఃకరణోపహితస్య కర్తురాత్మనః స్యాదన్తఃకరణం కరణాంశరూపం కరణమ్. అతఏవ

---

పదార్థముల దెలిసికొనుటకు విద్య సాధనమని ఫలితార్థము.

10. ప్రశ్న:- అంతఃకరణమునందు జేరిన యాత్మ కర్తయగుచుండ నాతనికి అంతఃకరణము సాధనమగు టెట్లు?

ఉత్తరము:- అంతఃకరణము అవయవములుగల పదార్థముగాన దానికి రెండు భాగములుండును. అందొక భాగము కర్తగా వ్యవహరించును. రెండవది సాధనముగా నుండును. 'నేను తలచుచున్నాను' అనునపుడు కర్తగా భాసించును. 'నాయొక్క మనస్సు' అనునపుడు మనస్సు సాధనముగా భాసించును.

11. అందు కర్త్రంశమైన యంతఃకరణము నాశ్రయించి ఆత్మ కర్తగా వ్యవహరించునపుడు రెండవ భాగమైన కర సాధనముగా నుండును.
ణాంశరూపమగు నంతఃకరణము

తస్యాన్తఃకరణమితి వ్యవహారః, చక్షురాదివ్యాపారమన
పేక్ష్య. సుఖాద్యుపలబ్ధేః కరణత్వవతీదమ్మనః.

**12.** చక్షురాదీని తు బహిష్కరణాని. తస్మా
కరణవృత్తిర్ద్విధా. ఇయఞ్చ వృత్తిర్ద్విధా. ఆత్మా
అనాత్మాకారా చేతి. ఆత్మాకారా వృత్తిరేవ నిరాకా
నిర్వికల్పేతి చోచ్యతే. అనాత్మాకారా తు సాకారేతి
కల్పేతి చోచ్యతే.

---

'ఆతని యొక్క — అంతఃకరణము' అను వాడుక, పై వెల్లి
సంభవించినది. అంతః = లోపలి, కరణం = సాధ
'అంతఃకరణము.' మనస్సునకీపేరు ఎట్లువచ్చెననగా —
ము శ్రోత్రము మొదలగు నింద్రియములతో పనిలేక లో
పలనే సుఖదుఃఖముల ననుభవింప జేయుటకు సమర్థమైనది
మనస్సునకీ పేరు వచ్చెను.

12. నేత్రము మొదలగు నింద్రియములు బా
వస్తువుల గ్రహించునవి. [illegible] — అంతఃకరణ
యని నిరూపింపబడినది. ఈ వృత్తి రెండు విధములుగా ను
ను. అందొకటి ఆత్మాకారవృత్తి మఱియొకటి అనాత్మా
ర వృత్తి. ఆత్మాకారవృత్తి నిరాకారవృత్తియు నిర్వి
వృత్తియనియు [illegible]. అనాత్మాకారవృత్తి సా
వృత్తియని, సవికల్పవృత్తియనియు వ్యవహరింప బడు

13. తత్రాత్మాకారాయా ఏవ వృత్తేర్ముఖ్యం విద్యాత్వమ్. సర్వావిద్యానివారకత్వాత్. ఇయమేవ పణ్డేత్యుచ్యతే. ఏతద్వానేవ పణ్డిత ఇత్యభిధీయతే. పణ్డా ఆత్మజ్ఞానమితి శ్రీశఙ్కరభాష్యాత్. 'పాణ్డిత్యం నిర్విద్యే'తి శ్రుతేశ్చ.

14. అనాత్మాకారా తు విద్యా అముఖ్యవిద్యా. సర్వావిద్యాఽనివర్తకత్వాత్ తత్తత్పదార్థావారకాజ్ఞాననివారకత్వాచ్చ. తత్ర ముఖ్యా ఏకైవ. తద్విషయస్యాత్మన ఏక

---

13. అందాత్మాకారమైన వృత్తియే ప్రధానమగు విద్యయని గ్రహించవలెను. ఏలనన—అవిద్యనంతటిని నాశనముగావించు సామర్థ్యము దానికిమాత్రమే యున్నది. ఇట్టి విద్యకు "పండ"యని మఱియొక పేరు. "పండ" గల్గినవాడు పండితుడు. పండయన నాత్మజ్ఞానమని శ్రీశంకరభాష్యము వలనను వేదము వలనను దెలియుచున్నది.

14. పైదెల్పిన యాత్మాకారవృత్తిరూపమగు విద్యగాక అంతఃకరణవృత్తిరూపమైన మఱియొక విద్యగలదు. ఈవిద్య వలన అవిద్యయంతయు నశింపదు గాన నిది యముఖ్యమైన విద్య ఇది యేయే పదార్థముపై ప్రసరించునో అట్టియజ్ఞానావరణమును మాత్రము నాశనము జేసి ఆయా పదార్థములను స్ఫురింపజేయును. పదార్థములు భిన్నభిన్నములైనందున నానారూపపదార్థముల భాసింపజేయు విద్యయు బహువిధములై యుండును. పూర్వము దెల్పిన ఆత్మాకారవృత్తి రూపమగు విద్య

త్వాత్. అముఖ్యా విద్యాస్తు నానా. తద్విషయాణాత్మనానా త్వాత్. అన్తఃకరణ వృత్తిరూపేయం విద్యా. తయో త్వాద్యతే సా చ విద్యేత్యుచ్యతే ఉపచారాత్.

15. తత్ర ఉపనిషద్భిః తదర్థప్రతిపాదకైస్సూత్రై ర్గీతాశ్లోకైర్భాగవతాది సత్పురాణైరధ్యాత్మ రామాయణాది కావ్యైః ప్రబోధచన్ద్రోదయాది నాటకైశ్చ పణ్డోత్పాద్యత ఇత్యుపనిషదాదీనాం విద్యాత్వం ముఖ్యమ్. ముఖ్యవిద్యో త్పాదికాః ఖలు విద్యాః ముఖ్యా ఏవ భవన్తి. యాస్త్వముఖ్య విద్యోత్పాదిన్యస్తా విద్యా అముఖ్యాః.

---

మాత్రము "ఒక్కవిధమే." ఏలయన అందు భాసించు "నాత్మ" ఒక్కటి యగుటయే యిందుకు గారణము ఈ రెండు విద్యలు నంతఃకరణ వృత్తిరూపములేగాన రెంటికిని "విద్య" యను పేరు చెల్లుచున్నది, కాని విద్యాశబ్దమున కాత్మజ్ఞాన మనునది ముఖ్యార్థము పదార్థజ్ఞాన మనునది లాక్షణికార్థము

15. ఉపనిషత్తులు—వాని యర్థమును బోధించు బ్రహ్మ సూత్రములు—భగవద్గీత—భాగవతము మున్నగు పురాణము లు—అధ్యాత్మ రామాయణాది కావ్యములు— ప్రబోధ చంద్రోదయము మున్నగు నాటకములు నాత్మజ్ఞానమునకు సాధనములుగాన నివి ప్రధాన విద్యయై యున్నవి. ప్రాధాన్య మెట్టులన—ప్రధాన విద్యయైన యాత్మజ్ఞానమును కలుగజేయు నవిగాన నివియు ప్రధానములే. తదితర జ్ఞానమును కలిగించునవి అముఖ్య విద్యలు.

16. అముఖ్యవిద్యాశ్చ శ్రుతిస్మృత్యాద్యాః. తత్ర పణ్డితేన మోక్షస్సమ్పాద్యతే. అముఖ్య విద్యానతా తు ధర్మాదిత్రికమితి వివేకః.

17. ముముక్షుత్వస్య స్త్రీశూద్రాది సాధారణత్వాత్ప్రజ్ఞోపజననే సర్వేషామస్త్యధికారః. పరన్తు ద్విజైరుపనిషద్భిః ప్రజ్ఞా జననీయా 'శ్రోతవ్య' ఇతి శ్రుతేః, స్త్రీశూద్రాదిభిస్తు పురాణాదిభిః, తేషాం వేదేష్వనధికారాత్. 'స్త్రీశూద్రద్విజబన్ధూనాం త్రయీ న శ్రుతిగోచరా। తేషామేవానుకమ్పార్థం పురాణాదిప్రవర్తన' మితి వచనాత్.

---

16: కర్మకాండను బోధించు వేదము, ఆ యర్థమును ప్రతిపాదించు ధర్మశాస్త్రములు—వానిని బలపరచు నితిహాస పురాణములు మున్నగునవి యముఖ్యవిద్య. వీనిలో ముఖ్య విద్యనాశ్రయించినవాడు మోక్షమును సంపాదించును. అవిద్యాముఖ్యలనాశ్రయించినవాడు ధర్మార్థకామములను సంపాదించు నని తెలియవలెను.

17. మోక్షము నాపేక్షించు కోరిక స్త్రీలు శూద్రులు మున్నగువారందఱకును నుండును గాన నాత్మజ్ఞానము నెల్లరు సంపాదించుకొనవచ్చును. కాని, ద్విజులు ఉపనిషత్తుల మూలముగను తక్కినవారు పురాణముల మూలముగను నాత్మజ్ఞానము నార్జింపవలెను. వీరికి వేదార్థమును తెలియు జేయుటకే పురాణములు రచింపబడెను.

18. న చ స్త్రీశూద్రాదిభిః కిమపరాద్ధమితి వాచ్యమ్, ఉపనయనాభావాత్.

19. న చోపనీయన్తాం తేఽపీతి వాచ్యమ్, అద్విజానాముపనయనాయోగాత్.

20. న చోపనయనాత్తేఽపి ద్విజా ఏవేతి వాచ్యమ్ ద్విజాతేర్ద్విజాత్యాముత్పన్న ఏవ ద్విజ ఇతి కృత్వా యస్య

---

18 ప్ర:- స్త్రీలు శూద్రులు వేదము వినరాదనుటకు వారొనర్చిన యపరాధ మేమి కలదు?

ఉ:- ఉపనయనము గానిదే వేదము జదువుట కధికారముండదు.

19 ప్ర:- అటులయిన వారుపనయనము చేసికొందురు గాక.

ఉ:- ద్విజేతరుల కుపనయనాధికారము లేదు.

20. ప్ర:- ఉపనయన రూపమగు ద్వితీయజన్మగల వారు ద్విజులని చెప్పబడుదురు. కావున శూద్రుల కుపనయన ముపనయనము చేసిన వారేల ద్విజులుకారు?

ఉ:- ఓయీ! ద్విజశబ్దమునకు నీవుచెప్పిన యర్థము సరిగనే యున్నది. కాని ద్విజుడగుట కుపనయన మొక్కటియే కారణముకాదు. ద్విజదంపతులకు బుట్టియుండుటయు నొక కారణము. పుట్టుకచే సంక్రమించిన ద్విజత్వము ఉపనయనముచే ప్రబలమగుచున్నది. ద్విజులై జన్మించని వారికి

జన్మనా అముఖ్యముక్తం ద్విజత్వం స ఏవ ముఖ్యం ద్విజత్వముపనయనాత్ప్రాప్నోతీతి.

21. శ్రీఖణ్డద్రుమగత ఇవ వహ్నిర్నిమ్బద్రుమగతోఽపి శీతవారణాదికం కరోత్యేవేతి న తత్ర కోఽపి విశేషః. ఏవ ముపనిషద్భిరుత్పాదితేవ కావ్యాదిభిరుత్పాదితాఽపి పణ్డా అజ్ఞానవారణాదికం కరోత్యేవేతి న తత్ర కోఽపి విశేషః. తస్మాత్ స్త్రీశూద్రాదీనాముపనిషదధ్యయనే వ్యర్థ ఏవాగ్రహః.

22. సర్వైరపి పణ్డోపజనన ఏవ బలవానాగ్రహః కర్తవ్యః. సా హ్యుపనిషత్పురాణ శ్రవణాది కర్తురపి దుర్లభా.

---

ఉపనయనమాత్రముచే ద్విజత్వము సిద్ధింపదని తెలియవలెను.

21. అగ్ని చందనపు కట్టెయందున్నను వేపకట్టెయందున్నను చలిని పోగొట్టుటలో వేడినిచ్చుటలో భేదముండదు. అట్లే ఆత్మజ్ఞాన ముపనిషత్తులవలన గలిగినను పురాణాదులవలన గలిగినను ఒక్కటియే. అది యజ్ఞానమును నశింపజేయుటలో భేదములేదు కావున స్త్రీ–శూద్రాదు లుపనిషత్తులనే జదువవలెనని పట్టుబట్టుటలో నర్థములేదు.

22. అందఱు నాత్మజ్ఞానము సంపాదించుటలో పట్టుదల నూపవలెను. అయ్యది యుపనిషత్తులను పురాణములను వినినమాత్రమున కలుగదు. 'ఎంతవినినను ఆత్మతత్త్వము

'శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చి' దితి శాస్త్రాత్. శమాది యుక్తస్యతూపనిషచ్ఛ్రవణాది కర్తుః ప్రయత్నలభ్యా. 'శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుశ్శ్రద్ధావిత్తస్సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యే' దితి శ్రుతేః. తస్మాత్తజ్జ్ఞా కామిభిస్సర్వైశ్శమాది సాధనసమ్పన్నైర్భవితవ్యమ్.

23. అముఖ్యాస్తు విద్యాస్తర్క వ్యాకరణాదిరూపా నానా సన్తి. 'పర్వతో వహ్నిమాన్ ధూమవత్త్వాత్; రామశబ్దో ఘుఞన్తః పుంలిఙ్గ' ఇత్యాద్యనాత్మ పదార్థజ్ఞానం

---

దెలియ' దని శాస్త్రము వచించుచున్నది. అది శమదమాది గుణములద్వారా లభించును. కావున నాత్మయాథార్థ్యము నెఱుగగోరినవారందఱు బహిరింద్రియనిగ్రహ (శమ) ము-అంతరింద్రియనిగ్రహ (దమ) ము మున్నగు గుణముల నభ్యసింపవలెను. 'శమదమాది సంపన్నుడై నిస్సంకల్పుడై యేకాగ్రచిత్తుడై బుద్ధికి సాక్షిగానున్న ఆత్మ వస్తువును గుర్తింపవలె' నని శ్రుతి వచించుచున్నది.

24. తర్కము, వ్యాకరణము మున్నగు విద్యలన్నియు నముఖ్యవిద్యలు. ఇట్టి పర్వతము వహ్నిగలది (పొగకలదు) "పొగ కనిపించుచున్నందున ఈ కొండపై నగ్ని యున్నదని తెలియును" ఇట్టియుదాహరణలు తర్కశాస్త్రమునందును. (వ్యాకరణము) క్రీడించుటయను అర్థముగల 'రమ్' అనుధాతువునకు 'ఘుఞ్' ప్రత్యయముచేర్చిన రామశబ్దము సిద్ధించును వ్యాకరణము

తర్కాదివిద్యాభ్యో జాయతే.

24. విద్యా పునరష్టాదశవిధా. 'అఙ్గాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః । పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతాశ్చతుర్దశ॥ ఆయుర్వేదో ధనుర్వేదో గాన్ధర్వశ్చార్థశాస్త్రక' మితి చతస్రః విశిష్యాష్టాదశ. ఛన్దో వ్యాకరణనిరుక్తజ్యోతిషాదీని షడఙ్గాని. ఋగ్యజుస్సామాథర్వాణశ్చత్వారో వేదాః. పూర్వమీమాంసా ఉత్తరమీమాంసా.

---

వలనను దెలియుచున్నది.

24. సామాన్యముగ విద్య పదునెనిమిది విభాగములుగ నున్నది. అవియెవ్వియన—

వేదములు:—

1 ఋగ్వేదము
2 యజుర్వేదము
3 సామవేదము
4 అథర్వవేదము
} 4

వేదాంగములు:—

1 శిక్ష
2 వ్యాకరణము
3 ఛందస్సు
4 నిరుక్తము

చేతి ద్వివిధా మీమాంసా. కాణాదగౌతమీయభేదేన ద్వివిధో న్యాయవిస్తరః. మత్స్యకూర్మస్కాన్దాదిభేదేనాష్టాదశవిధం పురాణమ్. మనుగౌతమపరాశరాదిభిః కృతం బహువిధం ధర్మశాస్త్రమ్. ఆయుర్వేదో వైద్యకమ్. ధనుర్వేదశ్చాపశాస్త్రమ్. గాన్ధర్వం సంగీతశాస్త్రమ్. అర్థశాస్త్రమ్ రాజనీతిరితి వివేకః.

25. ఏతా హి విద్యా యథాసమ్భవం పురుషార్థచతుష్టయప్రదాః. ఏతాశ్చగీర్వాణభాషాయాం వర్తన్తే. గీర్వాణభాషా చ సర్వభాషోత్తమా. అత ఏవేమా విద్యాశ్చ సర్వో

---

| | | |
|---|---|---|
| 5 జ్యోతిషము<br>6 కల్పము | } | 6 |
| పూర్వోత్తర మీమాంసా శాస్త్రము | | 1 |
| కాణాదగౌతమతర్క శాస్త్రము | | 1 |
| మత్స్యకూర్మాది పురాణవాఙ్మయము | | 1 |
| మనుగౌతమాది ధర్మశాస్త్రము | | 1 |
| వైద్యబోధకమగు నాయుర్వేదము | | 1 |
| బాణవిద్యాబోధక ధనుర్వేదము | | 1 |
| సంగీతబోధకమగు గాంధర్వము | | 1 |
| రాజనీతిబోధకమగు నర్థశాస్త్రము | | 1 |
| | | 18 |

25. పై జెల్పిన విద్యలు ఆయావిషయముల యోగ్యమునుబట్టి ధర్మార్థ కామమోక్షము నిచ్చును. పై విద్యలన్నియు

త్తమాః. ఇమాశ్చ వర్ణాశ్రమవిభాగవతి హిన్దూదేశే వర్తన్త ఇతి సర్వోత్తమోఽయం దేశః. ఏతద్విద్యాశ్రయత్వాద్ధిన్దూమతఞ్చ సర్వోత్తమమ్. ఆసు చ విద్యాసు సర్వాసు సర్వథా బ్రాహ్మణస్యాధికార ఇతి సర్వోత్తమో బ్రాహ్మణః. అత ఏవ సర్వైః పూజ్యః.

26. క్షత్త్రియవైశ్యయోస్తు వేదవిద్యానామధ్యయన ఏవాధికారో నత్వధ్యాపనే. స్త్రీశూద్రాదీనాన్తు పురాణాది శ్రవణ ఏవాధికారో న తు వేదశ్రవణేఽపి. ఏవం వ్యాకరణ శ్రవణేఽపి స్త్రీశూద్రాదీనాం నాధికారః ఛన్దోవత్సూత్రాణి

---

సంస్కృతభాషయందున్నవి. సంస్కృతము భాషలన్నిటియందుత్తమము. ఆ భాషయందున్న యీ విద్యలన్నియు నుత్తమము లైనవి. ఇవియన్నియు వర్ణాశ్రమ ధర్మములుగల హిందుదేశమున నున్నవిగాన నీదేశముకూడ సర్వోత్తమమైనది. ఇట్టివిద్యలకు బెన్నిధియైన హిందుమతము సర్వోత్తమము. ఈ విద్యలన్నిటి యందన్నివిధముల నధికరించిన బ్రాహ్మణుడెల్లరిచే వందనీయుడు.

26. క్షత్త్రియ వైశ్యులన్ననో పైవిద్యలను దాము చదువవచ్చునుగాని యితరులకు బోధించుటకు వీలు లేదు. స్త్రీలు శూద్రులు పురాణాదుల వినవచ్చును. గాని వేదము వినగూడదు. వ్యాకరణ పాణిని మహర్షి రచియించిన వ్యాకరణసూత్రములు వేదతుల్యములని మహాభాష్యకారులు

భవన్తీతి భాష్యాద్వ్యాకరణసూత్రాణి హి వేదప్రాయాణి.

27. సంస్కృతభాషాభ్యాస ఏవ స్త్ర్యాదీనామయుక్త ఇతి కేచిత్. వేదవేదాఙ్గాభ్యాస ఏవాయుక్తః సంస్కృతభాషాభ్యాసస్తు యుక్త ఏవేత్యన్యే. శాస్త్రాభ్యాస ఏవాయుక్తః కావ్యనాటకాద్యభ్యాసస్తు యుక్త ఏవేతి పరే. మమ తు స్త్రీశూద్రాదీనాం స్వదేశభాషాభ్యాస ఏవ యుక్త ఇతి ప్రతిభాతి. గీర్వాణభాషాభ్యాసే హి వేదాభ్యాసాదిష్వప్యతిప్రసఙ్గస్స్యాత్.

---

వచించిరికాన వీనిని స్త్రీ-శూద్రులు వినరాదు.

27. స్త్రీలు, శూద్రులు సంస్కృతభాష నభ్యసింపవచ్చునా లేదాయను విషయమున పలువురు పండితులు పలు తెఱంగుల జెప్పుచున్నారు. ఎట్లన—సంస్కృతభాష నభ్యసింపవచ్చును కాని వేదవేదాంగముల నభ్యసింపరాదని కొందరందురు. కావ్యనాటకములు జదువవచ్చును. శాస్త్రములుమాత్రము జదువరాదని కొందఱి యాశయము. ఇందు నాయభిప్రాయమేమనిన—వారు దేశ నభ్యసించుటయే కర్తవ్యమని తోచుచున్నది. సంస్కృతభాష జదువవచ్చుననిన సంస్కృతభాషామయమైన వేదశాస్త్రములందుగూడ ప్రవృత్తి కలుగును.

28. స్వదేశభాషాసు చ వేదాన్తార్థప్రకాశకా భాషా గ్రన్థా బహవస్సన్తి. తదధ్యయనాత్పణ్డా జనయితుం శక్యత ఏవేతి న మోక్షహానిః. వాపీ కూపకృషివాణిజ్య సమ్భోగాది కర్మకౌశలాన్యపి జాయన్త ఏవేతి నాపి ధర్మార్థకామహానిః. తస్మాత్ స్త్రీశూద్రాదిభిరవశ్యం దేశభాషాభ్యసనీయా.

---

28. ప్ర:- స్త్రీ-శూద్రులు సంస్కృతభాష జదువరాదనిన వారు వేదాంతార్థమును దెలిసికొనుటెట్లు?

ఉ:- వేదాంతమునకై సంస్కృతముతో బనిలేదు. వేదాన్తార్థమును బోధించు గ్రంథరాజములు దేశభాషలన్నిటి యందనేకము గలవు. వానినిజదివి వేదాన్తము దెలిసికొనవచ్చును. దానిని మననముచేసి యాత్మజ్ఞానము బడయవచ్చును. కావున మోక్షమునుగూర్చి వారి కేవిధమైన లోపము గలుగజాలదు. బావులు చెరువులు దేవాలయములు మున్నగు సత్కర్మలొనర్చి ధర్మమును, వ్యవసాయము వ్యాపారము జేసి యర్థమును, రతిసుఖముచే గామమును సంపాదింపవచ్చును గాన సంస్కృతభాష లేనందున స్త్రీశూద్రులకు గలిగెడి లోపమేదియు గానరాదు. కావున వారు తప్పక తమదేశభాషను బాగుగ నభ్యసింపవలెను.

29. నను—స్వదేశభాషేవ స్వరాజభాషాపి స్త్రీశూద్రాదిభిరభ్యసనీయా, రాజసేవాచరణార్థమితి చేన్నైవమ్. స్త్రీణాం శూద్రాదీనాఞ్చ క్రమాత్పతిసేవా ద్విజసేవైవ కర్తవ్యేతి. వస్తుతస్తు శూద్రాదీనామస్తునామ స్వరాజభాషాభ్యాసః, స్త్రీణాన్త్వయుక్త ఏవ. రాజసేవాచరణాయోగ్యత్వాత్తాసామ్. న హి పురుషధౌరేయనిర్వర్త్యా రాజోద్యోగాః స్త్రీభిర్నిర్వోఢుం శక్యన్తే.

30. నను—స్త్రీభిర్మా క్రియతాం రాజోద్యోగః. రాజవిద్యా త్వభ్యస్యత ఇతి చేత్—స్త్రీణామయం రాజవిద్యాభ్యాసః కిమర్థః? న తావద్ధర్మార్థః, రాజవిద్యాయా ధర్మా

---

29 రాజకీయోద్యోగము జేయుటకై రాజభాషను స్త్రీశూద్రు లభ్యసింపరాదాయనిన నదియు బనికిరాదు. స్త్రీలకు బతిసేవయు, శూద్రులకు ద్విజులొనర్చు యజ్ఞయాగాది సహాకారము కర్తవ్యమైయున్నది. ఇంకను విచారించిన—శూద్రులు రాజకీయోద్యోగముల జేయుటకై రాజభాష నభ్యసించుటలో నాక్షేపణము లేదు. స్త్రీలుమాత్రము రాజకీయోద్యోగముల కర్హురాండ్రు కానందున వారికి రాజకీయ భాషాభ్యాసము తగనిపని. కార్యదక్షులైన పురుషులు నిర్వహింపవలసిన రాజకార్యములు స్త్రీలవలన నెరవేరజాలవు.

30. ప్ర:- స్త్రీలు రాజకీయోద్యోగము చేయకపోనిండు; రాజభాష నేర్చుటలో తప్పేమున్నది?

చరణేఽనుపయోగాత్. నాప్యర్థార్థః, అస్వతన్త్రాయాః స్త్రియా అర్థార్జనాయోగాత్. నాపి కామార్థః, కామే రాజవిద్యాయా అనుపయోగాత్. స్వదేశవిద్యయైవ తత్సిద్ధేః. నాపి మోక్షార్థః, ఉక్తయుక్తేరేవ. న చ రాజపురుషైస్సహ సమ్భాషణార్థమితి వాచ్యమ్, కులాఙ్గనానాం వచః ప్రియతమశ్వశురాదిభిరేవేత్యుక్తత్వాత్.

31. కిఞ్చ రజోదర్శనాత్ప్రాగేవ స్త్రీభిర్విద్యాభ్యసనీయా, పశ్చాత్పతిసేవైవ కర్తవ్యేతి కృత్వా పతివ్రతాయా

---

ఉ:- ఉద్యోగము చేయనిచో నిక రాజభాషాభ్యాసమొనర్చుటెందులకు? అందేమైన ధర్మము సిద్ధించునాయనిన రాజవిద్యకు ధర్మాచరణమునకు నెట్టిసంబంధము లేదు. అర్థము (ద్రవ్యము) సమకూడునా? యనిన నదియుకల్ల. అస్వతంత్రలైన స్త్రీలు ధనమెట్లు సంపాదింప గలుగుదురు? కామప్రాప్తి కలుగునాయనిన కామానుభవ విషయమున రాజభాషకు సంబంధము లేదు. మోక్షము వచ్చునాయనిన దానితో బొత్తుగా సంబంధము లేదు. పోనిండు! రాజకీయోద్యోగులతో మాటలాడుటకై స్త్రీలు రాజభాష చదువవచ్చునుగదా! యని ప్రశ్నింతురు. ఇదియు ననావశ్యకమే. ఏలయన కుల స్త్రీలు తమ పతితో దప్ప నితరులతో సంభాషింపరు.

31. మఱియు స్త్రీలచదువు రజస్వలగాకపూర్వమే ముగియవలెను. రజస్వలయైనది మొదలు ఆమె పతిసేవయే

ధర్మజ్ఞానమేవ స్త్రీణామావశ్యకమ్. తే చ ధర్మాః స్వదేశభాషాయామేవ ప్రపఞ్చితా ఇతి స్వదేశభాషైవ దర్శితస్వల్పకాలే స్త్రీభిరభ్యసనీయా. అయన్త్వస్మాకం దేశ ఆన్ధ్ర ఇత్యత్రత్యస్త్రీభిరాన్ధ్రభాషైవ సవిశేషమభ్యసనీయా.

32. ఆన్ధ్రభాషాయాం హి బహవస్సద్గ్రన్థా భాగవతాదయస్సన్తి. తదభ్యాసవశాత్ స్త్రీభిస్సంసారో నిర్వోఢుం శక్యతే. మోక్షశ్చ సాధయితుమ్.

33. నను—స్త్రీశూద్రాదీనామస్తి పురాణశ్రవణేఽధికారః, పురాణాని చ సంస్కృతభాషాయాం వర్తన్తే.

---

జేయవలసి యుండునుగాన పతివ్రతగా బోవుస్త్రీలకు ధర్మవిజ్ఞానమే యావశ్యకము. ధర్మములన్నియు దేశభాషలలో విపులముగ వ్రాయబడియున్నవి. కావున వారికిగల స్వల్పవ్యవధిలో దేశభాషయందు పరిశ్రమయొనర్చుట మంచిది.

32. ఆంధ్రభాషలో భాగవతము మొదలగు నుత్తమ గ్రంథము లెన్నియేని కలవు. వానివలన స్త్రీలకు సంసారనిర్వాహమునకు వలయు ధర్మములు, తత్త్వజ్ఞానమున కుపకరించు ననేక విషయములును బోధపడును. ఆ గ్రంథముల సహాయమున వారు ఇహలోకసౌఖ్యమును మోక్షమునుగూడ సంపాదించుటకు సమర్థురాండ్రగుదురు.

33. ప్ర:— ఓయీ! స్త్రీలకు శూద్రులకు బురాణము వినుట కధికారము గలదందురు. పురాణములు సంస్కృత

సంస్కృతభాషాజ్ఞానశూన్యానాం కథమ్పురాణశ్రవణాత్తదర్థ బోధః? తస్మాదస్త్యేవ సంస్కృతభాషాభ్యాసే స్త్రీశూద్రాదీనామధికార ఇతి చేన్నైవమ్. పురాణప్రవక్త్రా బ్రాహ్మణేన పురాణార్థస్య దేశభాషయోచ్యమానత్వాత్. అత ఏవ పురాణశ్రవణాధికారః స్త్ర్యాదీనాం న తు తదధ్యయన ఇత్యుక్తమ్.

34 శ్లో॥ అధ్యేతవ్యం బ్రాహ్మణేన వైశ్యేన క్షత్రియేణ చ।
శ్రోతవ్యమేవ శూద్రేణ నాధ్యేతవ్యం కదాచన ॥

---

భాషలో వ్రాయబడినవి. సంస్కృత భాషాజ్ఞానములేని దే అందలి విషయముల గ్రహించుటదుర్లభము. కావున సంస్కృతభాషాభ్యాసమున స్త్రీశూద్రాదు లందఱకు నధికారము కల దనియే చెప్పవలెను కదా!

ఉ:- ఓయీ! పొరపడుచుంటివి. పురాణశ్రవణమనగా పురాణమందలి యర్థమును వినుట. పురాణార్థమును పౌరాణికు లాయాదేశభాషలలో జెప్పుచుందురు. స్త్రీశూద్రులకు పురాణశ్రవణాధికారము గలదనిరి కాని పురాణపఠనాధికార మున్నదని చెప్పరైరి. కావున సంస్కృత భాషాభ్యాసముతో బనిలేదు.

34. పురాణ పఠనాధికారమునుగూర్చి భవిష్యమహా పురాణమున నీ క్రిందివిధముగా జెప్పబడినది.

శ్రౌతం స్మార్తం చ వై ధర్మం ప్రోక్తమస్మిన్మహోత్తమ।
తస్మాచ్ఛూద్రైర్వినా విప్రం న శ్రోతవ్యం కదాచన ॥
ఇతి పురాణాధికారే భవిష్యోక్తేః.

35. తదపి పురాణశ్రవణం విప్రమగ్రే కృత్వైవ కుర్యాన్న తు స్వయమ్. అతఏవ—"నాధ్యేతవ్యమిదం శాస్త్రం వృషలస్య తు సన్నిధౌ" ఇతి కేవలశూద్రసన్నిధౌ పురాణాధ్యయనం నిషిద్ధం కౌర్మే.

36. నను—స్త్రీశూద్రాదీనాం పురాణాద్యధ్యయనే ప్రవచనే చ మాస్త్వధికారః, కావ్యనాటకాద్యధ్యయనే

---

"బ్రాహ్మణుడు వైశ్యుడు క్షత్రియు"డును పురాణముల జదువవలెను. శూద్రుడు వినవలెను. అతడెన్నడును జదువకూడదు. ఏలయన పురాణములందు శ్రౌతధర్మములు స్మార్తధర్మములు నందు వివరింపబడియున్నవి. కావున శూద్రులు బ్రాహ్మణసహాయములేక పురాణార్థమును వినగూడదు.

35. పురాణార్థమును వినునపుడుగూడ ముందు బ్రాహ్మణుని గూర్చునబెట్టుకొనియే వినవలెను. స్వయముగా వినరాదు. 'కేవలము శూద్రుల సన్నిధియందు పురాణము జదువరా'దని కూర్మపురాణమున జెప్పబడియున్నది.

36. ప్ర:— 'స్త్రీశూద్రులు పురాణము జదువరాద నుట సరియే. కావ్యనాటకాదుల జదువుటలో నాక్షేపణము లేదు. అందుకై వారు సంస్కృతి మభ్యసింపవలదా ?

తత్ప్రవచనే చాస్త్యేవాధికార ఇతి సంస్కృతభాషాభ్యాసస్తైః కర్తవ్య ఏవేతి చేన్నైవమ్. అతిప్రసఙ్గస్స్యాదిత్యుక్తత్వాత్.

37. నను—'మహత్యస్మిన్ కలియుగే కిముపన్యస్యతే త్వయా। మ్లేచ్ఛహూణాదయో వేదాఽధియన్తి యతిస్స్వయమ్?॥" ఇతి చేత్—"అస్తు! సోఽయం కలేర్దోషః కిముపన్యాసకస్య మే। బ్రవీమ్యహం శాస్త్రసిద్ధం దోషస్స్యాదన్యథా మను॥"

38. నను—మ్లేచ్ఛహూణాదిభాషాభ్యాసో ద్విజస్య

---

ఉ:— సంస్కృతము నేర్వవచ్చుననిన కొంత జదివి కొంత విడువవలెననుట యేటిన్యాయము? వారు సంస్కృత భాషను బొత్తుగా జదువరాదని పూర్వమే నిరూపింపబడినది.

37. ప్ర:— ఆహా! తమధర్మబోధ విపరీతముగనున్నది. వర్ణాశ్రమ ధర్మములులేని పాశ్చాత్య దేశములకు జెందిన మ్లేచ్ఛులు ఆంగ్లేయులు మున్నగు వారెందఱో వేద వేదాంగములను సైత మభ్యసించుచుండ మన భారతీయులలో గొందఱు చదువరాదనుట యేమిన్యాయము?

ఉ:— ఆర్యా! అది కలియుగ ప్రభావము! ధర్మబోధ చేయబూనిన నాకు వారితో నేమిపనియున్నది? నేనుశాస్త్రసిద్ధమైన విషయమును దెల్పుచుంటిని యథార్థము దెల్పని యెడల దోష మాపాదించును.

38. ప్ర:— మ్లేచ్ఛభాష, ఆంగ్లభాష మున్నగువానిని

ప్యయుక్త ఏవేతి చేత్!

—కేనోక్తం యుక్తమితి? "న మ్లేచ్ఛితవా" ఇతి శ్రుతేః మ్లేచ్ఛభాషాదయోఽపశబ్దాః.

39. నను—యథా ద్విజైర్మ్లేచ్ఛహూణాదిభాషాభ్యాసః క్రియతే, తథా స్త్రీశూద్రాదిభిరపి వేదవేదాఙ్గాధ్యయనం క్రియతామ్ ఇతి చేత్— తర్హి తే ద్విజాః, తే ద్విజేతరవర్ణాః తాః స్త్రియశ్చ సర్వేఽపి పతితా ఏవ.

40. న చ వేదాధ్యయనస్య సత్కర్మత్వాత్తేన స్త్ర్యాదయో న పతన్తీతి వాచ్యమ్ అవిహితత్వాత్తస్యాచరణేన తే పతన్త్యేవ. యస్య వర్ణస్య యద్విహితంతస్య కరణాద్ధి

---

ద్విజు లభ్యసించుటయు దోషావహము కాదా ?

ఉ:— దోషావహము కాదని యెవరుజెప్పిరి? మ్లేచ్ఛ శబ్దోచ్చారణ మొనర్చుట పాపకృత్యమని శ్రుతిమాత తెల్పు చున్నది. మ్లేచ్ఛ పదము లపశబ్దములనియు నిర్ణయింపబడెను.

39. ప్ర:— ద్విజులు మ్లేచ్ఛహూణాదిభాషల నభ్యసించి నట్లె స్త్రీశూద్రులు సైతము సంస్కృత భాషాభ్యాస మొనర్పరాదా ?

ఉ:— అట్లయిన నిషిద్ధాచరణమువలన ద్విజులు పతితులైనట్లు స్త్రీశూద్రులుగూడ పతితులయ్యెదరు.

40. ప్ర:— వేదాధ్యయనము పవిత్రకర్మగావున దాని నెవ్వరభ్యసించినను పుణ్యము సంక్రమింపవలదా ?

స పుణ్యలోకాన్గచ్ఛతి! తద్భిన్నస్య చ కరణాత్పతతి. 'అకుర్వన్విహితం కర్మ నిన్దితఞ్చ సమాచరన్, ప్రసక్తశ్చేన్ద్రియార్థేషు నరః పతనమృచ్ఛతి' తీతి మనువచనాత్. అతఏవ "పరధర్మో భయావహః" ఇత్యుక్తం గీతాయాం.

41. తస్మాద్ద్విజైః సంస్కృతభాషా వేదవేదాఙ్గాది విద్యాశ్చాభ్యసనీయాః. స్త్రీశూద్రాదిభిస్తు స్వదేశభాషా తదాశ్రయగ్రన్థాశ్చాధ్యేతవ్యాః ఇతి.

---

తా:– ఏ పుణ్యకర్మ యెవ్వరాచరింపవలెనని శాస్త్రము విధించునో, ఆ వర్ణస్థుడా కర్మ నాచరించినపుడే పుణ్యము వచ్చును. తనకు విధింపబడని కర్మ ఎట్టిదైనను దాని నాచరించిన పాపమే సంక్రమించును. ఈవిషయమున మనుస్మృతి–

"విహితమగు కర్మ నాచరింపకున్నను, నిందిత కర్మ జేసినను, ఇంద్రియ సుఖముల నెంబడించినను మానవుడు పతితుడగు" నని తెల్పుచున్నది.

పరధర్మము భయప్రదమని గీత వక్కాణించుచున్నది.

41. కావున ద్విజులు సంస్కృతభాషను వేద వేదాంగాది విద్యలను నభ్యసింపవలెను. స్త్రీలు శూద్రులు మున్నగువారు తమ దేశభాష నభ్యసించి యందలి యుత్తమ గ్రంథముల జదువవలెను.

42. నను—పూర్వకాలే క్షత్రియప్రభుభిర్యథావర్ణం యథాశ్రమఞ్చ ప్రజానాం పరిపాల్యమానత్వాద్ద్విజైర్వేదవేదాఙ్గాద్యధ్యయనమేవ కృతమ్, స్వధర్మస్థైస్సద్భిర్ద్విజైస్తత్కుటుమ్బస్య ప్రభుణా పరిపుష్టత్వాత్. ఇదానీన్తు హూణప్రభుభిర్యథేచ్ఛం పాల్యమానత్వాత్ప్రజానాం, ద్విజానాఞ్చస్వ

---

42. ప్ర:- పూర్వకాలమున క్షత్రియప్రభువులుండిరి. వారు వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి ప్రజల నేలుచుండిరి. అపుడు బ్రాహ్మణులు వేదవేదాంగముల క్షుణ్ణముగ జదువుచుండిరి. వారి కుటుంబ రక్షణమును ప్రభుత్వమే చూచుచుండెను. ఇప్పు డాంగ్ల విద్యాధికులైన ప్రభువులు తమ యిష్టానుసారముగ పరిపాలించుటచే ద్విజులకు దమవృత్తిలో కుటుంబపోషణము దుర్లభమైపోయెను. కావున వారు కుటుంబపోషణార్థమై హూణవిద్యాభ్యాస మొనర్చుటలో దప్పేమిగలదు ?

ఉ:-జీవనము జరుగనియెడల శాస్త్రము నిర్ణయించిన యాపద్ధర్మము నాశ్రయింపవలెనుగాని నిషిద్ధకర్మము లాచరించి జీవింపరాదు. బ్రాహ్మణుని వృత్తినిగూర్చి మనుస్మృతి యిట్లు తెలుపుచున్నది, (1) ఋతము. (2) అమృతము. (3) మృతము. (4) ప్రమృతము. (5) సత్యానృతము. ఈ యైదు వృత్తులు బ్రాహ్మణునకు జీవనార్థమై విధింపబడినవి. ఇందు మొదటివృత్తివలన జీవనము జరుగనియెడల రెండవవృత్తి-

వృత్తిసత్వే కుటుంబపోషణాసిద్ధేః ద్విజైరప్యవశ్యం వణిజ్యాభాషాధ్యేత వ్యైవ-ఇతి చేదుచ్యతే.

43. శ్లో॥ ఋతామృతాభ్యాం జీవేత్తు మృతేన ప్రమృతేన వా।
సత్యానృతాభ్యామపి వా న శ్వవృత్త్యా కదాచన॥
ఋతముఞ్ఛశిలం జ్ఞేయమమృతం స్యాదయాచితమ్।
మృతస్తు యాచితం భైక్షం ప్రమృతం కర్షణం స్మృతమ్॥
సత్యానృతన్తు వాణిజ్యం తేన చైవాపి జీవ్యతే।
సేవా శ్వవృత్తిరాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్॥

---

దానిచే జరుగనిపక్షమూ లేనది, అప్పుడును దుర్లభమైన నాలనది, కాకున్న నైదవది యిట్లెద్దియో నొక్కదానిని స్వీకరింపవలెను.

43 ఋతము = ఉఞ్ఛవృత్తి లేక శిలవృత్తి (రోళ్ళవద్దగాని పొలములోగాని యజమాని గింజలదీసికొని పోయిన పిమ్మట నొక్కొక్కగింజ నేరికొనుట) ఇది యుత్తమవృత్తి.

2 అమృతము = అయాచితముగ లభించిన దానితో జీవించుట ఇదిమధ్యమము.

3 మృతవృత్తి = యాచించి జీవించుట ఇదియధమము.

పై చెల్పిన మూడువృత్తులు బ్రాహ్మణునకుస్వధర్మమే పై వృత్తులతో జీవికానిర్వాహణము జరుగనిపక్షమున నీ క్రింది వైశ్యవృత్తుల నవలంభింపనచ్చును. అవియెవ్వియన—

4 ప్రమృతము = వ్యవసాయము

ఇతి మనువచనాద్రాజసేవయా కుటుంబపోషణార్థం హూణవిద్యాభ్యాసం ద్విజో న కుర్యాదేవ. రాజసేవాయాః స్వధర్మాచరణస్య చ బలవాన్హి విరోధః కాకోలూకయోరివ.

44. నను—ధనార్జనార్థం హూణవిద్యాభ్యాసః కర్తవ్య ఏవ ద్విజస్యేతి చేత్—తర్హి కామార్థం విధవావివాహోఽపి కర్తవ్య ఏవ. న హి ద్విజైర్ధనమార్జనీయమ్, కింతు ధర్మ ఏవ.

తథా చ మనుః—

---

5 సత్యానృతము = వ్యాపారము.
ఈ రెంటిలో మొదటిపక్షము వ్యవసాయమని తెలియవలెను. ఏవంస్థితియందైనను 'శ్వవృత్తి' అనగా సేవకవృత్తి—నాశ్రయింపరాదని మనుస్మృతి చెప్పుచున్నది. కావున హూణవిద్యాభ్యాసముగాని, తన్మూలమున రాజసేవగాని దూష్యములే యైయున్నవి. శాస్త్రవిహిత ధర్మముల ద్వారమున జీవనము జరుగదని భయము లేదు. రాజసేవలో ప్రవేశించినవారల స్వధర్మము నాచరించుట దుర్లభము. స్వధర్మము, రాజసేవ ఇవి కాకి గుడ్లగూబలవలె సహజవైరము గల్గినవి.

44. ధనములేనిదే యెవరును జీవింపజాలరు. ఇక్కాలమున హూణవిద్యాభ్యాసము లేనిదే ధనము లభింపదు. కావున ద్విజులు హూణవిద్యాభ్యాసము చేయక తప్పదందురా? అట్లైన కామోపశమనమునకై విధవా వివాహముగూడ

శ్లో॥ కుసూలధాన్యకో వా స్యాత్కుమ్భధాన్యక ఏవ వా।
త్ర్యహైహికో వాపి భవేదశ్వస్తనిక ఏవ వా॥
చతుర్ణామపి చైతేషాం ద్విజానాం గృహమేధినాం।
జ్యాయాన్పరః పరో జ్ఞేయో ధర్మతో లోకజిత్తమః॥
ఇతి; "నేహేతార్థాన్ప్రసఙ్గేన న విరుద్ధేన కర్మ" ణేతి చ.

---

కర్తవ్యమే. ఇది సమంజసముకాదు. ద్విజు లార్జింపదగినది ధనముగాదు; ధర్మము.

మనుస్మృతి యిట్లుచెప్పుచున్నది:—

గృహస్థుడైన బ్రాహ్మణు డెంతధనము చేర్చుకొన వచ్చుననగా—

1 కుసూలపరిమిత ధాన్యము అనగా 3సం॥ సరిపోవు గింజలు. ఇంతకుమించి నిలువజేయరాదు.

2 కుంభిపరిమిత ధాన్యము అనగా 6 నెలలకు సరిపోవు గింజలు. పూర్వముకన్న ఇతడు శ్రేష్ఠుడు.

3. మూడుదినముల ధాన్యము. ఇతడింకను శ్రేష్ఠుడు

4 రాత్రికిమాత్రము సరిపోవుధాన్యము. ఇతడందరిలో శ్రేష్ఠుడని గ్రహించవలెను. దీనినిబట్టి బ్రాహ్మణుడు ధనికుడుగా నుండుటకు శాస్త్రము నంగీకరెంచుటలేదని తెలియుచున్నది. అతడు ధర్మముచేతనే లోకమును జయింపవలెను.

కావున నేవిధముగ జూచినను హూణవిద్యాభ్యాసము తగదని తెలియవలెను.

45. నన్వేవమయుక్తోఽపి హూణవిద్యాభ్యాసో ధనసఙ్గ్రహార్థం, కామార్థం విధవావివాహో యుక్త ఏవేతి చేన్నైత్రవమ్-

శ్లో॥ నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషితమ్ ।
పతిం శుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే ॥
పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా ।
పతిలోకమభీప్సన్తీ నాచరేత్కిఞ్చిదప్రియమ్ ॥
కామన్తు క్షపయేద్దేహం పుష్పమూలఫలైశ్శుభైః ।
తు న మాపి గృహ్ణీయాత్పత్యౌ ప్రేతే పరస్య తు ॥

---

45 అర్థార్జనమునకై హూణవిద్యాభ్యాసము లేకుండుగాక— కామమునకై విధవా వివాహముచేయుట తగునందురేమో. అదియు కూడదు. స్త్రీప్రవర్తనమును గూర్చి మనుస్మృతి యిట్లు తెల్పుచున్నది.

"స్త్రీలకు వేరుగా యజ్ఞముగాని వ్రతముగాని ఉపవాసముగాని లేదు. పతిసేవయే వారాచరింపదగిన ధర్మము. దానివలననే వారికి స్వర్గసౌఖ్యములభించును. పతి జీవించునంతకాల మాతనికిష్టముగానిపని సేయక మెప్పించి, అతడు మరణించినపిమ్మటగూడ నాతనిలోకముననే తానును జేరగోరు సాధువర్తనముగల్గి యాతనికి ప్రియమైనవిధముగ వర్తింపవలెను. కందమూల ఫలములదినుచు దేహమును త్యజించుకొనవలెను పరపురుషుని పేరుగూడ తలచరాదు.

ఆశీతామరణాత్ క్షాన్తా నియతా బ్రహ్మచారిణీ ।
యో ధర్మ ఏకపత్నీనాం కాఙ్క్షన్తీ తమనుత్తమమ్ ॥
అనేకాని సహస్రాణి కుమారబ్రహ్మచారిణామ్ ।
దివం గతాని విప్రాణా మకృత్వా కులసన్తతిమ్ ॥
మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।
స్వర్గం గచ్ఛత్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః ॥
* అపత్యలోభాద్యా తు స్త్రీ భర్తార మతివర్తతే ।
సేహ నిన్దామవాప్నోతి పరలోకాచ్చ హీయతే ॥

---

జీవితాంతమువఱకు బ్రహ్మచర్యవ్రతమూని నియమబద్ధురాలై ప్రవర్తింపవలెను. ఉత్తమోత్తమమైన పాతివ్రత్యధర్మమును గాంక్షించుచున్నదై జీవితశేషము గడుపవలెను. అటులయినను వంశవిచ్ఛేదమై పుణ్యలోకము కలుగునెట్లని సంశయింపవలదు. పూర్వము వేలకొలది బాలబ్రహ్మచారులు వంశాంకురముల నిలుపక జీవితమంతయు వ్రతనియమముతోడనే గడపి స్వర్గలోకమును జేరిరి. ఇట్లే సంతానరహితలైన వితంతులు గూడ బ్రహ్మచర్యవ్రతమూని జీవితము గడపినచో స్వర్గధామము జేరుదురు.

* సంతానమునం దాశగల్గి యే వితంతువు భర్తనతిక్రమించునో ఆమె యీలోకమున నిందలపాలగుటయేగాక పుణ్యలోకముల గూడ సంపాదింపజాలదు. హిందూమతమున సంతానమనిన అగ్నిసాక్షిగ వివాహమాడిన దంపతులకు జనించినది

నాన్యోత్పన్నా ప్రజాస్తీహ న చాప్యన్యపరిగ్రహే।
న ద్వితీయశ్చ సాధ్వీనాం క్వచిద్భర్తోపదిశ్యతే॥
వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతామ్।
సృగాలయోనిం ప్రాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే॥
ఇతి మనువచనేభ్య స్తస్యాయుక్తత్వాత్.

46. ఏవం యుక్తాయుక్తవివేకజ్ఞానస్య శ్రుతిస్మృత్యాద్యభ్యాసాధీనత్వాద్ద్విజః శ్రుతిస్మృత్యాదివిద్యా ఏవాభ్యసేత్.

శ్లో॥ యోఽనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమమ్।
స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః॥

---

మాత్రమే సాధ్వీమణులకు రెండవభర్తవ పరిస్థితియందును శాస్త్రముచే జెప్పబడలేదు. స్త్రీ పరపురుషగామినియైనచో నీజన్మమున నింద్యురాలగుటయు, జన్మాంతరమున నక్కకడుపున బుట్టి గొప్పరోగములచే బాధపడును. ఈ విధముగ మనుస్మృతి విధవా వివాహమును నిషేధించెను.

46. పై విధమగు యుక్తాయుక్తవివేకము శ్రుతిస్మృతుల నభ్యసించినగాని కలుగదు. కావున ద్విజుడు శ్రుతిస్మృత్యాది విద్యలనే యభ్యసింపవలెను.

"ఏ విప్రుడు వేదాధ్యయనము జేయక ఇతరవిద్యలందు బరిశ్రమ మొనర్చునో అతడు తన వంశస్థులతోసహా

ఇతి మను వచనాద్ద్విజస్య తావద్వేదాధ్యయనం ముఖ్యమ్. పశ్చాత్తు తదర్థబోధాయ వ్యాకరణాదిక మభ్యసేత్.

47. నను—వేదవేదాఙ్గాదిషు ద్విజస్యైవాధికారః, స్వదేశభాషాగ్రన్థేష్వేవ స్త్రీశూద్రాదీనామధికార ఇతి—నేదేతదాస్తామ్; గాన్ధర్వే కః పునరధికారీ?
అత్రోచ్యతే:— గాన్ధర్వం త్రివిధమ్. నృత్తం-గీతం-వాదిత్ర ఞ్చేతి. అభినయనామకో గాత్రవిక్షేపో నృత్తమ్; ధ్వనిమయస్యాక్షరమయస్య వా గానం గీతం; మృదఙ్గాది నాదనం వాదిత్రమితి వివేకః.

---

యీ జన్మముననే శూద్రత్వము బొందునని మనుస్మృతి తెల్పుచున్నది గాన ద్విజునకు వేదాధ్యయనము ముఖ్యమైనది. పిమ్మట దానియర్థము గ్రహించుటకు వ్యాకరణాది శాస్త్రముల నభ్యసింపవలెను.

47. వేదవేదాంగాదివిద్యలకు ద్విజులు,స్వదేశభాషలకు స్త్రీశూద్రులును అర్హులనుమాట యటుండనిమ్ము. సంగీత శాస్త్రమున కర్హులెవరందురా? వినుడు?
సంగీతము మూడువిధములు:— (1) నృత్తము (2) గీతము.

(3) వాదిత్రము

1. శరీరముతో గావించెడి అభినయము (నృత్తము.)
2 రాగమునుగాని పాటలగాని కంఠముతో బాడుట (గానము)
3. మృదంగము మొదలగువానిని వాయించుట(వాదిత్రము)

48. ఏతేషు త్రిష్వపి న ద్విజస్యాధికారః, నృత్తాది కరణేన ద్విజస్యాపాఙ్క్తేయత్వప్రాప్తేః. తథా హి— భారతే:—

శ్లో॥ గ్రామ్యప్రేష్యో వార్ధుషికో గాయకస్సర్వవిక్రయీ।
కుశీలవో దేవలకో నక్షత్రైర్యశ్చ జీవతి॥ ఇతి॥

మనుస్మృతౌ:—

శ్లో॥ కుశీలవోఽవకీర్ణీ చ వృషలీపతిరేవ చ।

ఇతివచనాత్.

---

48. పై దెల్పిన మూడువిధములగు సంగీతమందును ద్విజులకు నధికారము లేదు. నృత్తగాన వాద్యములజేయు ద్విజుడు పంక్తిబాహ్యుడు (అనగా నతనితో గూడ నొక్క పంక్తియందు భోజనము చేయరాదు.) అని శాస్త్రము తెల్పుచున్నది. అపాంక్తేయులనుగూర్చి భారతము—మనుస్మృతి యిట్లు చెప్పుచున్నవి.

భారతము:—"గాయకుడు, సర్వపదార్థముల విక్రయించువాడు, నక్షత్రో జీవించువాడు, అర్చకత్వమున జీవించువాడు, జ్యోతిషముతో జీవించువాడు వీరు పంక్తిబాహ్యులు.

మనుస్మృతి:— "సంగీతపాఠకుడు, బ్రహ్మచర్యదీక్షనవహించి భ్రష్టుడైనవాడు, రజస్వలయైన కన్యను వివాహమాడినవాడు వీరు పంక్తిబాహ్యులు.

49. స్త్రీష్వపి వేశ్యాదీనామేవాధికారో న ద్విజస్త్రీణామ్— "మునినా భరతేన యః ప్రయోగో భవతీ ష్వప్సరసాశ్రయో నిబద్ధ" ఇతి దేవవేశ్యాప్రతివచనాత్. ఇతి.

50. వస్తుతస్తు నృత్యాద్యుదరార్థం నిషిద్ధమితి శ్రీధరస్వామివచనాత్ — యే నృత్యాదిత్రయం జీవనార్థం విదధతి తే ద్విజా ఏవాపాఙ్క్తేయాః. యే పునర్భగవద్భక్త్యా భగవత్ప్రీత్యర్థం కుర్వతే తే ద్విజా

---

49. ప్ర:— పురుషులమాట సరియే. స్త్రీలందఱు సంగీత మభ్యసింపవచ్చునా?

ఉ:— స్త్రీలలోఁగూడ వేశ్యలు మొదలైనవారుమాత్రమే సంగీతము నేర్వవలెను. ద్విజాతి స్త్రీలకు పనికిరాదు. ఒక యప్సరస వేశ్యాంగనలతో నిట్లనెను "భరతమహర్షి శృంగారాద్యష్టరసముల కాశ్రయమైన గాంధర్వమును మాకొఱకై నిర్మించెను." ఈ వాక్యముచే గాంధర్వము వేశ్యలకై నిర్మింపబడినట్లు తెలియుచున్నది.

50. అట్లయినచో శ్రీ త్యాగరాజస్వామి మున్నగు మహానుభావులుగూడ నపాంక్తేయులగుదురా? యని సందియము కలుగవచ్చును. ఇందు యథార్థమేమనిన— సంగీత ముదరపోషణమునకై నిషేధింపబడినదని శ్రీధరస్వామి చెప్పెను. ఏ ద్విజులు జీవనార్థమై సంగీత మభ్యసింతురో వారు అపాంక్తేయులు. ఎవరు భక్తిచే భగవంతుని మెప్పించుటకై సంగీత

నైవాపాఙ్క్తేయాః. అత ఏవ శివనారదహనూమ దాదిభిర్నృత్యాదికం విధీయత ఇతి పురాణాదిషుదృశ్యతే. ఏవం ద్విజస్త్రీభిరపి భగవద్భక్త్యా భగవత్ప్రీత్యర్థం గానం విధేయమేవ. నృత్తవాదిత్రే తు న విధేయే, సరస్వత్యాది కులస్త్రీభిర్గానమాత్రస్యైవ విహితత్వదర్శనాత్, ఇతి.

51. ఏవం జీవనార్థం వైద్యకం కుర్వన్తోపి ద్విజా అపాఙ్క్తేయా ఏవ— ''చికిత్సకాన్దేవలకాన్'' ఇతి మనువచనాత్. యే పునరాయుర్వేదమధీత్య పరోపకారార్థమనిన్దితాం చికిత్సాం కుర్వన్తి తే ద్విజాః పాఙ్క్తేయా ఏవ.

---

మభ్యసింతురో. అట్టి ద్విజులకు దోషములేదు. కావుననే శివుడు, నారదుడు హనుమంతుడు నృత్యము జేయుదురని పురాణములు దెల్పుచున్నవి. ఇట్లే ద్విజులలో స్త్రీలుకూడ భగవత్ప్రీతికై గానము నేర్వవచ్చును. కాని నృత్తవాదిత్రముల నేర్వరాదు; ఏలయన సరస్వతి మున్నగు కులాంగనలు గానమును మాత్రమే స్వీకరించిరి.

51. ఇట్లే జీవనార్థమై వైద్యముజేయు ద్విజులుగూడ నపాంక్తేయులే "చికిత్సకాన్ దేవలకాన్" (వైద్యులు-పూజారులు మొ॥) అనెడి మనువచనము దీనికి ప్రమాణము. ఎవరు పరోపకారముకై ఆయుర్వేదము నభ్యసించి వైద్యము జేయుదురో వారికెట్టిదోషమును లేదు. చికిత్సను గూర్చి నింద యేలవచ్చెననగా ''రసము'' మున్నగు మహాపదార్థ

చికిత్సాయాం సిద్ధితత్త్వాఖ్యే రసమారణాదిప్రయుక్తమ్.

52. యుద్ధస్య క్షత్రియధర్మత్వేన భూతదయాయాశ్చ బ్రాహ్మణధర్మత్వేన చ విహితత్వాద్ధనుర్వేదాధ్యయనప్రయుక్తయుద్ధలక్షణఫలస్య రాజగామిత్వాన్న బ్రాహ్మణస్య ధనుర్వేదాధికారః.

53. వస్తుతస్తు ఆత్మరక్షార్థం ధనుర్వేదోపి ద్విజైర్నాధ్యేతవ్య ఏవ. తేన ప్రాణివధస్తు న విధేయః. తస్మాచ్ఛాస్త్రాచ్ఛిష్టాచారాద్వా యస్య యస్య యా యా విద్యా

---

ముల భస్మము చేయుటయే యిందుకు గారణము.

52. ధనుర్వేదమును బ్రాహ్మణు డధ్యయనము చేయకూడదు. ఏలయన నా విద్యచే నిర్వహింపదగిన యుద్ధము రాజులకు సంబంధించినది కావునధనుర్వేదమునకు క్షత్రియులే యర్హులు. భూతదయా ప్రధానులగు బ్రాహ్మణుల కందధికారము లేదు.

53. ప్ర:— అటులయిన నాత్మరక్షణమెట్లు?

ఉ:— ఆత్మ రక్షణమున కుపయోగించు నంతవఱకు బ్రాహ్మణుడు ధనుర్వేదము నభ్యసింపవచ్చును. కాని తనుమూలముగ ప్రాణుల వధింపరాదు.

పైచెప్పినరీతి ఏ యే వర్ణమున కేయేవిద్య నేర్వదగినదో శాస్త్రమును పెద్దల యాచారమునుబట్టి తెలిసికొని ఆయా

విహితా, తేవ తేన సా సాऽవశ్యమధ్యేతవ్యైవేతి విస్పష్టః.

—:అథ విద్యాప్రయోజనాన్యుచ్యన్తే:—

54. శ్లో॥ మాతేవ రక్షతి పితేవ హితే నియుఙ్క్తే
కాన్తేవ చాభిరమయత్యపనీయ ఖేదమ్,
కీర్తిం చ దిక్షు వితనోతి తనోతి లక్ష్మీం
కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా.

55. శ్లో॥ కేయూరాణి న భూషయన్తి పురుషం
హారా న చన్ద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం న కుసుమం
నాలఙ్కృతా మూర్ధజాః।

---

వర్ణింపు లాయావిద్యల జదువవలెను.

—: విద్యవలన ప్రయోజనములు :—

54. విద్య తల్లివలె రక్షించును, తండ్రివలె హితకార్యములందు నియమించును, ప్రియురాలివలె కష్టముల నెడబాపి సుఖంపజేయును, నలుగడలగీర్తి వ్యాపింపజేయును, సంపదల సమకూర్చును అదియిదియననేల? కల్పవృక్షమువలె సమస్తమగు నభీష్టముల నెరవేర్చును.

55. సువర్ణమయములగు కిరీటములు భుజకీర్తులు తళతళలాడు ముత్తెముల పేర్లు పన్నీటిస్నానము ఘుమఘుమలాడు చందనపు మైపూతలు కురులందు పూలముడుపు మొదలైన శృంగారములు పురుషునకు వన్నె తెచ్చునవికావు నిర్దుష్టమై

వాణ్యేకా సమలంకరోతి పురుషం
యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తే ఖలు భూషణాని సతతం
వాగ్భూషణం భూషణమ్ ॥

56. "స్వదేశే పూజ్యతే రాజా, విద్వాన్ సర్వత్ర పూజ్యతే"
"విద్యయా వినయోత్కర్షః"
"విద్యయా చ విముచ్యతే"

శ్లో॥ విద్యా నామ నరస్య రూపమధికం
ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యాబన్ధుజనో విదేశగమనే
విద్యా గురూణాం గురుః ।

---

ప్రజారంజకమైన వాక్కు ఒక్కటియే రాణింపజేయును. తక్కిన యాభరణము లన్నియు కొంత కాలమునకు క్షీణించును. 'వాక్కు' అనెడి భూషణముమాత్రమే యెన్నటికిని చెడనివస్తువు.

56. రాజు, తన దేశమందుమాత్రమే గౌరవము బడయును. విద్యావంతుడు ఏ దేశము వెళ్ళినను అచట గౌరవింపబడును. విద్యయబ్బినకొలది పెద్దలయెడ వినయము హెచ్చుచుండును.— మోక్షమునకుగూడ విద్యయే కారణము.

మనుష్యునకు విద్యయే సౌందర్యమును దెచ్చిపెట్టును. రహస్యముగా దాచుకున్న ధనమువలె విద్య యుపకరించును పరదేశములకు వెళ్ళినప్పుడు చుట్టమువలెగాపాడునది విద్యయే. గురువులకెల్ల గురుస్థానము నహించునది విద్యయే. విద్యవలన

విద్యా భోగకరీయశస్సుఖకరీ
విద్యా వివేకప్రదా
విద్యా రాజసుపూజితా న హి ధనం
విద్యావిహీనః పశుః॥
57. 'సద్విద్యానుపసేవ్యతామనుదినమ్'
'విద్యా జ్ఞానాయ భవతి'
'విద్యా వివాదా' యేతి తు—ఖలవిషయమ్.

---

ఐహికసుఖము, కీర్తియు గల్గును. విద్యచే వివేకముగల్గును. మహైశ్వర్యసంపన్నులైన రాజులుగూడ విద్యనేగౌరవింతురు. ధనము నాదరింపరు. వేయేల? విద్యలేనివాడు పశువుతో సమానుడని చెప్పవచ్చును.

57. (శ్రీ) శంకరాచార్యులవారు మోక్ష సోపానములు చెప్పుచు "ప్రతిదినము సద్గుణ గరిష్ఠుడైన విద్వాంసుని సేవింపు"మనియు నొక కర్తవ్యముగ జెప్పినారు. విద్య వలన జ్ఞానముదయించుననియు దెల్పిరి.

ప్ర:— విద్యవలన వాదోపవాదములు పెరుగును గదా!

ఉ:— దుర్మార్గుల నాశ్రయించినపుడే విద్య కా స్థితి గల్గును. సన్మార్గులు వాదమును పెంచక సిద్ధాన్తము నన్వేషింతురు.

ప్ర:— విద్య యెవరియొద్దనున్నను సేవింపవలెనా?

ఉ:— దుర్మార్గునియొద్ద విద్యయున్నను అతడు దూర

'దుర్జనః పరిహర్తవ్యో విద్యయాఽలఙ్కృతోఽపి సన్,
మణినా భూషితస్సర్పః కిమసౌ న భయఙ్కరః ॥'
ఇతి వచనాత్ఖలస్య విద్యా దోష ఏవ, న తు గుణః.

58. విద్యాసు చాధ్యాత్మవిద్యోత్తమా – 'అధ్యాత్మ విద్యా విద్యానా' మితి గీతావచనాత్. అనాత్మవిద్యాసు చ వేదవిద్యోత్తమా—వేదస్యా పౌరుషేయత్వేన స్వతఃప్రమాణత్వాత్. అనయా చ యజ్ఞయాగాదికర్మాణి ప్రతిపాద్యన్త ఇతి వేదాధ్యయనస్య యజ్ఞాద్యనుష్ఠానం ఫలమ్, తస్య చ స్వర్గాదిః. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజే' తేత్యాదిశ్రుతేః. అతఏవ 'త్రైగుణ్యవిషయా వేదా' ఇతి గీతం భగవతా.

---

ముగ నుంచదగినవాడే. ఎట్లన–అమూల్యమైనమణి శిరస్సున నలరారుచున్నను సర్పము భయంకరమైనదియే. కావున దుర్జనునకు విద్య ప్రమాదకరమే కాని ప్రయోజనకారికాదు.

58. విద్యలలో వేదాంతవిద్య ఉత్తమము. 'అధ్యాత్మ విద్య నా స్వరూప' మని భగవానుడు గీతలో వెల్లడించెను. తక్కిన విద్యలలో వేదవిద్య ఉత్తమము. అది మానవరచిత ముగాక స్వతస్సిద్ధ ప్రమాణమైయుండుట అందుకు గారణము. వేదము జదివినందుకు దానిలో జెప్పబడిన యజ్ఞాదికర్మముల జేయుట ఫలము. దానికి స్వర్గముఫలము. జ్యోతిష్టోమ యాగము వలన స్వర్గము లభించునని శ్రుతివాక్యము తెల్పుచున్నది. భగవద్గీతయు త్రిగుణములకులోబడిన సర్వకర్మములు వేద మందు నిరూపింపబడినట్లు నుడువుచున్నది.

ఆద్యర్థకం భవతి.

61. కావ్యలక్షణఞ్చ "అదోషౌ సగుణౌ సాలఙ్కారౌ శబ్దార్థౌ కావ్య"మితి పూర్వైరుక్తమ్ తతః కావ్యనిర్మాణాయాలఙ్కారశాస్త్రాధ్యయనం చ కర్తవ్యమ్.

62. లక్ష్యలక్షణాతివ్యాప్త్యవ్యాప్త్యసమ్భవవ్యభిచారాదిపదార్థజ్ఞానం న్యాయశాస్త్రాధ్యయనస్య ఫలమ్

---

ఏలె మనసున కెక్కునటుల బోధించును.

61. శ్రుతికటుత్వము నేయార్థత వ్యాకరణవిరోధము మొదలైన దోషములు లేనట్టియు, రసానుగుణపదబంధము, స్ఫుటముగా నర్థమగుట, సుశబ్దత మున్నగు గుణములు గల్గినట్టియు, ఉపమ-ఉత్ప్రేక్ష-రూపకము-దృష్టాంతము నాదిగా గల యలంకారములు గల్గినట్టియు శబ్దార్థముల సంపుటి కావ్యమని ప్రాచీనులు కావ్యలక్షణము జెప్పిరి. అట్టి కావ్యమును రచింపవలెనన్న అలంకారశాస్త్ర మభ్యసింపవలెను.

62. న్యాయశాస్త్రము జదివినయెడల ఈ పదార్థమున కిది లక్షణము — దానికిది లక్ష్యము; ఇటుల లక్షణము జెప్పిన యెడల నీ లక్షణ మింకొక వస్తువునందుగూడ గమనించిన నతివ్యాప్తి దోషమనియు, ఆజాతికి జెందిన యొక పదార్థములో లక్షణము సరిపోని యెడల నవ్యాప్తి దోషమనియు, ఒక కారణమునుబట్టి కార్యమునూహించుట యనుమితియనియు, ఆ కారణము మరియొక కార్యమునకు వర్తించునెడల వ్యభిచారమనియు నీ విధముగ విజ్ఞానము లభించును.

63. జ్యోతిషస్య ఫలం. భావికల్యాణాదిజ్ఞానలక్షణం విదితమేవ.

64. నిరుక్తస్య వేదార్థావబోధః ఫలమ్

65. శిక్షాయాస్తు స్వరదోషాదిరాహిత్యేన వేదాధ్యయనమేవ ఫలమ్. "మన్త్రో హీనస్స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ । స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుః స్వరతోఽపరాధా" దితి స్వరదోషాదేరధ్యయనగతస్య యజమానహింసకత్వాత్.

66. కల్పస్య తు యజ్ఞాదిప్రయోగపరిజ్ఞానం ఫలమ్.

---

63. జరుగ బోయెడి శుభాశుభముల గుర్తించుట జ్యోతిషమునకు ఫలము.

64. వేదార్థవిజ్ఞానము నిరుక్త శాస్త్రమునకు ఫలము.

65. శిక్షా శాస్త్రమునకు స్వర దోషాదులు లేకుండ వేదోచ్చారణ మొనర్చుట ఫలము. ఒకమంత్రమునుచ్చరించునపుడు స్వరలోపముగాని వర్ణలోపముగాని రాకూడదు. అట్టి లోపము కల్గినయెడల మంత్రార్థము మారిపోవును. తన్మూలమున నుచ్చరించినవానికికీడుగల్గును. పూర్వమొకడు ఇంద్రుని జంపగల కుమారుడుకలుగవలెనని హోమ మొనర్చుచుండెను. హోమమంత్రములో నొక్కస్వరము తప్పుగా బల్కినందున నాతడింద్రునిచేత జంపబడెనని శ్రుతిదెల్పుచున్నది.

66. కల్పము జదువుటచే యజ్ఞాదికర్మల నెట్లుజరుపవలెనో తెలియును.

67. యద్యపి వేదోక్తఏవార్థః పురాణైరుచ్యతే, తథాపి—"యద్వేదాత్ప్రభుసమ్మితాదవగతం శబ్దప్రధానాచ్చిరం, యచ్చార్థప్రవణాత్పురాణవచనాదిష్టం సుహృత్సమ్మితాత్। కాన్తాసమ్మితయా యయా సరసతామాపాద్య కావ్యశ్రియా। కర్తవ్యే కుతుకీ బుధో విరచితస్తస్యై స్పృహాం కుర్మహే" ఇతి విద్యానాథవచనాత్పురాణం సుహృదివ కర్తవ్యమర్థం బోధయతి, వేదస్తు రాజేవాజ్ఞాపయతీతి పురాణం సార్థకమేవ.

68. "న పరదారాన్ గచ్ఛే" దితి వేదోక్తమర్థం హి పరదారాభిమర్శేన రావణాసురాదయో నాశమాపురితి

---

67. పురాణములు వేదార్థమునే దెల్పుచుండ మఱల బురాణములజదువ నేమిటికనిన వేదము రాజువలె శాసించిన విషయమునే పురాణము స్నేహితునివలె బోధించును గాన నదియు జదువదగినదియే. ఈ విషయమున విద్యానాథుని వచనములు గమనింపదగినవి—

"ఏ ధర్మమును వేదము ప్రభువువలె శాసించునో, ఆధర్మమునే పురాణములు మిత్రునివలెయుక్తియుక్తముగా బోధించును. కావ్యములునైత మాధర్మమునే ప్రియురాలివలె మనుహోక్తులతో విపరించి అందుమూనవుని కాసక్తికలుగజేయును." ఎట్లన—

68. 'పరస్త్రీల జేరరాదు' అనెడి వేదవాక్యమును తీసికొని 'పరస్త్రీకాంక్షయే రావణాసురుని సమూలముగ

పురాణం బోధయతి, ఏవఞ్చ పురాణశ్రవణస్య సదృష్టాన్తం హితాహితపరిజ్ఞానం ఫలమ్.

69. ధర్మశాస్త్రస్య తు ధర్మాధర్మపరిజ్ఞానమధర్మాన్నివృత్తిః, ధర్మే ప్రవృత్తిః, ప్రామాదికస్య జన్మాన్తరీయస్య వాఽధర్మస్య ప్రాయశ్చిత్తాచరణాన్నివృత్తిరిత్యాదయో బహవోఽర్థాః.

70. ఆయుర్వేదస్య శరీరారోగ్యం ఫలమ్— 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్'. ధనుర్వేదస్య శరీరరక్షణం

---

నాశనము జేసె' నని యిట్టి యుపాఖ్యానములతో పురాణము వేదధర్మమును జక్కగా బోధించును. పురాణముల వినుటచే హితాహిత పరిజ్ఞానము దృష్టాంతసహితముగా దెలియును.

69. ధర్మశాస్త్రమువలన నిది ధర్మము ఇయ్యది యధర్మమని తెలిసి, ధర్మములో ప్రవృత్తి, అధర్మమునుండి నివృత్తియు గలుగును, మఱియు పొరబాటున జరిగిన పాపములకు జన్మాంతరములో జరిగిన పాపములకును ప్రాయశ్చిత్తమాచరించి దానిని తొలగించుకొనుటయు సంభవించును.

70. ఆయుర్వేద విజ్ఞానమునకు శరీరారోగ్యము ప్రయోజనము. పుణ్యము సంపాదించుటకు మొట్టమొదటి సాధనము శరీరముగదా! ధనుర్వేద పరిజ్ఞానమునకు ఫలము శరీరరక్షణము. సంగీతశాస్త్రము భక్తినొసంగును. అది భగవత్పరమైనచో ముక్తినొసంగును. అర్థశాస్త్రమునకు

ఫలమ్, గాన్ధర్వస్య భగవత్పరస్య భుక్తిర్ముక్తిశ్చ ఫలమ్. అర్థశాస్త్రస్య తు ధనార్జనమితి పృథగ్విద్యాఫలవివేకః.

71. కిఞ్చ గాన్ధర్వస్య స్వహృదయానన్దనం పరహృదయానన్దనఞ్చ ఫలమ్— "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ" ఇతి వచనాత్. న హి పురాణాదిశ్రవణమివ భక్తిశ్రవణం కతిపయజనానన్దకరమ్, ఏవం సర్వానన్దకరత్వాదేవ గానం భగవత్ప్రియమ్, భగవతస్సర్వాత్మకత్వాత్. అతఏవ సామగానలోలో భగవానిత్యుచ్యతే. ఏవం గాన

---

ఫలము ధనార్జనము. ఈవిధముగ నాయావిద్యలకు ఫలితముల నెఱుంగవలెను.

71. గాంధర్వమునకు మాత్ర మొక విశేషము కలదు. ఎద్దియన—అది తన హృదయమును, అన్య హృదయమును ఆనందపరచును. సంగీతమువలన నానందింపని వారుండరు. శిశువులు పశువులు పాములుగూడ గానరస మాధుర్యమును గ్రోలగలవని పెద్దలు వచించెదరు. ఇది పురాణమువలె కొందఱకు మాత్రమే ప్రియమైనది కాదు. సర్వానందకరమైనందు వనే ఇయ్యది భగవంతునకు ప్రియమైనది. భగవంతుడు సర్వాంతర్యామి కదా! ఆతనికి గానముప్రియమగుట సామ గానలోలుడని వర్ణింపబడెను. సామవేదము సంగీతమయమ గుటచే సర్వోత్తమమయ్యెను 'వేదములలో నేను సామవేదస్వరూపుడనని భగవానుడు గీతలో వెల్లడించెను

మయత్వాదేవ సామవేదస్సర్వవేదోత్తమః— వేదానాం సామవేదోఽస్మీతిభగవద్గీతావచనాత్. తస్మాత్సర్వేషు గానేషు సామగానముత్తమమ్. తరఙ్గాదిగానం తు మధ్యమమ్, త్యాగరాజాదికృతకృతిగానస్తు అధమమ్, అన్యత్త్వనరధమాధమమితి వివేకః.

72. ఏషు చ — సామగానే ద్విజ ఏవాధికరోతి. తరఙ్గగానేపి ద్విజ ఏవ, ద్విజస్త్రియశ్చేతి కేచిత్. ఇతరయోస్తు సర్వేప్యధికారిణ ఏవ.

73. గానే చ ముఖ్యం కరణం వీణా. వేణ్వాదయస్త్వముఖ్యాః.

74. అథ యాని తు కుణ్డలకరణ కాష్ఠతక్షణ భూ

---

కావున గానములలో సామగాన ముత్తమము. శ్రీకృష్ణలీలాతరంగాదులు మధ్యమము. త్యాగరాజాదికృతులు అధమము, తక్కినవి అధమాధమములు.

72. సామగానమొనర్చుటకు ద్విజుడొక్కడే యధికారి. తరంగాదులు బాడుటకును ద్విజులే యధికారులు. ద్విజస్త్రీలుగూడ బాడవచ్చునని కొందఱి యభిప్రాయము. తక్కినవి గానముసేయుట కందరూ అధికారులే.

73. గాన సాధనములలో ముఖ్యమైనది వీణ. పిల్లనగ్రోవి మున్నగునవి యముఖ్యములు.

74. ఇక సాముఁలుజేయుట - కఱ్ఱలు చెక్కుట -

విలేఖనాదీని కర్మాణి, తాని న విద్యాః, కిన్తు కలా ఏవ. తేషు చ యస్య యస్య యద్విహితం స స తత్కుర్యాత్. యథా రథకార ఏవ రథమ్, కృషీవలశ్శూద్రాదిరేవ కృషిమ్. బ్రాహ్మణస్తు దరిద్రః కృషిమన్యేన కారయేత్. "హలాస్తం బ్రహ్మవర్చస" మితి న్యాయాత్స్వయం న కుర్యాత్.

75. చణ్డాల ఏవోపానహౌ, కులాల ఏవ ఘటమిత్యాది, పాకస్తు సర్వే కుర్యుః.

76. బ్రాహ్మణస్యవాగ్బలం, క్షత్రియస్య బాహు

---

భూమిదున్నుట మున్నగుపనులు విద్యలలో జేరవు. అవి కళలలో జేరును. వానిలో నేయేవృత్తి యెవరికి విధింపబడెనో వారు దాని నవలంబింపవలెను. కంసాలియే బండ్లు చేయవలెను. శూద్రులే వ్యవసాయము చేయువలెను. బ్రాహ్మణుడు భుక్తిజరుగనప్పుడు వ్యవసాయము స్వీకరింప వచ్చును. కాని తానుచేయక అన్యులచే జేయింపవలెను. తానుస్వయముగ నాగలిపట్టి దున్నినయెడల బ్రహ్మవర్చస్సు నశించునని పెద్దలు నుడివిరి.

75. పాదరక్షలను పంచములే చేయవలెను. కుమ్మరియే కుండలు చేయువలెను. వంటమాత్రము అన్నికులముల వారు జేయవచ్చును.

76. విరాట్పురుషుని ముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు, ఊరువు (తొడల) నుండి

బలం, వైశ్యస్యోరుబలం, శూద్రస్య తు జఙ్ఘాబలమావశ్యకమ్. "బ్రాహ్మణోఽస్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృత" ఇత్యాదిశ్రుతేః. అతఏవ విద్యయా బ్రాహ్మణో వృద్ధః, క్షత్త్రియస్తు బలేన, వైశ్యో ధనేన, శూద్రస్తు వయసేత్యుచ్యతే.

77. యస్మాదేవం విద్యాప్రధానం విప్రకులం తస్మాద్వేదవేదాఙ్గాదివిద్యాఽవశ్యమధ్యేతవ్యా విప్రైః. ఏతదర్థమేవాస్యోపనయనం విహితమల్పవయస్యేవ. "గర్భాష్టమే బ్రాహ్మణముపనయీ" తేతి శ్రుతేః. ఏవముపనీతాయై తస్మై వేదోపదేష్టారమేవ విప్రమాచార్యమాహుః:—

---

వైశ్యులు, పాదములనుండి శూద్రులు జనించిరని తెలుపు శ్రుతిననుసరించి ఆయాజాతులవారి కాయా బలమావశ్యకము. అనగా—బ్రాహ్మణులకు వాగ్బలము, క్షత్త్రియులకు బాహుబలము, వైశ్యులకు ఊరుబలము, శూద్రులకు పిక్కబలము అవశ్యకమని తెలియవలెను.

77. ఇటుల బ్రాహ్మణజాతి విద్యాప్రధానమైనదిగాన వారు వేదవేదాంగాది విద్యలను తప్పక నేర్వవలెను. అందుకై యెనిమిదవయేటనే విప్రబాలకున కుపనయనము జేయవలెనని శ్రుతి తెల్పుచున్నది. ఉపనయనమైన పిమ్మట నీ బాలున కెవరు వేదవేదాంగముల నుపదేశించునో అతడే ఆచార్యుడని పిలువబడును. "ఎవరు శిష్యున కుపనయనము

"ఉపనీయ చ యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః।
సాఙ్గఞ్చ సరహస్యఞ్చ తమాచార్యం ప్రచక్షతే॥
ఇతి మనువచనాత్. ఏతేన వైష్ణవవైఖానస రథకారాదీనాం యదుపపదమాచార్య ఇతి తదవ్యుత్పన్నమేవేతి సిద్ధమ్.

78. చ శేరాజి చాను రావితి గుణా హ్యాచార్యశబ్దో భవతి వ్యుత్పన్నః. గురుశ్చ యద్యపి—
"గుశబ్దస్త్వన్ధకారే స్యాద్రుశబ్దస్తన్నిరోధకః।
అన్ధకారనిరోధిత్వాద్గురురిత్యభిధీయతే" ॥
ఇత్యధ్యాత్మ విద్యోపదేష్టైవ గురుః, తథాపి—

---

చేసి వేదవేదాంగములను రహస్యసహితముగ నుపదేశించు వాడే ఆతడాచార్యు" డని మనుస్మృతి తెల్పుచున్నది. ఇట్లుండ వైష్ణవులు వైఖానసులు విశ్వబ్రాహ్మణులు మున్నగువారు 'ఆచార్య' పదమును పేరుతో జేర్చి వాడుకొనుచుండుట నిరర్థకము.

78. ఆఙ్ పూర్వకమగు 'చర' ధాతువునుండి 'గురు' అను నర్థమందాచార్య శబ్దము పుట్టినది. 'గు' అనగా అజ్ఞానాంధకారము "రు" అనగా నివారించువాడు గురువని చెప్పబడును. ఈయర్థము వేదాంత విద్యోపదేశ మొనర్చువానికి మాత్రమే చెల్లును. ఐనను శాస్త్రమీక్రింది వారైదుగురిని గురువులుగా బరిగణించెను. 1 కన్నతండ్రి 2 ఉపనయనము చేసినవాడు, 3 విద్యనేర్పినవాడు, 4 కన్యనొసంగినమామ

"జనితా చోపనేతా చ యశ్చవిద్యోపదేశకః ।
శ్వశురశ్చాగ్రజో భ్రాతా పఞ్చైతే గురవస్స్మృతాః"

ఇతి వచనా ద్విద్యాప్రదాతా గురుః,

79. య ఏవం బ్రాహ్మణేన విధివదూఢాయాం బ్రాహ్మణ్యాముత్పన్న ఉపనీతశ్చ భూత్వా వేదవేదాఙ్గాదివిద్యా అభ్యస్య గృహస్థాశ్రమం స్వీకృత్యాస్వీకృత్య వా సన్న్యస్య శ్రవణమననాదికం కృత్వా ప్రత్యగభిన్నం బ్రహ్మ సాక్షాత్కరోతి స ఉచ్యతే బ్రాహ్మణ ఇతి—

---

5 పెద్దఅన్నగారు. వీరందఱు గురువులేయని చెప్పుటవలన సామాన్యవిద్య బోధించినవాడును గురువని గ్రహింపవలెను.

79. బ్రాహ్మణశబ్దమునకు సంపూర్ణముగ నధికారి యెవ్వడన—శాస్త్రవిధిననుసరించి వివాహమాడి బ్రాహ్మణ దంపతులకు జనించి, ఉపనయన సంస్కారము బడసి వేద వేదాంగాది విద్యల నభ్యసించి గృహస్థాశ్రమము స్వీకరించి క్రమముగగాని, ఎకాయెకి బ్రహ్మచర్యము నుండియేగాని సన్న్యాసాశ్రమము స్వీకరించి శ్రవణమననాదులొనర్చి ప్రత్యగభిన్న బ్రహ్మ సాక్షాత్కారము బడయునో—ఆతడే బ్రాహ్మణశబ్దవాచ్యుడు. బ్రాహ్మణుడగుటకు బూర్వము రెండంతస్థులను దాటవలెనని శాస్త్రము నుడువుచున్నది. ఎట్లన— బ్రాహ్మణ దంపతులకు జనించినను పుట్టుక మాత్రమున బ్రాహ్మణుడు కాజాలడు. ఉపనయన సంస్కారము జరుగు

"జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః।
వేదపాఠేన విప్రస్స్యాద్బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః" ॥
ఇతి వచనాత్.

80. అన్యే తు బ్రాహ్మణబ్రువా ఏవ, తేషా మేవ దశాహామాశౌచం విహితమ్. "నామధారకవిప్రస్య దశాహం సూతకం చరే" దితి. బ్రాహ్మణస్య తు నాశౌచం నిత్యశుద్ధ బుద్ధముక్త బ్రహ్మభూతత్వాత్తస్య. "బ్రహ్మ వి

---

వఱకు శూద్రునితో సమానుడై యుండును. బ్రాహ్మణునకు విధింపబడిన విశేష శౌచక్రియ లపుడు వర్తింపవు. ఉపనయన మగుటతో ద్విజత్వము ప్రాప్తించును. ద్వి= రెండవ, జ= జన్మము పొందును. ఉపనయనము రెండవజన్మవంటిదియని యర్థము. పిమ్మట వేదాభ్యాసముచేసిన విప్రత్వము వచ్చును. అటుపై శ్రవణమననాదులచే బ్రహ్మజ్ఞానము బడసి బ్రాహ్మణుడగునని "జన్మనాజాయతే" యను స్మృతివాక్యము తెల్పుచున్నది.

80. ఇవ్విధముగ బ్రాహ్మణత్వముపొందనివారు బ్రాహ్మణబ్రువులు అనగా నికృష్ట బ్రాహ్మణులని యర్థము. వీరికే 10 రాత్రుల యాశౌచమును శాస్త్రము విధించెను. సరియైన బ్రాహ్మణున కాశౌచమేలేదు. ఏలయన— అతడు నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వరూపమగు బ్రహ్మాత్మభావము పొంది యుండును. బ్రహ్మవేత్తయైనవాడు బ్రహ్మమే యని శ్రుతి

౮౨. కిఞ్చ యస్య సన్ధ్యావన్దనాదిక్రియాస్సన్తి తస్య సత్యాశౌచే క్రియాలోపః. తస్మిన్నివృత్తే పునః క్రియాసద్భావ ఇతి భేదో భవతి. అస్య చ బ్రాహ్మణస్య క్రియా ఏవ న సన్తి-

శ్లో॥ హృదాకాశే చిదాదిత్యస్సదా భాసతి భాసతే।
నోదేతి నాస్తమేత్యేవ కథం సన్ధ్యాముపాస్మహే

ఇతి శ్రుతేః. సర్వాణ్యపి కర్మాణి సన్న్యస్తవాన్ ఖల్వయమ్

౮౩. కిఞ్చ— "మృతా మోహమయీ మాతా జాతో
బోధమయస్సుతః। సూతకద్వయ

---

82. మఱియు నెవనికి సంధ్యావందనాది కర్మలుగలవో ఆతని కాశౌచము వచ్చినప్పు డాకర్మలు లోపించుచున్నవి. ఆ శౌచము వెళ్ళగనే మరల నాయాకర్మలు వచ్చుచున్నవి యను భేదముండును, బ్రహ్మవేత్త కిట్టిభేదము కర్మలు లేవు,

"హృదయాకాశమున జ్ఞానభానుడు సర్వకాలసర్వావస్థలయందు ప్రకాశించుచు నేయున్నాడు. ఆతనికి ఉదయాస్తమయములు లేవు. ఇక సంధ్యావందన మెట్లు చేయగలము?" అని బ్రహ్మవేత్తల యనుభవమును శ్రుతి తెల్పుచున్నది. (సూర్యోదయమునకు ప్రాక్సంధ్య — అస్తమయమునకు సాయంసంధ్య, ఈ రెండును లేకున్న సంధ్యయే లేదు.) బ్రహ్మవేత్త సర్వకర్మలను సన్న్యసించి యుండునుగదా?

83. తత్త్వవేత్తకు కర్మలులేవని శాస్త్రము మఱియొక రీతిగా తెల్పుచున్నది. "జ్ఞానరూపమగు తల్లి మరణించెను,

పాప్తే కథం సన్ధ్యాముపాస్మహే ॥
ఇతి నష్టమోహస్య జాతబోధస్య చాస్యన కర్మాధికార ఇత్యాస్తామ్.

84 ఏతావతా గ్రన్థసన్దర్భేణ విద్యయైవ బ్రాహ్మణ్యసిద్ధిరితి దర్శితమ్ ''యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణే వస'' న్తీతి శ్రుతేర్వేదవిద్బ్రాహ్మణస్సర్వదేవమయశ్చ. విద్యయైవ బ్రహ్మలోకావాప్తిశ్చ. కిమ్బహునా యత్కేవలయా కర్మసహితయా వా యయా కయాపి విద్య

---

జ్ఞానస్వరూపుడగు పుత్రుడుదయించెను. ఇట్లు మృతాశౌచ జాతాశౌచము లావరించి యుండ సంధ్యావందనము జేయు టెట్లు? అని బ్రహ్మవేత్తల వాక్యము కనబడుచున్నది. అజ్ఞానము నశించి జ్ఞానోదయమైనతత్త్వదర్శికి కర్మాధికారమే లేదు.

84. ఇంతవరకు చేసిన విమర్శనముచే బ్రాహ్మణత్వము సిద్ధించుటకు విద్యయే కారణమని నిరూపింపబడినది. ''బ్రహ్మాండగోళమున నెందఱు దేవతలు గలరో—వారందఱు వేదవేత్తయైన బ్రాహ్మణుని శరీరమున నివసించుచుందు'' రని వేదము బోధించుచున్నదిగాన వేదవిద్యగలబ్రాహ్మణుడు సర్వదేవతాస్వరూపుడు. బ్రహ్మలోకప్రాప్తియు విద్యవలననే. వేయేల? కేవలము విద్యచేగాని, కర్మసహితమగు నెద్దియేనొక విద్యచే గాని లభింపనివస్తువు లేనేలేదు. ఒకవేళయుండినచో కుందేటి కొమ్మువలె నసత్పదార్థమైయుండును. కావున మానవునకు

యా, నాధిగమ్యతే తచ్చ శశశృంగవదసదేవ. తస్మాత్సర్వేష్ట సాధనం విద్యా. సర్వానిష్టనివారణఞ్చ. పాపినాం నరకాది ప్రాప్తిం శాస్త్రాద్గురూపదేశాద్వా విదిత్వా హి లోకః పాపాన్నివర్తతే. కృతఞ్చ పాపం ప్రాయశ్చిత్తేన నాశయతి. తస్మాద్యథాధికారం సర్వైరభ్యసనీయైవ విద్యేతి సఙ్క్షేపః.

ఇతి బెల్లంకొండోప నామక
రామకవికృతః విద్యార్థవిద్యోతః
శ్రీ హయగ్రీవార్పణమస్తు.
(పరీధావి చైత్ర శు ౬)

---

సకలాభీష్టముల నెరవేర్చునది విద్య. సర్వానిష్టముల నెడబాపునదియు విద్యయే. పాపమొనర్చిన నరకము సంభవించునని శాస్త్రమువలనగాని గురువువలనగాని తెలిసికొని కదా పాపమునుండితొలగుట. చేసినపాపమునుగూడ ప్రాయశ్చిత్తము చేసి తొలగించుకొనవచ్చును. ఇదియంతయు విద్యయుండినపుడే సాధ్యమగును. కావున తమ తమ యధికారమునకు తగినట్లందఱును విద్య నభ్యసింపవలెను.

ఇది శ్రీ బెల్లంకొండ రామకవి ప్రణీతమైన
విద్యార్థవిద్యోతము శ్రీ హయగ్రీవార్పణము.

ఆంధ్రీకర్త:- ధర్మపురి శేషగిరిశర్మ.
సంస్కృతపండితుడు
12_10_1951
మునిసిపల్ హైస్కూలు—నరసరావుపేట

శ్రీ హయగ్రీవాయనమః

# కలి భాషణమ్

1. భువి కృతత్రేతాద్వాపరికలినామకం యుగచతుష్టయమస్తి. తత్రకృతే ధర్మవృషభశ్చతుష్పాత్, త్రేతాయాం త్రిపాత్, ద్వాపరే ద్విపాత్, కలావేకపాత్. త్రేతాయామవశిష్ట ఏకః పాదః, ద్వాపరే పాదద్వయం, కలౌ పాదత్రయం చాధర్మేణ పూర్యతే. స చ కలౌ ధర్మస్యైకః

---

శ్రీ హయగ్రీవాయనమః

# కలి భాషణము

1. భూలోకమున కృతయుగము త్రేతాయుగము ద్వాపరయుగము కలియుగము అని నాలుగు యుగములున్నవి. ధర్మమనెడి వృషభము కృతయుగమున నాల్గుపాదములుగలిగి యుండును. త్రేతాయుగమున మూడుపాదములతోనుండును. ద్వాపరమున రెండుపాదములు, కలియుగమున నొక్కపాదము మాత్రమే యుండును. త్రేతాయుగమున మిగిలిన యొక

పాదో భవిష్యత్కాలే నఙ్క్ష్యతి. అధర్మశ్చ చతుష్పాత్పుష్టో భవిష్యతి, అతఏవాధర్మమయః కలిః, కలే రధర్మమయత్వఞ్చ ప్రకృతజనగతాధర్మైరవగమ్యతే. తే చాధర్మాః సఙ్గ్రహేణ కథ్యన్తే. విస్తరేణ దుర్వచత్వాత్తేషామ్.

2. తథాహి—ద్విజా యుక్తకాలే జాతకర్మాదిసంస్కారహీనాః అయుక్తకాలే కృతోపనయనా అపి సంధ్యావందనవివర్జితాః వేదాధ్యయనరహితాః కథఞ్చిదధీతవేదా అపి తదర్థావబోధవిధురాః వేదవిక్రయిణః స్వదారపరిత్యాగినః

---

పాదము ద్వాపరమున రెండుపాదములు, కలియందు మూడు పాదములును అధర్మముచే పూరింపబడును. కలియందు ధర్మమునకున్న ఒక్కపాదముకూడ కొంతకాలమునకు నశింపనున్నది. అపు డధర్మము నాల్గుపాదములతో దృఢముగా నిలచును. కావున కలికాల మధర్మమయమై యున్నది. ఆ యధర్మము ప్రకృతకాలమున ప్రజలొనర్చు నధర్మములను బట్టి తెలియఁదగియున్నది. ఆ యధర్మములను విపులముగ జెప్పుట యసాధ్యముగాన సంగ్రహముగా దెల్పుచున్నాను.

2. అవి యెవ్వియన—వినుడు: ద్విజులు యుక్తవయసున జాతకర్మాది సంస్కారముల జేయరు. వయసు మీరిన పిదప ఉపనయనము జేసికొన్నను సంధ్యావందనము జేయరు. వేదాధ్యయన మొనర్పరు. ఒకవేళ నెటులనో వేదాధ్యయనము జేసినను దానియర్థము తెలిసికొనరు. డబ్బు తీసికొని

పరదారరతాః దివాస్వాపా దివామైథునాః కన్యావిక్రయిణః మాతాపిత్రోరపోషకాః పిత్రా విభక్తాః మాతాపితృగురు దేవద్విజదూషణ తత్పరాః అన్నవిక్రయిణః యేన కేనాప్యుపాయేన ధనార్జనతత్పరాః.

౩. వేశ్యాలమ్పటాఃఅగమ్యాగామినః అభక్ష్యభక్షిణః మద్యపాయినఃమదకరవస్తుసేవినః అవిహితనియతకర్మాణః కృషీవలాఃవణిజః గోమహిష్యాదివిక్రయిణః శిష్యవిత్తాపహారిణః శూద్రాన్నభోజినః క్రీతాన్నభోజినః సంఘాన్నభోజినః ఊఢవిధవాః రజస్వలావివాహకారిణః సూర్యోదయే సూర్యాస్త

---

వేదము జెప్పుదురు. తమభార్యలవిడనాడి అన్యకాంతల ప్రేమించుచుందురు. పగటినిద్ర దివాసంభోగము జేయుచుందురు. కన్యలను విక్రయింతురు. తలిదండ్రులను బోషింపరు. తండ్రితో విభాగమొనర్చుకొని యుందురు. తలిదండ్రులను గురువులను దేవతలను బ్రాహ్మణులను దూషించుటయందాసక్తులై యుందురు. అన్నము విక్రయింతురు. ఏ యుపాయముచేతనైనను ధనార్జనముచేయ సమకట్టుదురు.

౩. వేశ్యాలంపటులు—కూడరానిస్త్రీల గూడువారు తినగూడనివి తినువారు మద్యపానము సేయువారు మత్తుపదార్థముల సేవించువారు శాస్త్రమువిధింపని పనులను నియమముగా జేయువారు సేద్యము జేయువారు వ్యాపారము జేయువారు గోవులను గేదెలను కొని యమ్మువారు శిష్యుల

మయే చ స్వపన్తః లిఙ్గినః చక్రిణః వీతశిఖాః క్రీతయజ్ఞోపవీతధారిణః వృథాకలహకారిణః కవితావిక్రయిణః అవర్ణ్యవర్ణినః శూన్యలలాటాః రజకవస్త్రధారిణః మ్లేచ్ఛహూణసంపర్కిణః,

4. అకృతశౌచాః ఉష్ణోదకస్నాయినః అహ్ని ద్విర్భోజినః ఏకాదశ్యాం జయన్త్యాశ్చాన్నభోజినః శ్రాద్ధదివసేఽపి

---

న మపహరించువారు శూద్రుల యన్నము దినువారు విక్రయాన్నము భుజించువారు సంఘుభోజనము జేయువారు వితంతువుల పెండ్లాడువారు కుమార్తెలు రజస్వలలైనపిదపవివాహము జేయువారు సూర్యోదయకాలమున సూర్యాస్తమయ కాలమునను నిద్రబోవువారు లింగమును సన్న్యాస చిహ్నములను ధరించువారు తప్తచక్రాంకితులు జుట్టుముడి లేనివారు అంగడిలో కొనిన జందెము ధరించువారు వ్యర్థముగా గలహించువారు కవిత్వమును విక్రయించువారు వర్ణింపగూడని వర్ణించువారు తిలకము ధరింపనివారు చాకలిబట్టలగట్టుకొనువారు మ్లేచ్ఛులతోడను బాశ్చాత్యులతోడను స్నేహము జేయువారు.

4. మలమూత్ర విసర్జనాదులు జేసినపుడు సరియగు శౌచము జేయనివారు ఉష్ణోదకముతో స్నానము జేయునివారు పగటియందు రెండుమార్లుభుజించువారు ఏకాదశి జయన్తిమున్నగు దినములలో భోజనము సేయువారు శ్రాద్ధము పెట్టినదిన

వేశ్యాసక్తినః ధూమపాయినః అనధీతగీర్వాణభాషాః అధీత హూణమ్లేచ్ఛాదిభాషాః సముద్రయాయినః దేవబ్రాహ్మణ గోధనాపహారాః శ్వవృత్త్యుపజీవినః ద్యూతకారిణః మత్కు ణాదిప్రాణిహింసాకారిణః గాయకాః నటాః భిషజః శస్త్ర వృత్త్యుపజీవినః దేవలకాః స్వామిద్రోహిణః ఉదూఢక్రీత కన్యాః అనృతవాదినః.

5. దంభార్థమల్పధనేనాయథావిధికృతయజ్ఞాః యజ్ఞాద్య ర్థమార్జితేన ధనేన కుటుంబపోషిణః అయోగ్యాదగ్రాహ్యస్య

---

మునగూడ వేశ్యతో గూడువారు పొగత్రాగువారు సంస్కృ తము జదువని వారు ఆంగ్లమ్లేచ్ఛ భాషల నభ్యసించువారు సముద్రముపై బయనముచేయువారు దేవతలయొక్కయు బ్రాహ్మణులయొక్కయు గోవులయొక్కయు ధనము నపహ రించువారు సేవకవృత్తితో జీవించువారు జూదమాడువారు నల్లులు మొదలైన ప్రాణులను జంపువారు గాయకులు నటు లు వైద్యులు ఆయుధ వృత్తితో జీవించువారు పూజారులు యజమానిని మోసము జేయువారు ఒకసారి వివాహమైన కన్యను గొనువారు అనృతము జెప్పువారు

5. కొద్దిధనముతో నాడంబరమునకై శాస్త్రము నుతప్పి యజ్ఞము లాచరించువారు యజ్ఞము పేరుతో ధనమా ర్జించి కుటుంబపోషణ మొనర్చువారు అయోగ్యుని వద్దనుం డి స్వీకరింపరానిదిగూడ స్వీకరించువారు శూద్రులు చాకలి

పి గ్రాహిణః శూద్రరజక నాపితాదీనామపి పౌరోహిత్యకారిణః రథకారాణామపి బ్రహ్మోపదేశకారిణః తీర్థధ్వాజ్ఞాః దురాచారాశ్చ భవన్తి.

6. స్త్రియస్తు ఉపనిషదధ్యయనకారిణ్యః అశుశ్రూషితపతయః సాలగ్రామార్చనాపరాః వేదవాదిన్యః జారిణ్యః శౌర్యరతాః హింసితగర్భాః స్వసఙ్గతపురుషప్రాణాదిహార ప్రచురరోగాః అతికామాః సన్మార్గగామినమపి యువానం బలాదసన్మార్గే ప్రవేశయన్త్యః పతివ్రతాయా అప్యపవాదం జనయన్త్యః నటవిటగాయకానుయాయిన్యః బాలఘ్న్యః పతి

---

నుంగలి మున్నగు వారికి పౌరోహిత్యముజేయువారు రథకారులకుగూడ బ్రహ్మోపదేశము జేయువారు క్షేత్రములలో నీటికాసులు గొనువారు ఇవ్విధముగ నానావిధములగు దురాచారముల జేయుపురుషులుందురు.

6. ఇక స్త్రీలన్ననో—ఉపనిషత్తుల జదువుట పతిసేవ మానుట సాలగ్రామముల నర్చించుట వేదముపల్కుట వ్యభిచరించుట కౌంగిలించుట గర్భస్రావమొనర్చుట తమ్ముజేరినపురుషుల జంపెడి రోగములు గల్గియుండుట మితిమీరి కామించుట సద్వర్తనము గలవానిని గూడ బలవంతముగ దుష్ప్రవర్తన లోనికి దింపుట పతివ్రతలపై నిందలమోపుట నటవిటగాయకులను వెంబడించుటశిశువులజంపుట పతులజంపుట

ఘ్న్యః కన్యాదూషిణ్యః స్వైరిణ్యః నిర్లజ్జాశ్చ భవన్తి.

7. ద్విజేతరాశ్చ అకృతద్విజశుశ్రూషాః శిఖాయజ్ఞోపవీతధారిత్వేన ద్విజవదవభాసమానాః వేదాధ్యయనాదికరాః స్నానసంధ్యాదితత్పరాః కుణ్డలాలఙ్కృతాః బ్రాహ్మణతిరస్కారిణః శ్రౌతస్మార్తకర్మకారిణః ద్విజాచారాశ్చ భవన్తి.

8. ఏవమధర్మమయత్వాదేవ కలియుగే జనాః ప్రాయేణాల్పాయుషః వ్యాధిగ్రస్తా మన్దబుద్ధయశ్శక్తిహీనా అలసా దరిద్రా బహులదుఃఖా అత్యల్పసుఖా మిత్రాపత్యకలత్రవియు

---

కన్యలను భ్రష్టురాండ్రజేయుట మున్నగు దుర్గుణములు గల్గి సిగ్గువీడి స్వేచ్ఛగా సంచరించుచుందురు.

7. ఇక ద్విజేతరులు (శూద్రులు) ద్విజశుశ్రూష విరమించి శిఖాయజ్ఞోపవీతముల ధరించి బ్రాహ్మణులవలె గనుపించుచు వేదాధ్యయనము చేయుచు స్నానసంధ్యావందనములందాసక్తులై కుండలములధరించి బ్రాహ్మణుల దెగనాడుచు శ్రౌతస్మార్తకర్మల నాచరించుచు ద్విజాచారముల నవలంబించి యుందురు.

8. ఇటుల కలికాల మధర్మ మయమగుట సామాన్యముగ ప్రజ లల్పాయుష్యముగలవారు రోగపీడితులు మందమతులు శక్తిహీనులు సోమరులు దరిద్రులు బహుదుఃఖము నల్పసుఖముగలవారు భార్యను సంతానమును మిత్రులను

న్తే అనాథాశ్చభవన్తి.

9. ఏవం పాపీయాంస ఏతే బహ్వీర్నారకీర్యాతనా అనుభూయజాయన్తే మ్రియన్తే చ క్రిమికీటక పశు పక్షితరుల తాదిరూపేణేత్యహో కలిదౌరాత్మ్యమ్!

10. కలినా హి జీవానాం బుద్ధయః కామక్రోధాదిభిఃపరిభావితాః అయం హి కలిః స్త్రీయోద్యూతం పానం హింసాం సువర్ణంచాధిష్ఠిత్య స్థితస్సన్ ప్రమోదతే. న హి స్త్ర్యాదివశమగతః పురుషశ్రేయః కశ్చిదప్యుపలభ్యతే. అతఏవ 'వేధా ద్వేధా భ్రమం చక్రే కాన్తాసు కనకేషు చ, తాసు తేష్వప్యనాసక్త

---

కోల్పోయినవారు అనాథులునై యుందురు.

9. ఇటుల పాపవర్తనులైనవీరు నరకమునబడి నానాయాతనలబడి పుట్టుచు జచ్చుచు క్రిమికీట పశుపక్షిరూపములను తరులతాది రూపములను ధరించుచుందురు. ఆహా! ఏమి యీ కలికాల దుష్టత్వము!

10. కలిపురుషుడు మానవుల బుద్ధులను కామక్రోధాదులను వశపఱచును. స్త్రీలు జూదము మద్యము మాంసము కనము ననెడి ఐదుస్థానముల నధిష్ఠించి కలిపురుషుడు సంతసించుచుండును. కాంతాది పరవశుడుగాని పురుషపుంగవు డీకాలముల గానబడడుగదా! కావుననే ఒకమహాకవి యిటుల వ్రాసెను. "కాంతలయందును కనకమునందును చిక్కుకొనులాగు బ్రహ్మదేవుడు రెండువిధములైన మోహముల సృజిం

స్నాత్వాద్భిర్నో నరాకృతిరితి' స్మర్యతే.

11. అస్య చ కలేర్నివృత్తిర్బహోః కాలాదనన్తరం భవిష్యతి; తస్మాదస్మాకం కా గతిరితి శోచతః ప్రతీదం కలిభూషణం' మయూలిఖ్యతే.

12. యద్యప్యేవం దుష్టస్తథాప్యతీవ శిష్ట ఏవాయం కలిః. తథా హి- యుగాన్తరేషు నరమేధః గోమేధః అశ్వమేధః అతిథేరాగమనే గోవిశసనం పశువిశసనం మాంసేన శ్రాద్ధవిధానం జ్యేష్ఠే మృతే సతి తద్భార్యాయాం పుత్రోత్పాదనం విప్రస్య క్షత్రియభార్యాయాం పుత్రోత్పాదనం ద్విజస్య శూద్రకన్యోపయమః.

---

చెను. ఈ రెంటియందును చిక్కనివాడు మనుష్యరూపముధరించిన యీశ్వరుడే."

11. ఇట్టికలియుగ మెంతయో కాలము గడచినగాని నశింపదు. ఇక మనకు గతియెద్ది? యని దుఃఖించువారిని గూర్చి యీ'కలిభూషణము'ను నేనువ్రాయుచున్నాను

13. పై దెల్పినరీతి కలియుగమెంతచెడ్డదిగా గన్పించినను మిక్కిలి మంచిదనియే తోచుచున్నది. ఎట్లన

—: పూర్వయుగ ధర్మములు :—

ఇతరయుగములలో (నరమేధము) మనుష్యుని గోవును అశ్వమును హూమమొనర్చు యజ్ఞములు. అతిథి వచ్చిన

13. రజస్స్వలోపయమః ఊఢాయాః పునరుద్వాహః సముద్రయాతుః స్వీకారః వరార్థం మధుపర్కే పశువిశసనమ్ మద్యపానం దాసగోపాలాద్యన్నభోజనం ద్విజస్య యతేస్సర్వవర్ణేషు భిక్షాటనం బలాత్కారాదినా దుష్టస్త్రీసఙ్గ్రహః భృగ్వగ్నిపతనైశ్చైవ వృద్ధాది మరణం చేత్యాదయో ధర్మాస్సన్తి. కలౌ తు నిషిద్ధాస్తే. స్పష్టశ్చాయమర్థో నిర్ణయసింధౌ.

---

వృషు గోవును పశువును వధించి గౌరవించుట. మాంసముతో శ్రాద్ధము పెట్టుట. అన్నగారు సంతానహీనుడై చనిపోయినమొదల అతని భార్యయందు పుత్రుని బుట్టించుట బ్రాహ్మణుడు, క్షత్రియ స్త్రీయందు పుత్రుని కలిగించుట బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు శూద్రకన్యను వివాహమాడుట.

13. రజస్స్వలావివాహము పెండ్లియైన స్త్రీకి మఱల పెండ్లిసేయుట సముద్రముపై పయనించినవానిని కలుపుకొనుట మధుపర్కమునకై పశువును జంపుట మద్యము ద్రావుట దాసులు గోపాలులు మున్నగు శూద్రుల యన్నము ద్విజులు భుజించుట యతు లన్నిజాతులకడ భిక్షగైకొనుట బలాత్కారాదులచే జెడిపోయిన స్త్రీలను స్వీకరించుట పర్వత శిఖరమునుంచి పడియో అగ్నియందు దుమికియో వృద్ధాదులు మరణించుట మున్నగునవి ధర్మములైయుండెను. కలియుగమున నవియన్నియు నిషేధింప బడినవి. ఈ విషయము నిర్ణయసింధువులో స్ఫుటముగ వ్రాయబడియున్నది.

14. న చ నిషిద్ధమపి విధవోద్వాహాదికం కలావధునా వర్తత ఏవేతి వాచ్యమ్! క్వాచిత్కత్వాత్తస్య శిష్టైరపరి గృహీతత్వాచ్చ. ఏవం గవాశ్వ మనుష్య పశ్వాది ప్రాణిహింసనం మాంసభక్షణం మద్యపానం విధవోద్వాహనమగమ్యాగమనం శూద్రస్త్ర్యుద్వాహనం శూద్రాన్న భోజనం బలాత్కారమరణమిత్యాద్యధర్మరాహిత్యాచ్ఛిష్ట ఏ వాయం కలియుగః.

15 న చ విధవోద్వాహః స్త్రీణాం వేదాధ్యయనం సముద్రయాతుః స్వీకారశ్చేత్యేతత్త్రయం యుగాన్తరీయం

---

14 ప్ర:— విధవావివాహము కలియందు నిషేధింపబడినను చేయుచునే యున్నారుకదా!

ఉ:— ఎచ్చటనో యొకటి జరుగుచున్నది. శిష్టులు దాని నంగీకరించుటయులేదు. మఱియు గోవులు అశ్వములు మనుజులు మేకలు మున్నగు ప్రాణులను హింసించుట మాంసము భక్షించుట మద్యము సేవించుట కూడరాని యువతుల బొందుట శూద్రస్త్రీలను పెండ్లాడుట శూద్రాన్నము భుజించుట బలాత్కారముగ మరణించుట మున్నగు నధర్మములు లేనందున కలియుగము శిష్టాచార సంపన్నమై యున్నది

15. ప్ర:— విధవావివాహము స్త్రీలు వేదముజదువుట సముద్రయానము జేసినవానిని స్వీకరించుట ఈమూడు విషయ

ధర్మ ఏవేత్యధునాపి కర్తవ్యమేవేతి వాచ్యమ్. యుగాన్తరేషు తస్య ధర్మత్వమస్తు వా మా వా. అధునా తు తదధర్మ ఏవేత్యధ్యవసీయతే. తథా హి—కోఽత్ర విధవాయా దాతా వరాయ? న చ పిత్రైవేతి వాచ్యమ్, తస్య విధవాయాం స్వామిత్వాభావాత్. ప్రథమాయ హి వరాయ పితుస్స్వకన్యావిషయం స్వామిత్వం దత్తం. న హి కస్మైచిత్కేనచిద్దత్తా గౌరన్యస్మై తేనైవ పునర్దాతుం శక్యతే నాపి భర్త్రేతి వాచ్యమ్! తస్య మృతత్వాత్. మృతేః ప్రాగేవ భర్త్రా న హి భార్యా కస్మైచిద్దీయతే, దాతుమిష్యతే శక్యతే వా, నాపి స్వయమేవ సా యఙ్కఞ్చన శ్రయతేతి

---

ములు ఇతర యుగములలో ధర్మములుగాన నిపుడుగూడ ధర్మములుగా నాచరించిన నేమి?

ఉ:- పూర్వయుగములలో నవి ధర్మమా కాదా యనునది యటుండనిమ్ము. ఇప్పుడు మాత్రమధర్మమే యనుట నిశ్చయము. ఎట్లందురా? విధవా వివాహమునుగూర్చి చర్చింతము. విధవరాలైన స్త్రీని వరునకిచ్చు వారెవరు? తండ్రియే యిచ్చునందుమా అతనికి ఆమెయందు హక్కు లేదు ఏలయన తనకు పుత్రికపైనున్న హక్కును ఆమె మొదటి వివాహమున వరునకిచ్చియుండెను. ఒకడు తనయావు నొకనికి దానముచేసి తిరిగిదానినే మరియొకనికి దానముచేయ వీలుండదుగదా! అటులకాదు భర్తయే మరియొకనికిచ్చెనందుమా

వాచ్యమపుత్రాయాస్తస్యా భర్తృశ్రాద్ధాది పరిత్యాగాయోగాత్. సపుత్రాయాం పుత్రత్యాగాయోగాచ్చ. అక్షత యోన్యా ఏవ విధవాయా ఉద్వాహో యుగాన్తరేపి విహితో న తు క్షతయోన్యా ఇతి సపుత్రాయా విధవాయాః పునరుద్వాహాయోగాచ్చ.

16. న చ భర్తృశ్రాద్ధాదికమపరిత్యజ్యైన విధవా కశ్చన శ్రయేతేతి వాచ్యమ్. విధవాయాః కేశబన్ధో భర్తృబంధాయ జాయత ఇతి కేశబన్ధ విహీనాయా భర్తృశ్రా

---

అతడు చనిపోయినగదా విధవరాలగుట ప్రకృతియుండగా నెవ్వడును తనభార్య నొరులకీయడు, ఈయగోరడు, ఈయజాలడును. పోనిండు ఆమె స్వయముగనే మఱియొకపతి నాశ్రయించెనందుమా అదియుక్తము కాదు. ఆమెకు పుత్రులు లేనిచో పతిశ్రాద్ధము తాను పెట్టవలసి యుండును. దానిని విడచుటకు వీలులేదుగదా! పుత్రులుండు రేని వారిని విడచిపోవుటయు యుక్తముకాదు. పూర్వయుగములందైన ను గర్భాధానముకానట్టి వితంతువుల వివాహమంగీకరింప బడినదేకాని గర్భాధానమైన విధవకు పునర్వివాహము లేదు. పుత్రవతియైన విధవకే పరిస్థితియుండును వివాహము చెల్లదు.

16. పతిశ్రాద్ధము విడువకయే మఱియొకనిని స్వీకరించు నందురేమో. విధవరాలికి కేశఖండనము కూడ విధింపబడి యున్నది. కేశఖండనము గావించుకొని భర్తృశ్రాద్ధము పెట్టుచున్న విధవరాలు సుమంగలి యెట్లగును? పతిశ్రాద్ధము

ధకారిణ్యాశ్చ తస్యాస్సువాసినీత్వాయోగాత్. న చైవం భర్తృశ్రాద్ధాదికం త్యక్త్వైవాన్యం శ్రయత ఇతి వాచ్యమ్. భర్తృభార్యే పరస్పరమితి శాస్త్రమతిక్రమ్య శ్రాద్ధ త్యాగిన్యాస్తస్యాః మృతాహే సమతిక్రాన్తే చణ్డాలః కోటిజన్మసు ఇతి పతితత్వాపత్తేః.

17. కిఞ్చ ఊఢాన్యపురుషాన్తరా – మృతభర్తృకా చేయం నారీ కిం విధవా? ఉత సధవా? నాద్యః పక్షః ధవసహితాయా విధవాత్వాయోగాత్. నాన్త్యః, మృతధవాయా సధవాత్వాయోగాచ్చ, అపి చ సగోత్రకన్యావివాహస్తావదయుక్తః. భారద్వాజసగోత్రోద్భవా కౌణ్డిన్యగోత్రోద్భవేనాదావూఢా చేయం విధవా కిం భారద్వాజసగోత్రో

---

విడిచియే మఱొకనిని చేపట్టునందురా – శాస్త్రము విధించిన సతీపతి ధర్మముల నుల్లంఘించి శ్రాద్ధములేక మృతదినము దాటినచో ఆమెకు కోటి జన్మములవరకు చండాలత్వము ప్రాప్తించునని శాస్త్రము వచించుచున్నదిగాన పతితురాలగును.

17. మఱియు ఒకపతి మరణించి మఱియొకనిని చేపట్టిన యామె విధవయా? సుమంగలియా? పతియున్నాడుగాన విధవకాదు. పతి చనిపోయినందున సుమంగలి యనుటకును వీలులేదు. మఱియు వివాహము జేసుకొనువానికి సగోత్ర కన్యావివాహము యుక్తముకాదు. ఒక కన్య భారద్వాజ సగోత్రమందుద్భవించి కౌండిన్య గోత్రికుని తొలుత వివాహమా

ద్భవస్య సగోత్రా? యద్వా కౌణ్డిన్య గోత్రోద్భవస్య? నాద్యః పక్షః, పితృగోత్రం త్యక్త్వా భర్తృగోత్రం ప్రవిష్టత్వాదస్యాః. నాన్త్యః, కౌణ్డిన్యగోత్రేఽస్యా అనుద్భవాత్. అథ యద్యేనామన్యః కాశ్యపసగోత్ర ఉద్వహతి తర్హి పుత్రోఽస్యాః పితృతః కాశ్యపసగోత్రః, మాతామహతో భారద్వాజసగోత్రః, మాతుః ప్రథమభర్తృతః కౌణ్డిన్యసగోత్రశ్చ భవతి. న చేష్టాపత్తిః, పితృపుత్రయోః మాతృప్రథమభర్తురస్య చ విగోత్రత్వాయోగాత్.

18. అథైతద్దోషపరిహారాయ యది భర్తృమరణా

---

జేసికొనుడు. పతి మరణించెను. అప్పుడామె భారద్వాజ గోత్రికురాలా? కౌండిన్య గోత్రికురాలా? తండ్రి గోత్రము విడచి పతిగోత్రమున ప్రవేశించినందున భారద్వాజ గోత్రికురాలు కాదు. కౌండిన్య గోత్రమున జన్మింపలేదు గాన కౌండిన్యగోత్రికురాలునుకాదు. ఇక నీమెను కాశ్యపస గోత్రికుడైన మఱియొకడు వివాహముజేసికొనెననుకొందము. అతని పుత్రునకు గోత్రమెద్ది? తండ్రివలన కాశ్యప గోత్రము. మాతామహునివలన భారద్వాజ గోత్రము, తల్లియొక్క మొదటి భర్తవలన కౌండిన్య గోత్రమున్ను సంక్రమించును. ఇది ఇష్టము కాదు. తండ్రి కొడుకులకు-తల్లియొక్క మొదటి మగనికి [illegible] వేర్వేరు గోత్రము లుండుట కద్దు [illegible].

18. ఈ దోషము తొలగుటకై పతి మరణానంతరమే

నన్తరం విధవాయా భర్తృగోత్రనివృత్తిరిత్యుచ్యతే తర్హి ప్రథమవివాహాత్పితృగోత్రాన్నివృత్తా భర్తృగోత్రాన్నివృత్తా చేయం విధవా గోత్రశూన్యైవేత్యనుద్వాహ్యైవ. నాపి భర్తృమరణాద్భర్తృగోత్ర నివృత్తి రితి వక్తుంశక్యతే. అశాస్త్రీయత్వాత్తద్వచనస్య.

19. నను విధవా యేన దయాళునా పుత్రీత్వేన స్వీక్రియతే తస్య గోత్రం భజత ఇతి చేన్నైవమ్. అనూఢాయాః కన్యాయా ఏవ స్వీకార్యత్వం న తు విధవాయాః. న హి కస్మైచిద్దత్తాం నారీం పునరన్యస్మై దాతుం కోపి స్వీకు

---

అతనితోబాటు ఆతని గోత్ర సంబంధముకూడా నశించునని చెప్పెదమా? అటులైన మొదటి వివాహమున తండ్రి గోత్రముపోయి, పతి మరణింపగనే ఆతని గోత్రమునుగూడా కోల్పోయిన విధవరాలు గోత్ర శూన్యయగును. గోత్రములేని కన్య వివాహ యోగ్యురాలు కాదు. అదియుగాక పతితోబాటు గోత్రము నశించునని యెవరుచెప్పిరి? అదిశాస్త్రీయముకాదు.

19. ఎవరైన దయామయుడు విధవరాలినిజూచి జాలిపడి తనకు పుత్రికగా స్వీకరించిన నతని గోత్రమామెకు సంక్రమింపవచ్చు నందురా! అదియుజెల్లదు. పెండ్లికాని కన్య నెప్పుడు తీసుకొనదగును కాని విధవరాలిని పెంచుకొనుట ధర్మముకాదు. ఒకనికిచ్చిన కన్యను మఱియొకని కిచ్చుటకై యెవరును స్వీకరింపరుగదా! మఱియు విధవరాలిని దానముచేయు

ర్యాత్. కిఞ్చ విధవాయా దాతురభావాదేవ ప్రతిగ్రహీతు శ్చాప్యభావః,

20. న చ విధవా స్వయమేవ కఞ్చిత్పితృత్వేనాశ్రయత ఇతి వాచ్యమ్. పితృభర్తృ వంశద్వయపరిత్యాగస్య వంశాన్తరస్వీకారస్య చాయుక్తత్వాత్. ఏవముభయతో భ్రష్టాయా స్తస్యా అకులీనత్వేన దుష్టత్వాచ్చ ఇతి. నను కిమాభిరనుపపత్తిభిః యథా పురుషః తథా నార్యపియథేచ్ఛం విహరతామితి చేన్నైవమ్. పురుషస్య భార్యామృతౌ

---

వారెవ్వరును లేనందున స్వీకరించువాడును లేడని తేలుచున్నది.

20. ప్ర:— వితంతువు స్వయముగనే ఒకని తండ్రిగా స్వీకరింపగూడదా?

ఉ:— తండ్రివంశమును పతివంశమును వదలుకొని వేరొక వంశమున ప్రవేశించుట యుక్తముకాదు. ఇట్లు రెండువంశములనుండి భ్రష్టురాలైన యీమె వంశవిహీనయై దుష్టురాలగును.

ప్ర:— ఈ దోషములతో బనియేమి? పురుషునివలె స్త్రీయును స్వేచ్ఛగా నేల విహరింపరాదు?

ఉ:—అటుల పోల్చుటకు వీలులేదు. పురుషునకు భార్య మరణించిన మఱియొక కన్యను వివాహమాడుటలో పైజెప్పిన దోషము లెవ్వియు పొసగవు. వితంతువు మఱియొకని జే

భార్యాన్తరస్వీకారే న దర్శితా అనుపపత్తయస్సంభవన్తి. విధవాయాస్తు భర్త్రన్తరస్వీకారే సంభవన్తీతి మహాన్ద్వైషమ్యముభయోః.

21. కిఞ్చ యది స్త్రీపురుషయోస్సామ్యం తర్హి సధవాపి సత్యేకస్మిన్ భర్తరి భర్త్రన్తరం స్వీకుర్యాదేవ. పురుషో హి సత్యాం భార్యాయాం భార్యాన్తరం స్వీకరోతి. తత్ర వన్ధ్యాత్వాదిదోషదర్శనాత్. నను నిష్పక్షపాతత్వాదీశ్వరః స్త్రీపురుషయోరుభయోరపి సమమేవవిధిం విహితవాన్. స ఏవ పరాశరేణాప్యుక్తః "నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ పఞ్చస్వాపత్సు నారీణాం పతిరన్యో

---

పట్టవలెనన్న నాదోషములన్నియు నావరించును గాన స్త్రీపురుషులలో జాల తారతమ్యము కలదు.

21. మఱియు స్త్రీపురుషులు సమానమందురేని స్త్రీలు భర్తయుండగ మఱియొకని బెండ్లాడవచ్చును, పురుషులు సంతానము లేకుండుట మున్నగు దోషములవలన భార్యయుండగ మఱియొక స్త్రీని పెండ్లాడుట లోకవిదితము.

ప్ర:— ఈశ్వరుడు నిష్పక్షపాతముగ స్త్రీ పురుషులకు సమానముగనే ధర్మము విధించెను. పరాశరుడా ధర్మమునే యీక్రింది విధముగ వ్రాసెను. ఏమన—భర్త కనబడకుండుట—మరణించుట సన్న్యసించుట నపుంసకుడగుట జాతిభ్రష్టుడగుట అనునైదువిధములగు నాపదలు వచ్చినపుడు స్త్రీలు మరియొ

విధీయతే’’ ఇతి. కలౌ పారాశరస్మృతిర్హి పరం ప్రమాణమ్. తస్మాత్పురుషః స్త్ర్యన్తరమివ స్త్రీ పురుషాన్తరం వివహే దేవేతి చే న్నైవమ్. యదీశ్వరో నిష్పక్షపాతస్తర్హి కిమితి విషమా సృష్టిస్తేన క్రియతే? పశ్వాదయో మూకాః కృతాః, పక్షిణః, ఖేచరాః, కృతాః, మనుష్యావాచాలాః కృతాః, సర్పాదయస్సవిషాః కృతాః, జలం శీతలం కృతమగ్ని రుష్ణః కృతః. స్త్రీణామేవ గర్భధారణ ప్రసవ వేదనాదికం విహితమ్, న తు పురుషాణాం. “మహిష్యాం ప్రసవార్తాయాం మహిషో మదనాతుర’’ ఇతి వచనాత్.

---

కనిని వివాహామాడవచ్చునని పారాశరస్మృతి తెల్పుచున్నది. కలియుగమున నిదియే గదా ప్రమాణము! కావున పురుషుడు మఱియొక స్త్రీని పెండ్లాడినట్లు స్త్రీ మఱియొక పురుషుని పెండ్లాడుట కేమి?

ఉ:— ఓయీ! అటులకాదు. ఈశ్వరుడు పక్షపాతికాని చో సృష్టిలో హెచ్చుతగ్గులెట్లుండును? మృగాదులు మూగవి. పక్షులాకసమున సంచరించునవి, మనుష్యులు మాటాడువారు, సర్పాదులు విషపూరితములు, నీరు చల్లనిది, నిప్పు వేడిది యిట్లు సృజింపబడెను. గర్భము, ప్రసవము-స్త్రీలకేగాని పురుషులకు లేదయ్యె “గేదె ప్రసవ వేదన పడుచుండగా మహిషము మన్మథ బాధపడుచుండె” నను సామెత యిందులకే వచ్చినది.

22. బహుపురుషసమవాయే స్త్రియ ఏవ హానిర్వి హితా న తు బహునారీసమవాయే పురుషస్య కాపి హానిః, "మాసి మాసి స్త్రీణామార్తవం విహితం న తు పుంసామ్. పురుషస్యైవ రోగాదినా క్లైబ్యం విహితం న తు స్త్రియాః. కాశ్చిత్ప్రజా నిర్ధనాః, కాశ్చిత్సధనాః, కాశ్చిద్దుర్బలాః, కాశ్చిత్ప్రబలాః, కాశ్చిన్నిరామయాః, కాశ్చిత్సామయాః. కశ్చిత్ప్రభురన్యే భృత్యాః, కాశ్చిత్సప్రజాః, కాశ్చిదప్రజాః, కిం బహునా సర్వాపి సృష్టిర్విషమైవ. అవైషమ్యే సృష్టేరేవాయోగాత్,

23. న చైవ మీశ్వరస్య వైషమ్యనైర్ఘృణ్యప్రసక్తి

---

22. అనేకపురుషుల సంగమమువలన స్త్రీకి హానికలదు గాని అనేకస్త్రీలపొందువలన పురుషునకుహానిలేదు, ప్రతిమాసమున స్త్రీలకే ఋతుస్రావముగాని పురుషులకు లేదు. రోగమువలన పురుషుడు నపుంసకుడగునుకాని స్త్రీకి నష్టములేదు. ప్రజలు కొందఱు దరిద్రులు-కొందఱు ధనవంతులు-కొందఱు బలహీనులు-కొందఱు బలవంతులు-కొందఱారోగ్యవంతులు-కొందఱు రోగులు-ఒకడు ప్రభువు-ఇతరులుభృత్యులు- కొందఱు సంతానవంతులు-కొందఱు సంతానహీనులు ఒకటేమి ? సృష్టియంతయు నీరీతి విషమముగా నున్నది. హెచ్చుతగ్గులు లేని యెడల సృష్టియేలేదు.

23. ప్ర:— మీ వాక్యములనుబట్టి యీశ్వరునకు పక్ష

ఇతి వాచ్యమ్, కర్మాధీనత్వాత్సృష్టేః. ఈశ్వరో హి జీవాదృష్టానుసారేణ సృష్టిం విధత్తే. తస్మాత్ పుణ్యాతిరేకేణ పురుషజన్మ సమ్పద్యతే దేహినః, పాపాతిరేకేణ తు స్త్రీజన్మ. అతో న స్త్రియాః స్వాతన్త్ర్యమ్. "పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే, పుత్రస్తు స్థావిరే భావే న స్త్రీ స్వాతన్త్ర్యమర్హతి" ఇతి స్మర్యతే.

24. న చ విధవాయా అపుత్రాయా మృతపితృకాయాస్తరుణ్యా భర్త్రన్తరమేవ రక్షకమితి వాచ్యమ్. తత్ర సోదరాత్మజసోదరాదీనామేవ తద్రక్షకత్వాత్. పరాశరస్మృ

---

పాతము నిర్దయయు నున్నట్లు తెలియుచున్నదే!

ఉ:- కాదు. కర్మననుసరించి సృష్టి జరుగుచున్నది. ఈశ్వరుడు జీవుల కర్మననుసరించి కదా సృష్టించును! కావున పుణ్యాధికమైన పురుషజన్మము. పాపాధికమైన స్త్రీజన్మము ప్రాప్తించును. అందుచే స్త్రీకి స్వాతంత్ర్యము లేదు. శైశవమున నామెను తండ్రియు, యౌవనమున భర్తయు, వార్ధకమున పుత్రుడు రక్షించునుగాన స్త్రీ స్వాతంత్ర్యమునకు అర్హురాలు కాదని శాస్త్రము చెప్పుచున్నది.

24 ప్ర:- ఒక స్త్రీకి పతి చనిపోవును. పుత్రులు కలుగ లేదు. తండ్రియు లేడు, అట్టియెడ నామె తన రక్షణమునకై మఱియొక పతిని స్వీకరింపరాదా?

తిస్తు కృత్రిమపతివిషయా. అతఏవ పతావితి తత్ర దృశ్యతే పతిశబ్దో హి సమాస ఏవ ఘి సంజ్ఞః. తస్మాత్ పత్యౌ వితి వక్తవ్యే పతావితి వచనం జ్ఞాపయతి నాయం ముఖ్యః పతిః, కిన్తు అస్మై ఏనాం దాస్యామీతి పితృసంకల్పవిషయః కృత్రిమః పతిః. ఏవం విధస్యాపి మరణే ఆశౌచం విహితం

---

ఉ:— కూడదు. అట్టియెడ భర్తయొక్క సోదరులుగాని తన సోదరులుగాని యామెను రక్షింపవలెను.

ప్ర:— వేరొకని స్వీకరింపవచ్చునని "నష్టేమృతే" యనుచు పరాశరుడు చెప్పెనుకదా!

ఉ:— అచట పతిశబ్దమునకు వివాహమాడిన పతియని యర్థముకాదు. తండ్రి ఒకవరునకీయదలచిన యెడల వివాహము కాకయుండగే అతనికి పతియను పేరు వచ్చును. కాని అది కర్మనుపయోగించు పతిత్వముకాదు. అట్టిపతి దేశాంతరమేగినను నపుంసకుడైనను మరణించినను వేరొకనితో వివాహము చేయవచ్చునని పరాశరస్మృతి చెప్పుచున్నది. కాని వివాహమాడిన పతిని గూర్చి కాదు. వివాహమైన పతినిగూర్చి చెప్పిన యెడల "పత్యౌ" అని యుండవలెను. "పతౌ" అని యుండుటచే వివాహమైన పతి కాదని తెలియుచున్నది. ఇట్టివాడు మరణించినను ఆశౌచము కలదని ధర్మశాస్త్రము తెల్పుచున్నది. పెండ్లియైన పతి మరణించిన యెడల స్త్రీకి రెండవ వివాహము లేదనుమాటనే వేదమునందిట్లు చెప్పబడినది. "ఒక్క

ధర్మశాస్త్రేషు. తస్మాదుద్వోఢృమరణే నాకేషాం న పత్య-న్తరవిధిః, అతఏవ "యస్మాన్నైకాం రశనాం ద్వయోర్యూపయోః పరివ్యయతి, తస్మాన్నైకా ద్వౌపతీ విన్దతే" ఇతి శ్రూయతే.

25. న చ సమానకాలే పతిద్వయం న విద్యతే ఇతి శ్రుతేరర్థ ఇతి వాచ్యమ్. సమానకాలే నార్యాః పతిద్వయ ప్రసక్తేరేవాభావాత్. న హ్యేకస్యాః ద్విత్వాదికత్వం స

---

త్రాటిని రెండు యూప స్తంభములకు గట్టరు. కావున ఒక్క యువతి యిద్దరు పతులను బడయ జాలదు'' అని (యూప స్తంభమనగా యజ్ఞములో పశువును గట్టెడి స్తంభము. అది పురుషునితో బోల్పబడినది. ఒక్క స్తంభమునకు పెక్కు పశువులను గట్టుట సహజముగాని ఒక్క పశువును పెక్కు స్తంభములను గట్టుట పొసగదు. ఇట్లే ఒక్క పురుషుడు పెక్కు యువతుల బొందదగునుకాని ఒక్క స్త్రీ పెక్కు పురుషుల జేపట్టరాదని వేదాభిప్రాయము.)

25. ప్ర:- ఒక్క కాలమున నిద్దరుపతుల బొందకూడదని దాని యభిప్రాయము చెప్పకూడదా?

ఉ:- ఒక్క సమయమున నిద్దరుపతుల ప్రసక్తియే రాదు. ఒక్క వనిత కిద్దఱధిపతులుండుట సంభవింపదుకదా! ప్రసక్తి లేనివిషయమును అసంభవ విషయమునుగూర్చి వేదము నిషేధింపదు. నిషేధించిన నది వ్యర్థమగును. లోకముచేత నే

మ్నాయతి. నహ్యప్రసక్తమసంభావితఞ్చ శ్రుతిర్నిషేధతి. అనర్థక్యాత్. విధవాయాస్తు సకామత్వేన భర్త్రన్తర పరిగ్రహః ప్రసక్తస్సంభావితశ్చేతి తమేవ నిషేధతి శ్రుతిః.

26. నను "ఉదీర్ష్వ నార్యభిజీవలోక మితాసుమేత ముపశేష ఏహి. హస్తగ్రాభస్య దిధిషోస్త్వమేతత్పత్యుర్జనిత్వ మభిసమ్బభూవ" ఇతి శ్రుతేర్విధవాయా భర్త్రన్తర స్వీకార ఉచిత ఏవేతి చేన్నైవమ్. తస్యాః శ్రుతేర్భర్తృమృతేనా శోచన్త్యా నార్యా ఆశ్వాసనపరత్వాత్. యద్వా

---

సిద్ధించినదానిని వేదము బోధింపనేల? ఇక విధవావివాహము నెట్లు నిషేధించెననగా ఆమెకు కామముదయించి భర్త్రన్వే షించుట సంభవింప వచ్చునుగాన శ్రుతి దానిని నిషేధించినది.

26. ప్ర:— "ఉదీర్ష్వనారి" అను నొక మంత్రము విధవరాలికి వివాహము నుపదేశించుచున్నది. ఆ మంత్రార్థమును జూడుడు— ఒక వనిత తనపతి మరణింపగా అతని శవముపైబడి యేడ్చుచుండెను. ఆమెనుగూర్చి "ఓ నారీమణీ ప్రాణములు గోల్పోయిన పతిపైబడి యేడ్చిన నేమిలాభము. .......................... అని యున్నది. దీనినిబట్టి విధవావివాహము వేదసమ్మతమని యేల చెప్పరాదు?

ఉ:— ఓయీ ఆ మంత్రమునకు స్త్రీ పునర్వివాహము నందు తాత్పర్యములేదు. దుఃఖించుచున్న యువిదనోదార్చుటయే ఆ శ్రుతియొక్క తాత్పర్యము. లేదా ఈ శ్రుతి యితర.

యుగాన్తర విషయత్వం శ్రుతేర్బోధ్యమ్. "ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధంతథా కలౌ పఞ్చ న కుర్వీత భ్రాతృజాయాం కమణ్డలు" మితి వచనాత్.

27. ఏతేన "పాణిగ్రాహే మృతే బాలా కేవలం మన్త్రసంస్కృతా। సా చే దక్షతయోనిస్స్యాత్పున స్సంస్కార మర్హతి" యది సా బాలవిధవా బలాత్త్యక్తాథవా క్వచిత్, తదా భూయస్తు సంస్కార్యా గృహీతా యేన కేనచిత్." ఉద్వాహితా తు యా కన్యా సహ నాప్నోతి మైథు

---

యుగధర్మముల దెల్పుచున్నట్లు గ్రహింపవగును. ఏల యనగ కలియుగమున విధవావివాహము ధర్మశాస్త్రముచే నిషేధింప బడి యున్నది. 1. స్త్రీపునర్వివాహము, 2. జ్యేష్ఠున కధిక భాగము, 3. గోవధము, 4. సంతానమునకై సోదరునిభార్య నుగవయుట, 5. సన్న్యాసము ఈ యైదును కలియుగమున నిషేధింప బడినవి. దీనితోబాటు ఈక్రింది యర్థముగల ధర్మశాస్త్రవచనములుగూడ నితర యుగములకే జెందినట్లు సిద్ధించు చున్నది.

27. పాణిగ్రహణమునందు మంత్రసంస్కారము మాత్రము పొంది పతిసంపర్కములేని కన్యక మఱలవివాహము జేసికొనవచ్చును. మఱియొకచో బాల్యముననే వైధవ్యము వచ్చినను లేక భర్తచే బలాత్కారముగ విడచివేయబడినను అట్టిదానినెవ్వరేని దగ్గఱకుజేర్చి యామెకు వివాహము జేయవచ్చును. మఱియొక స్మృతిలో ఏకన్య వివాహమై పతి సం

నమ్. పునర్లభేత భర్తారం యథా కన్యా తథైవ సా॥ ఇత్యాది వచనాని యుగాన్తర విషయాణ్యేవేతి సిద్ధమ్.

28. నను యే యుగాన్తరేష్వేవ ధర్మాస్తే కిమితి కలావధర్మా ఇతిచేదుచ్యతే. యథా యుగాన్తరీయా గోవధాదయ ఇదానీమధర్మాస్తథైవేతి. కిఞ్చ శ్రుతిస్మృతీ ఉభే ఈశ్వరాజ్ఞే. తదుల్లఙ్ఘనాత్పురుషః పతతి. "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లఙ్ఘ్య వర్తతే। ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ స వధ్యో నాత్రసంశయ ఇతి భగవద్వచనాత్. తే చ గోవధాదీనాం యుగాన్త

---

యోగమును పొందదో ఆమెమఱల నింకొకని జేపట్టవచ్చును. ఈమొదలైన స్మృతివాక్యములు పూర్వయుగములకు జెందినవి

28. ప్ర:- యుగాన్తరములో ధర్మముగా నుండినవి కలియుగమున నధర్మములగుటకు గారణమేమి?

ఉ:- యుగాన్తరమున గోవధాదులీకాలమున నధర్మములెట్లయ్యెనో అటులనే తక్కిన ధర్మములుగూడ నిపుడధర్మములయ్యెను. మఱియు శ్రుతిస్మృతులు రెండును భగవదాజ్ఞారూపములు. వాని నుల్లంఘించిన నరుడు పతితుడగును. "వేదము ధర్మశాస్త్రము నాయాజ్ఞలు. ఎవరు వీని నుల్లంఘించి జీవింతురో ఆతడు నాయాజ్ఞనుల్లంఘించి నాకు ద్రోహమొనర్చిన వాడగుచున్నాడు. అతడు వధార్హుడగును. సంశయము లేదు." అని భగవానుడు స్పష్టముగ జెప్పెను. గోవధమున్నగు విషయములు పూర్వయుగములందు ధర్మమనియు కలియందధర్మమనియు శాస్త్రము లెట్లు నిర్ణయించెనో అటు

రేషు ధర్మత్వం కలా వధర్మత్వఞ్చ యథాబ్రువతే తథైవా
స్మాభిః ప్రతిపత్తవ్యమ్. న తు తత్ర చోదనీయమ్.

29 అథాపి యది తయో స్తాత్పర్యజ్ఞానం సన్తోష జనకం తర్హి బ్రూమః. యుగాన్తరేషు జనాః స్థిరచిత్తత్వేనాతి ప్రసఙ్గాది దోషరహితాః కలౌ తు న తథేతి తావదస్తి. యుగాన్తరీయ జనతాయాః కలియుగ జనతాయాశ్చ వైషమ్యమతిమహత్. తత్ర సతి యజ్ఞార్థ మాతిథ్యార్థం వరార్థఞ్చ హింసా కర్తవ్యేత్యుక్తే యుగాన్తరీయ జనాస్తేష్వేవ హింసాం కుర్వన్తి. నాన్యేషు ప్రయోజనేషు. కలియుగాస్తు యజ్ఞ-

---

లనే మనము గ్రహింపవలెను కాని దానిగూర్చి ప్రశ్నింప రాదు.

29. అయినను శాస్త్రకర్తల యభిప్రాయ మేమై యుండునని తెలిసికొని సంతసించు నెడల చెప్పెదము. వినుము.

* యుగాన్తర ధర్మములకు గారణము *

పూర్వయుగముల ప్రజలు స్థిరచిత్తులై అధిక ప్రసంగము మున్నగుదోషములులేని వారై యుండిరి కలియుగమున నిట్లు కాదు గాన పూర్వయుగస్థులకు కలియుగ ప్రజలకుచాల తారతమ్యము కలదు. ఇట్లుండ పూర్వపు ప్రజలను గూర్చి "యజ్ఞమందు, అతిథికొఱకు, వరునికొఱకును పశుహింస జేయవచ్చు"నని చెప్పిన నాటివారు ఆవిషయములందు మాత్రమే పశుహింస జేయుచుండిరి. కలియుగస్థు లావిధముగ కట్టుబడి యుండరు. కొంచెమవకాశము లభించినయెడల స్వేచ్ఛగా

ష్ప్రదవకాశం లబ్ధ్వా యథేచ్ఛం హింసాం కుర్వన్తి. తతః కలియుగే హింసా నిషిద్ధా.

30. అత ఏవ యజ్ఞేపి పశోరపి హింసా న యుక్తేతి పిష్టపశోరేవ హింసనం యజ్ఞే కేచిత్కుర్వన్తి. కిఞ్చ యథావిధి గోమేధాదికం కర్తుమప్యేతే న శక్నువన్తి.

31. అపి చ యుగాన్తరేష్వపి మాంస భక్షణం కర్తవ్యమితి న నియతమ్. కిన్తు మాంసత్యాగ ఏవోత్తమః. యస్తు మాంసం త్యక్తు మశక్తస్తప ఆదినా తద్భక్షణ జన్య దోష

---

హింస జేయ సమకట్టుదురు. అందుకై కలియుగమున "హింస" బొత్తుగా పనికిరాదని నిషేధించిరి.

30. కావుననే యజ్ఞమందుగూడ నిపుడు పశుహింస పనికిరాదనియు "పశువునకు బదులు పిండితో జేసిన పశువు నుపయోగించుట కర్తవ్యమని కొందఱు పండితు లావిధముగ జేయుచున్నారు. మఱియు పశుహింసయే యజ్ఞమున గర్తవ్యమని తలచువారు గూడ "గోమేధము"ను యథావిధిగా చేయ జాలకున్నారు.

31. మఱియు పూర్వ యుగములందైనను మాంస భక్షణము చేసితీరవలెనని లేదు. మాంసము విడచుటే ఉత్తమముగా బరిగణింప బడెను. మాంసము విడుచుటకు చేతగాక ఆదోషమును తపస్సుచే నివారించుకొనుటకు సమర్థుడైన వానిని గూర్చి మాంస భక్షణ మంగీకరింప బడెను. అప్పుడైనను ఈ యీ మాంసము తినవలెనని శాస్త్రము విధింపలేదు. "నీకు

నిరాకరణ క్షమశ్చ. తస్య యజ్ఞాదిషు మాంస భక్షణం పతి సఙ్ఖ్యా విధినోక్తమితి సర్వదాప్య హింసైవ పరమః ధర్మః.

32. ఏవం యుగాన్తరేషు సౌత్రామణ్యాం మద్యపానం విహితం యది తత్కలియుగేపి విధీయేత తర్హి సర్వదాపి తే మద్యం పిబేయుః, కిఞ్చ మద్యపాన జన్యం మదం నైతే నిరోద్ధుం క్షమా ఇతి చ కలియుగే మద్యపానం నిషిద్ధమ్. ఏవం యది విధవోద్వాహస్య కలియుగే విహితత్వం తర్హి తే విధవా మక్షతయోనిమేవ కేవలం నోద్వహేయుః, కిన్తర్హి

---

మాంస భక్షణేచ్ఛ కలదేని ఈయా జంతువుల మాంసమున కంటె మఱియొకటి భుజించరాదు." అని శాసించెను. అట్టియెడ తాను నియమించిన జంతువులకంటె వేరైనవి తినగూడదనుట శాస్త్రీయముగాని తానునియమించినవి తినవలెనని శాస్త్రీయముకాదు. కావున నన్నియుగములందును అహింసయే ఉత్తమ ధర్మము.

32. ఇట్లే సౌత్రామణి యజ్ఞమునందు మద్యపానము జేయవలెనని పూర్వయుగములలో విధించినటుల కలియుగమునగూడ విధింపబడెనేని ప్రజలు నిత్యము మద్యపానము జేయగలరు. మఱియు మద్యపానమువలన గలిగెడు మదమును నివారించుకొను శక్తి నేటి ప్రజలకుండబోదని కలియుగమున నిది నిషేధింప బడెను. ఇట్లే పతి సంపర్కమెఱుగని విధవరాలికి మాత్రము పెండ్లిచేయవచ్చునని యవకాశ మిచ్చిన యెడల కలియుగ ప్రజలంతటితో నూరుకొనరు. పతి సంప

క్షతయోనిమపి హింసిత గర్భామపి సపుత్రామపి చోద్వహేయుః. సకామాయాహి విధవాయాః పునరుద్వాహేఽధికార ఇతి విధవోద్వాహమతానుయాయినాం ప్రలాపః.

౩౩. నచైవ మక్షతయోన్యా విధవాయా ఉద్వాహోఽస్తు కలియుగే ఇతివాచ్యమ్. దర్శితాతిప్రసఙ్గమాలక్ష్య యది స్మృతికర్తృభిః కలియుగే విధవోద్వాహో నిషిద్ధో నాభవిష్యత్తర్హి విహితోఽభవిష్యత్. తస్మాద్యది సకామత్వేన విధవాయాః పునరుద్వాహవిధిస్తర్హి తేనైవ

---

ర్యము పోయినను గర్భములు పోగొట్టుకొనినను సంతానము కలిగినను సరియే ఆమెకు వివాహము చేయగలరు. మఱియు ఆమెకు కామ ముండినగదా వివాహ మొనర్చుట. అని విధవా వివాహ మతము వారనుచుందురు.

౩౩. ప్ర:- గర్భాధానము గాకపూర్వమే వైధవ్యము పొందిన కన్యలకు (అక్షతయోనులకు) మాత్రము కలియుగమున వివాహము జేయవచ్చునని చెప్పరాదా?

ఉ:- అవకాశ మిచ్చిన యెడల అక్షతయోని వివాహముతో తృప్తి జెందక నేటి ప్రజలు సంతానవతికిగూడ వివాహము జేయుదురని తలచి కలియుగమున ఎట్టి సందర్భమైననైనను స్త్రీకి రెండవ వివాహములేదని శాస్త్రకర్తలు నిర్ణయించిరని పూర్వమే తెల్పితిని. అట్టి నిషేధములేకుండిన యెడల అక్షతయోని వివాహము జేయవచ్చునని అంగీకరింపవలసి యుండెడిది. కామమున్నందున వివాహము చేయవలె

భర్త్రన్తర పరిత్యాగ పూర్వక దృఢగాత్రమ్లేచ్ఛాది పతి
గ్రహ విధిశ్చ. తస్మాత్కలియుగే విధవోద్వాహానుయుక్తాః
తత్కర్తారశ్చ జాతిభ్రష్టాస్సన్త్వయాః పతితా ఏవ. అత ఏవ
తస్య శిష్టాపరిగ్రహః. "మహాజనో యేన గతస్సపన్థా" ఇతి
హిస్మర్యతే. ఏవం శిష్టాచారా భావాచ్చ విధవోద్వాహా
నకర్తవ్య ఆస్తికేన.

34. తథా సముద్రయానఞ్చ కలౌ నిషిద్ధమ్. యుగా
న్తరేషు హి భోజనమ్యానఞ్చాకృత్వా బహూని దినాని జనాః
ప్రాణాన్భర్తుం శక్తాః. ఇదానీన్తు నతథా. తతశ్చ సముద్రయా
యినా మధునా జాత్యన్తరైస్సహభోజనాదికం ప్రాప్తమ్.

---

సందుమూ, భర్త యున్నను కామము శమింపని పక్షమున
దృఢకాయుడైన మ్లేచ్ఛుని వరింపవచ్చునని యేల యనరాదు.
కావున ఎట్టి పరిస్థితి యందును కలియుగములో వితంతుస్త్రీకి
వివాహము లేదు. ఈవిధి నతిక్రమించి చేయువారు కులభ్రష్టు
లై తమ వంశములతోసహా నరకమున బడుదురు. మహాజను
లు వర్తించిన మార్గమే అనుసరింప దగినదని శాస్త్రకారు
లు చెప్పుదురు, మఱియు విధవావివాహమును శిష్టులాచరింప
లేదు. కావునను ఆస్తికున కది కర్తవ్యముకాదు.

34. ఇట్లే సముద్రముపై బ్రయాణము చేయుటయు
కలియుగమున నిషేధింప బడినది. పూర్వయుగముల విషయ
మేమనిన నాటి ప్రజలు అన్నోదకములనుమాని చాల దినము
లు జీవించుటకు సమర్థులైయుండిరి. ఇప్పుడట్టులగాదు. అందు

సముద్ర ఏవ మలమూత్రాది ప్రక్షేపణం ప్రాప్తమ్. తద్ధ్యయుక్తమ్ “నాప్సు మూత్ర పురీషంకుర్యా” దితిశ్రుతేః. వర్ణాశ్రమ విభాగరహిత హూణాదిమ్లేచ్ఛ దేశప్రాప్తిశ్చ. తత్ర హి భోజనం చణ్డాల వాటికాయామివ పాతిత్యావహమ్. గోమాంస భుజో హి తే.

౩౫. కిఞ్చ యస్స్వయంపాక కరణా సమర్థస్స తత్ర హూణాద్యన్నమేవ భుఙ్క్తే. మాతా పిత్రాది శ్రాద్ధాని చ పరిత్యజతి. న హి తత్ర శ్రాద్ధభోక్తారో బ్రాహ్మణాస్సన్తి. అస్మా

---

వలన ఈకాలమున సముద్రముపై బయనించువారికి ఇతరజాతి వారలతో గలసి భుజించుట తప్పనిసరి యైనది. మలమూత్రములను సముద్రమందే విసర్జించుటయు దటస్థించుచున్నది. ఇది యక్రమము. జలమందు మూత్ర పురీషముల విసర్జించరాదని వేదము వచించుచున్నది. మఱియు వీరికి వర్ణాశ్రమ ధర్మములులేని హూణాదుల నివాసమైన మ్లేచ్ఛదేశనివాసము గూడ దటస్థించు చున్నది. అచట భుజించుట చండాలవాటిక యందుభుజించుటతో సమానము. ఏలయన వారు గోమాంస భక్షకులై యున్నారు.

౩౫. మఱియు ఆదేశముల కేగినవాడు స్వయముగ వంట చేసికొన జాలనిచో వారియన్నమే తినవలసి వచ్చును. తలిదండ్రుల శ్రాద్ధమునుకూడా విడచి పెట్టును. శ్రాద్ధము పెట్టుదమన్నను అచట బ్రాహ్మణ భోక్తలు లభింపరు. ఇచట నుండి వెళ్ళిన బ్రాహ్మణులు లేరా యనిన వారు ఇదివఱకే

ద్దేశాత్పట్గతాశ్చ బ్రాహ్మణా అపి భూత పూర్వగత్యా హి పతితాః, తస్మాత్సముద్రయాతుః స్వీకారో న యుక్తః.

36. న చైవం సేతు స్నానార్థం సముద్రియానం కృత వతః స్వీకారోప్యయుక్త ఇతి వాచ్యమ్. అత్ర దర్శిత దోషా భావాత్. సేతుస్నానేన సర్వ దోష ప్రహాణాత్ త్రికూప ఖానకన్యాయ పరిత్యక్తేశ్చ.

37 నను యథా కశ్చిచ్చోరో రాజ శాసనాద్బద్ధీ కృతో జాత్యంతరీయాన్నం భుక్త్వాపి శిక్షావసానే పునః ప్రాయశ్చిత్తేన శోధితస్సన్ స్వం కులం ప్రవిశతి ద్విజః, ఏవం

---

పతితులై యుందురు. కావున సముద్రమున కవ్వలనున్న దేశములందు నివసించినవాడు సంఘములో స్వీకరింప దగిన వాడుకాడు.

36 ప్ర:— అటులైన సేతు స్నానము జేయుటకై సముద్రముపై బయనించువారు కూడా బహిష్కరింప దగిన వారగుదురా?

ఉ:— కాదు. పై చెప్పిన దోషములు వీరికి వటస్థింపవు. మఱియు సేతుస్నానమువలన సమస్త పాపములు దొలగును. గాన బావి త్రవ్వించిన వానికెట్లు దోషములంటవో అటులనే వానికిని సముద్రము దాటిన దోషముంటదు.

37. ప్ర:— ఒక దొంగ రాజశాసనము వలన శిక్షింప బడినపుడు కారాగృహమున జాత్యంతర భోజనము చేసినను శిక్షయైన పిమ్మట ప్రాయశ్చిత్త మొనర్చుకొని తమ జాతిలో

సముద్రయాయిన్యాపి ప్రాయశ్చిత్తేన శుద్ధ్యత్యేవేతి చేన్నైవమ్. చౌర్యస్య తత్ర బుద్ధిపూర్వకత్వేపి జాత్యన్తరీయాన్నస్య రాజశాసన ప్రయుక్తత్వాద్యత స్తస్య ప్రాయశ్చిత్తవిధిః. సముద్రయాయినా తు బుద్ధిపూర్వకమేవ జాత్యన్తరీయాన్నభుగితి నాస్య ప్రాయశ్చిత్తవిధిః

38. కిన్తు కృతప్రాయశ్చిత్తోపి చోరబ్రాహ్మణః శిష్టైః పరిగృహీత ఏవ. యస్త్వేవం ద్వీపాన్తరం గత్వా పునరాగతోపి సముద్రయాయీ ద్విజః ప్రాయశ్చిత్త పశ్చాత్పునః స్వకులం ప్రవిశేత్, తర్హి క్రైస్తవం యావనం వా మతం ప్రవి

---

ప్రవేశించినట్లు సముద్రయానము చేసినవాడుగూడ స్వదేశమునకు వచ్చిన పిదప ప్రాయశ్చిత్తము చేసికొనిన పరిశుద్ధుడు కాడా?

ఉ:- వీరిద్దరిలో భేదము కలదు. దొంగతనము బుద్ధిపూర్వకముగా జేయబడినను అటుపై దటస్థించు జాత్యన్తరభోజనము బలాత్కారముగా సంభవించును. సముద్రయానము విషయము మటులకాదు. అతడు బుద్ధిపూర్వకముగనే జాత్యన్తరభోజనము చేయుచున్నాడు. కాన నతనికి ప్రాయశ్చిత్తము లేదు.

38. మఱియు ప్రాయశ్చిత్తము చేసికొనినను చోరుడగు బ్రాహ్మణుని శిష్టులు స్వీకరింపరు. ఇట్లే ద్వీపాన్తరమునకేగిన బ్రాహ్మణుడును ప్రాయశ్చిత్తముచే పరిశుద్ధుడైన పక్షమున క్రైస్తవ మహమ్మదీయమతములు స్వీకరించి తరువాత

భ్రష్టోపి ద్విజః ప్రాయశ్చిత్త పశ్చాత్ పునః స్వకులం ప్రవిశేదేవ. నహ్యేవం కులభ్రష్టస్య క్వాపి ప్రాయశ్చిత్తం దృశ్యతే.

39. న చ సముద్రయాయీ ద్విజోఽపి నిరన్నోదకః క్షీరపాయీ భవత్యేవాపతిత ఇతి వాచ్యమ్. యది చణ్డాల వాటికాయాం వసన్ క్షీరపాయీ ద్విజోఽపతితస్స్యాత్తర్హ్యా యమపతితస్స్యాత్ కిఞ్చ ద్వీపాన్తరే వసన్నయం స్నాన సన్ధ్యాదికం కరోతి వా నవా? ఆద్యే హూణాద్యాక్రాన్తస్య తజ్జలస్య కథం స్నానాచమనార్హతా? నహి చణ్డాల స్పృష్ట జలం ద్విజ ఇహ స్పృశతి. ద్వితీయే కథన్తస్య పాతిత్యమ్? కర్మభ్రష్టో హి పతతి.

---

ప్రాయశ్చిత్తము జేసికొనిన బ్రాహ్మణుని పరిశుద్ధ జేయవలసివచ్చును. కులభ్రష్టుడైనవానికెచటను ప్రాయశ్చిత్తము లేదు.

39. ప్ర:- పాశ్చాత్య దేశములకేగిన బ్రాహ్మణుడైనను అన్నోదకములమాని క్షీరమును మాత్రము సేవించి జీవించు నెడల పతితుడెట్లగును?

ఉ:- అట్లయిన క్షీరముసేవించుచు చండాలవాటికలో నివసించినను దోషములేనిపక్షమున సముద్రయాయికి దోషము లేదనవలెను.

ఇదియుగాక- ద్వీపాంతరములో నివసించిన యితడు స్నాన సంధ్యాదుల నొనర్చునా లేదా? చేయునందుమా- హూణాదిమ్లేచ్ఛులచే నాక్రమింపబడిన అచటినీరు స్నానము

40. నను అర్థార్జనార్థం సముద్రయాన ద్వీపాన్తర గమనాదికం కర్తవ్య మేవేతిచేత్ తర్హి కామోపభోగార్థం మ్లేచ్ఛ హూణాద్యఙ్గనా సంభోగః కర్తవ్య ఏవ.

అతఏవోవాచ మనుః— "అకుర్వన్విహితం కర్మ నిన్దితఞ్చ సమాచరన్, ప్రసజ్జంశ్చేన్ద్రియార్థేషు నరః పతన మృచ్ఛతి" ఇతి.

41. ఏవంస్త్రీణాం ద్విజేతరాణాఞ్చ వేదాధ్యయనాదిక మయుక్తమ్. "స్త్రీశూద్ర ద్విజ బన్ధూనాం త్రయీ న శ్రుతిగోచ" రేతి వచనాత్. న చ మైత్రేయ్యాద్యా నార్యః

---

నకు ఆచమనమునకు నెట్లుతగియుండును? చండాలురు తాకిన జలమిచట ఉపయోగింపబడదుగదా! స్నాన సంధ్యలు మానుసందురా—, అటులైన కర్మభ్రష్టుడై పతితుడయ్యెను.

40. ప్ర:- ధనార్జనమునకై సముద్రయానము ద్వీపాంతర నివాసము మున్నగునవి దోషావహములెట్లగును?

ఉ:— అటులైన కామోపశమనమునకై మ్లేచ్ఛ హూణాదిస్త్రీలను భోగించుటయు దోషావహముకాదనవలెను. ఇదియసంగతము. మనుస్మృతిచూడుడు:- "శాస్త్రము విధించిన పనులజేయకున్నను, నిషేధించినవానిజేసినను, ఇంద్రియములకు లోబడి సంచరించినను మానవుడు పతితుడగును."

41. ఇట్లే స్త్రీలకు శూద్రులకు వేదాధ్యయనము తగినదికాదు. "స్త్రీలకు శూద్రులకు భ్రష్టులైన ద్విజులకును

కృతవేదాధ్యయనా ఇతి వాచ్యం! యుగాన్తరే స్త్రీణాం తత్సత్త్వాత్. ఉపనీతస్య హి వేదాధ్యయ నాధికారః స్త్రీణా ఞ్చోపనయనాభావా చ్ఛూద్రాదీనామివ వేదాధికారాభావః

42. న చ యుగాన్తరేపి స్త్రీణా న్నోపనయన మితివాచ్యమ్. "పురాకల్పేషునారీణాం మౌఞ్జీబన్ధన మిష్యతే" ఇతి. పూర్వయుగేషు తత్సత్త్వాత్. నచైవ మధునాపి స్త్రీ శూద్రాదీనా ముపనయనం కుర్మ ఇతివాచ్యమ్. శాస్త్రా భావాత్, ఆచారాభావాచ్చ. ఏవం దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ నిషిద్ధా. యుగాన్తరే తు సాస్తి.

---

వేదము వినదగినదికా"దని శాస్త్రవచనము దెల్పుచున్నది.

ప్ర:— మైత్రేయి మున్నగుస్త్రీలు వేదాధ్యయన మొనర్చియుండలేదా?

ఉ:— పూర్వయుగమున వారొనర్చియుండిరి. ఉపనయన మైనగాని వేదము జదువరాదు. స్త్రీలకుపనయనము లేనుగాన శూద్రులవలె వీరికిని వేదాధికారము లేదని గ్రహింపవలెను.

42. ప్ర:— ఇతరయుగములందును స్త్రీలకుపనయనము లేదుగదా!

ఉ:— "పూర్వయుగములందు స్త్రీలకుపనయన మున్నట్లు "పురాకల్పేషు" అను ప్రమాణము తెల్పుచున్నది. కావున అపుడు స్త్రీలకుపనయనముండెను.

ప్ర:— అటులైన నిపుడును చేయరాదా?

ఉ:— ఈయుగమున విధింపబడలేదు. అట్టియాచారము

43. "విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి। ఏకముత్పాదయేత్పుత్రం న ద్వితీయం కథఞ్చన" ఇతి వచనాత్. అయఞ్చ నియోగః కలియుగే దుష్కర ఇతి నిషిద్ధోఽపి. "నియుక్తౌ యౌ విధిం హిత్వా వర్తేయాతాం తు కామతః। తావుభౌ పతితౌ స్యాతాం స్నుషాగ గురుతల్పగౌ" ఇతి—నియోగ విధ్యతిక్రమే దోషాత్.

44. వస్తుతస్తు యుగాన్తరేష్వయం గర్హిత ఏవ. అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః। మనుష్యాణామపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతీతి వచనాత్. వేన ఇతి

---

కూడ లేదు. ఇట్లే భర్త మరణించినపిదప మరదివలన సంతానము కనుట కలియుగమున నిషేధింపబడెను. పూర్వయుగములలో నుండెను.

43. పుత్రుని గల్గించుటకై వితంతువును పొందువాడు భోగేచ్ఛను చంపుకొని ఒకవంశమును నిలువబెట్టుటయను పరమార్థదృష్టి గల్గియుండవలెను. ఈభావమును సూచించుచు అతనికి కొన్నినియమములను మనుస్మృతి శాసించియున్నది. "సంతానముకై విధవరాలియందు నియమింపబడిన వాడు రాత్రియందు ఆమెతో గూడుటకుముందుగ శరీరము సంతటిని నేతితో పూసికొనవలెను. మౌనవ్రతము ధరింపవలెను ఇట్టి నియమములు వహించి ఒక్కపుత్రుడు పుట్టువఱకు మాత్రమే చేరవలెను. రెండవవానికై యెప్పుడును ప్రయత్నింపరాదు." ఈయేర్పాటు కలియుగమున నిషేధింపబడెను. పైదెల్పిన

కశ్చిదుద్దిష్టః ప్రభుః. నహీదానీం విధవాం భ్రాతృజాయాం భర్త్రాజ్ఞానేన పాపీయసా ఘృతాక్తత్వాదికం క్రియతే. ప్రత్యుత్పత్తిశ్చ అవశ్యం భవతీతి వక్తుమశక్యా. తథా శిష్యస్య గురుదారేషు గురువద్వృత్తి శీలతా యుగాన్తరేష్వస్తి. కలౌ తు నిషిద్ధా. గురువదితి తత్రేవేతి వతిః. గురోరివ గురుపత్న్యాః పాదవన్దన కేశప్రసాధనాది శుశ్రూషాం న కుర్యాదిత్యర్థః. అతిప్రసఙ్గ దోషాదేవ. చలచిత్తో హి కాలియుగో జనః.

45. నను యుగాన్తరేషు గురుతల్పగమనం యుక్తమేవ. చన్ద్రేణ తారాయా ఉపభుక్తత్వాదితి వాచ్యమ్. యుగాన్తరేష్వపి తదయుక్తమేవ. చన్ద్రస్తు మహానుభావో

---

నియమములనుల్లంఘించి వారిర్వురు కామముతో సంచరించిన యెడల పతితులగుదురు. కోడలిని గురుభార్యను రమించినంతటి దోషము వారికి సంక్రమించుననియు మనుస్మృతి దెల్పుచున్నది.

44. నిజమారయ పైదెల్పిన విధవాసంతానయత్నము పూర్వకాలమందును నిందింపబడియేయున్నది. ఇది పశుధర్మమని విద్వాంసులు దూషించిరనియు, వేనుడు రాజ్యపాలనమొనర్చుచుండగా నీ పశుధర్మములను మానవులందు ప్రవేశపెట్టబడెననియు మనుస్మృతి దెల్పుచున్నది. "వేనుడు" ఒక దుష్టరాజు ఈకాలమున సోదరిపత్నిని గూడువారు శరీరమునకు నేయి పూసికొనుట మున్నగు నియమముల పాటింపరుకదా! మఱియు పుత్రుడు కలుగునను నమ్మకముకూడ చెప్పజాలము.

నోదాహరణమర్హతి కృష్ణవత్. అథవా తస్మాదేవ పాతిత్యాచ్చన్ద్రస్య క్షయకళఙ్కప్రాప్తిః.

46. కిఞ్చ యుగాన్తరేష్వపి వ్యభిచారసామాన్యమేవ దృష్టమ్. దైవికాదీశ్వర రేత స్సఙ్గ దోషాద్ధి కృత్తికాః షట్పతిభిస్త్యక్తాః, మానసికాదేవ వ్యభిచార దోషాజ్జమదగ్నినా భార్యా ఘాతితా. గౌతమాయితేన్ద్ర సంసర్గాదప్యహల్యా గౌతమేన పాషాణప్రతిమా కృతా. దేవరాజశ్చ నానా భగీ

---

ఇట్లే గురువునకు శుశ్రూష జేసినట్లుల గురుపత్నికిగూడ పాదవందనము తలదువ్వుట మొదలైన శుశ్రూష జేయవలెనని పూర్వయుగములలో శిష్యునకు నియమముగలదు. అది కలియుగమున నిషేధింపబడెను. అందుకు కారణముగూడ ప్రతిప్రసంగము జరుగునను భయమే కలియుగప్రజలు మనోనిగ్రహము లేనివారుగదా!

45. ప్ర:— చంద్రుడు తారతో రమించుటం జేసి పూర్వయుగములందు గురుభార్యాగమన మంగీకరింపబడెనని చెప్పరాదా?

ఉ:— పూర్వమునగూడ నిది దోషమే. మహానుభావుడైన చంద్రుని కృష్ణుని నుదాహరించుట యుక్తముకాదు. అటుజూచినను చంద్రుడుగూడ నమ్మహాపాపమువలన క్షయరోగముచే కళంకితుడయ్యెను.

46. ఇతరయుగములలో జరిగినదిగూడ వ్యభిచారముగనే పరిగణింపబడినది. ఈశ్వరుని రేతస్సు విధివశ

స్మృతేః తథా "అక్షైర్మా దీవ్య" ఇతి శ్రుతేర్ద్యూతమపి నిషిద్ధమ్.

47. న చ ధర్మరాజాదిభిః కృతమితి వాచ్యమ్! మహానుభావానాం తేషామిహానుదాహరణీయత్వాత్. యద్వా ద్యూతానుష్ఠానాదేవ నలధర్మరాజాదీనాం రాజ్యభ్రంశాద్యనర్థప్రాప్తిః.

48. అథ ద్విజవంశజాయాః కన్యాయా రజస స్సత్త్వనాత్ప్రాగేవ వివాహః కార్యః. "త్రింశద్వర్షో వహేత్క-

---

మున కృత్తికా తారలందు సంక్రమించినందున వారాపురుసు తమపతులచే బరిత్యజింపబడిరి జమదగ్నియొక్క భార్య రేణుక పరపురుషుని మనసుచే కామించినమాత్రమున పతిచేసంహరింపబడెను. గౌతమి వేషమునవచ్చిన యింద్రుని గవయుటచే నహల్య పాషాణమగునట్లును ఇంద్రుడు శరీరమంతయు భగములగునట్లును శాపము పెట్టబడెను. ఇట్లే జూదమాడుటను వేదము శాసించుచున్నందున అదియు నిషిద్ధము.

47. ధర్మరాజాదులు జూదమాడలేదా? యందురేమో, వారుమహానుభావులు గాన వారివిషయము మనకు గారాదు. లేదా నలధర్మరాజాదులకు గూడ జూదమాడుటంజేసియే రాజ్యభ్రష్టత మున్నగు నిక్కట్లు పెక్కుగలిగెను.

* వి వా హ వ య స్సు *

48. ఇక వివాహ వయస్సును గూర్చి చెప్పెదము. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తమ పుత్రికలు ఋతుమతులు కాకముందే వివాహముచేయవలెను. పురుషులవయస్సు

న్యాం హ్యాద్యాం ద్వాదశ వార్షికీం । త్ర్యష్టవర్షోఽష్టవర్షాం వా ధర్మే సీదతి సత్వర ఇతి మను వచనాత్. న చ **కామ మామరణాత్తిష్ఠేద్గృహే కన్యర్తుమత్యపి। న చైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్. త్రీణి వర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీ సతీ। ఊర్ధ్వన్తు కాలాదేతస్మా ద్విన్దేత సదృశం పతిమ్॥ అదీయమానా భర్తార మధిగచ్ఛేద్యది స్వయం। నైనః కిఞ్చి దవాప్నోతి న చ యం సాధిగచ్ఛతి। ఇతి మను**

---

గూర్చి మనువు ఇట్లు తెల్పుచున్నాడు. ముప్పదేండ్లవరుడు పన్నెండు వత్సరముల కన్యను చేపట్టవలెను. ఇరువదినాలుగేడుల వరుడు ఎనిమిది వత్సరముల కన్నియను స్వీకరింపవలెను మనుస్మృతియందలి **కొన్ని** వచనములనుబట్టి రజస్వలానంతరము వివాహము చేయవచ్చునని తెలియుచున్నది. ఎట్లన "పుత్రిక ఋతుమతియై మరణించువఱకు బ్రహ్మచారిణియై తండ్రి యింటనే యున్నను సరియేకాని ఆమెను గుణహీనునకియరాదు" అనియు "తండ్రి సకాలమునకు వివాహము చేయజాలనిచో పిల్ల **కుమార్తె** ఋతుమతియై, పిదప మూడు సంవత్సరములు వేచియుండవలెను పిమ్మట నామెస్వయముగనే ఒక వరుని పరిగ్రహింపవలెను" అనియు,తండ్రి సకాలమునకు వివాహము చేయజాలనపుడు తాను స్వయముగ పతిని వరించునేని అందువలన నామెకు పాపములేదు. **ఆవరునకును** పాపము సంక్రమింపదు అనియు నర్థముగల మనువచనములనుబట్టి రజస్వలానన్తర వివాహమువలన దోషము లేనటుల దోప

పచ నేభ్యః రజస్వలాయా వివాహో న దుష్ట ఇతి వాచ్యమ్. త్రింశద్వర్షః షోడశాబ్దాం భార్యాం విన్దేత నగ్నికామ్। ఏక విం్శోఽష్టవర్షాం వా ధర్మే సీదతి సత్వరః అతోఽ ప్రవృత్తే రజసి కన్యాం దద్యాత్పితా సకృదితి భారతాత్.

49. తస్మాదుద్వాహయేత్కన్యాం యావన్నర్తుమతీ భవేదితి యమవచనాత్. పితుర్గృహే తు యా కన్యా రజః పశ్యత్యసంస్కృతా। సా కన్యా వృషలీ జ్ఞేయా తద్భర్తా వృషలీపతిః॥ ఇతి దేవల వచనాత్. (వృషలత్వాద్రిః) యా కన్యా పితృవేశ్మస్థా యదిపుష్పవతీ భవేత్. అసంస్కృతా పరిత్యాజ్యా న తాంపశ్యే త్కదాచన

---

వచ్చును కాని అదియుక్తముకాదు. ఏలయన. ముప్పదేండ్ల వాడు 16 సం॥ లుగల కన్యను చేపట్టినను, పదేండ్లవాడు 8సం॥ లకన్యను పరిగ్రహించినను ధర్మమునుండి భ్రష్టుడగు ననియు నందువలన ఋతుమతిగాకమునుపు యుక్తకాలమున కన్యాదానము చేయవలెననియు భారతమువచించుచున్నది.

49. యమ స్మృతియు పైవిషయమునే బలపరచుచు "రజస్వల గాకపూర్వమే వివాహము చేయవలెనని తెల్పు చున్నది." ఏకన్య వివాహముగాకముందే తండ్రియింట ఋతు మతి యగునో ఆమె వృషలి యగును. ఆమె భర్తయు వృషలు డగును." అని దేవలస్మృతి చెప్పుచున్నది. ఈ విషయమును మార్కండేయ స్మృతి యిట్లు వక్కాణించుచున్నది. "ఏక న్య పెండ్లిగాక మునుప తండ్రియింట రజస్వల య

వివాహే చ న యోగ్యాస్యాల్లోకద్వయ విగర్హితా। ఏతాం పరిణయన్విప్రో న యోగ్యో హవ్యకవ్యయోః॥ న తస్యాం జనయేత్పుత్రం కానీన ఇతి కథ్యతే మాతా పితా చ పుత్రశ్చ త్రయస్తే వృషలాః స్మృతాః॥ యదా పుష్పవతీ కన్యా తదైవ త్యక్తుమర్హతి। న తత్ర దోషస్తస్యాస్తి గేహస్థా చేత్స దోషభాక్॥ ఇతి మార్కండేయ వచనేభ్యః.

**50.** "ప్రదానం ప్రాగృతోః" "అప్రయచ్ఛన్ దోషీ" ఇతి గౌతమ సూత్రాభ్యాం. యదా రహః పుష్పవతీ ద్విజస్త్రీ

---

ఆమెను బహిష్కరింప వలెను. ఆమెను చూచుటగూడ పనికిరాదు. ఆమె వివాహము బడయుట కయోగ్యురాలై యిహపరముల జెడిపోవును. ఆమెను పరిగ్రహించిన బ్రాహ్మణుడు దేవకార్యములకు పిత్రుకార్యములకు బనికిరాడు. ఆమె యందు పుత్రుని కలిగింప రాదు ఒక వేళ పుత్రుడు కల్గునేని అతడు "కానీను" డని వ్యవహరింపబడును. (కన్యయందు పుట్టినట్లె యెంచబడును) ఆపుత్రుడు అతని తలిదండ్రులును శూద్రత్వము వహింతురు. కావున పుత్రిక ఋతుమతి యైనవెంటనే ఆమెను విడచివేయవలెను. అందువలన తండ్రికి దోషములేదు ఇంట నుంచుకొనిన యెడల దోషియగును.

50 "ఋతుమతి గాకపూర్వమే కన్యాదానము చేయవలె", "అటుల చేయనివో దోషియగును" అని తెల్పు గౌతమసూత్రములవలనను "ఒకవేళ కన్య రహస్యముగా పుష్పవతియై

ముద్వహేద్యది। కాలాన్తరే యదా జ్ఞాతా తదా తాం స పరిత్యజేత్॥ యదిచ్ఛేదాత్మనశ్శుద్ధిం తదా చాన్ద్రాయణం చరేత్। కామాత్తు రమతే యస్తు చణ్డాల సమో భవేత్॥ పుత్రోత్పత్తిర్యది భవేత్తదా పతిత ఏవసః॥ ఇతి గౌతమ వచనేభ్యః రజస్వలోద్వాహస్య దుష్టత్వాత్. మను వచనాని తు ద్విజేతరపరాణి. అత ఏవ శిష్టైః స్వైరైః రజస్వలోపయమో నా చర్యతే. శిష్టాచారో హి పరం ప్రమాణమ్॥

51. న చాతి బాలాయా వివాహో న యుక్త ఇతి

---

దాని నెఱుగక ద్విజుడు వివాహమాడుననుకొందము అప్పుడేమి చేయవలెననగా— ఆవిషయము నెప్పుడుగుర్తించునో అప్పుడే ఆమెనువిడచివేయవలెను. పిమ్మట తాను పవిత్రుడుకావలసిన యెడల చాంద్రాయణవ్రతము నాచరింపవలెను తెలిసియు కామాతురుడై ప్రవర్తించునేని అతడు చండాలునితో సమానుడగును. పుత్రోత్పత్తియుకలుగునేని అతడు పతితుడే యగును" అనెడి గౌతమ వచనములను బట్టియు రజస్వలా వివాహము దుష్టమైనట్లు తెలియుచున్నది. పూర్వముదాహరింపబడిన మను స్మృతివాక్యములు శూద్రులకువర్తించును. కావున శిష్టాచారము సర్వోత్తమమైన ప్రమాణముకదా!

51. మిక్కిలి పసితనమున వివాహమొనర్పుటయు పనికిరాదని యందురేమో, అట్లనరాదు. "ప్రాగ్వాససః ప్రతిపత్తేరేకే" అనెడి గౌతమ సూత్రమువలనను.

వాచ్యమ్. ప్రాగ్వాససః ప్రతిపత్తేరేకే ఇతి గౌతమ సూత్రేణ సప్తసంవత్సరాదూర్ధ్వం వివాహస్యావశ్యకః। కన్యాయాశ్చ వ్యాప్తే రాజన్ అన్యథా ధర్మగర్హితా ఇతి భారతేన, అతిబాలా ప్రాణసంశయః ఇతి వచనాన్తరేణ చ తస్య యుక్తత్వాత్. మమ తు నాతిబాలాయా వివాహో న్యాయ్యః. నాపి రజస్వలాయాః, కిన్తు లోకజ్ఞానాత్పశ్చాద్రజో దర్శనాత్ప్రాక్చ కన్యాయా వివాహో న్యాయ్య ఇతి ప్రతిభాతి.

53. స చ వివాహ ఏకవారమేవ కార్యః, భారతే సకృత్ప్రదర్శనాత్, గృహస్థస్సదృశీం భార్యాం విన్దేతానన్యపూర్వాం యవీయసీమితి గౌతమ సూత్రాత్. "అన్యస్మై నైవా

---

ఏడు సంవత్సరముల వయస్సువచ్చినపిమ్మట చాతుర్వర్ణ్యముల వారును దమకన్నియలకు వివాహము చేయవలెను. అటుల చేయనిచో ధర్మదూరులగుదురు. ఇవ్విధముగ నాయా స్మృతికారులు వచించిరి. నాయభిప్రాయమేమనిన కన్యలకు అతిబాల్యమునగాని రజస్వలలైన పిమ్మటగాని వివాహము పనికిరాదు. బాల్యముగడచి లోకజ్ఞానము కలిగినపిమ్మట వివాహమొనర్చుట న్యాయమని తోచుచున్నది.

53. అట్టి వివాహము స్త్రీకి జీవితమున ఒక్క పర్యాయమే చేయవలెను. ఇందుకు ప్రమాణములు: భారతమున "సకృత్" (ఒక్కపర్యాయమే) అనియుండుటయు గౌతమ సూత్రమున— "ఇంతకు పూర్వమితరునిచే పెండ్లిచేసికొనబడని దానిని, తనకంటె వయసున చిన్నదానిని" పరిగ్రహింపవలెనని

చాన్యస్మై దత్తామితి" మితాక్షరాయాః, సకృదంశో నిపతతి. సకృత్కన్యా ప్రదీయతే। సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సతాం సకృదితి మను వచనాచ్చ తస్మాద్విధవాయాస్సధవాయా వా పునర్వివాహో నైవ యుక్తః.

53 ఏవం లిఙ్గధారిణాం తప్త చక్రాఙ్కనఞ్చ ద్విజేతర విషయత్వేన ద్విజస్య తదయుక్తమేవ. పరిషత్ప్రోక్తోయమర్థో మయైవ శూద్రధర్మ దర్పణే ఇత్యుపరమ్యతే. ఏవం హింసాది యుగాన్తరీయ దోషాభావాచ్ఛిష్ట ఏవాయం

---

యుండుటవలనను. మితాక్షరియందు "ఒకనికిచ్చెదనని వాగ్దానముగూడ చేయబడని కన్నియను చేపట్టవలె" ననియుండుట చేతను, మనుస్మృతియందు —"భాగములు పంచుకొనుటగాని, కన్యను దానముచేయుటగాని. వాగ్దానమొనర్చుటగాని సత్పురుషులొకపర్యాయమే చేయవలె"ననియుండుట చేతను వితంతువునకుగాని సుమంగలికిగాని పునర్వివాహము పనికిరాదని తేలుచున్నది.

53. ఇట్లే మెడలో లింగము కట్టుకొనుట గాని, శంఖ చక్ర చిహ్నములను కాల్చి బుజములపై ముద్రవేసికొనుట గాని శూద్రుల కొఱకేర్పడినవి గాన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వీనినాచరింపరాదు ఈ విషయమును నాచే రచింపబడిన "శూద్రధర్మదర్పణము" అను గ్రంథమున విపులముగ జర్చించితినిగాన నిపుడు వదలివేయుచున్నాను. పై జెప్పినరీతి హింసాదిదోషములు పెక్కు పూర్వయుగములందు [illegible]

కలియుగే.

54. నను కాలియుగానాం శిష్టానాం హింసాది దోషాభావేప్యశిష్టానాం తద్వ్యాప్త్యాదుష్ట ఏవాయం కలి రితి చేన్నైవమ్. నహ్యశిష్టైరపి గవాశ్వ నరాది హింసా క్రియతే. కిన్తు శూద్రాదిభిర్హింసితానాం మాంసభక్షణం క్రియతే. తచ్చ పరోక్షమేవ. ఏవ మశిష్టైర్ద్విజైర్మద్య మపి పరోక్షమేవ పీయతే. పరోక్షమేవాగమ్యాగమనం చ.

55. నను దుష్టకార్యాణాం పారోక్ష్యమాత్రేణ నహి

---

పరిగణింపబడినవి. ఈయుగమున నిషేధింపబడి యుండుటం జేసి కలియుగ మెంతయు ప్రశంసార్హమైనది,

54. ప్ర:— కలియుగమున శిష్టులు హింసాది దోషముల బాటింతురుగాక! శిష్టులుకాని ద్విజులు హింసాదుల జేయుచునే యున్నారు. గాన నీయుగము దుష్టమని యేల చెప్పరాదు?

ఉ:— శిష్టులుకాని ద్విజులైనను గోవులు - అశ్వములు (గుఱ్ఱములు) మానవులు మున్నగువాని జంపుటలేదు సామాన్య పశువులను శూద్రులు హింసించి విక్రయించు మాంసమును వీరు తినుచుందురు. అదియు రహస్యముగ జేతురు. ఇదియేకాదు. ఆచార వర్జితులు రహస్యముగ మద్యముగూడ సేవింతురు. వ్యభిచారముగూడ గావింతురు.

55. ప్ర:— రహస్యముగ జేసిన మాత్రమున దోషము నశించునా? కావున గ్రంథారంభమున జెప్పినటుల మద్య

దోష రాహిత్యమితి దుష్టా ఏవైతే ద్విజా యే మాంస భక్షణ మద్య పానాదికారిణో గ్రన్థారంభే ప్రదర్శితా ఇతి చేత్సత్యం సర్వదోష నిధేరపి కలే రస్త్యేకో మహాన్ గుణో యేన సర్వే దోషా ఆచ్ఛాద్యన్తే. తథాహి భాగవతమ్—

శ్లో॥ సర్వదోష నిధేరస్తి కలేరేకో మహాన్ గుణః
స్మరణాత్పుణ్య మాప్నోతి పాపం న కరణం వినా:

ఇతి యుగాన్తరేషు స్మరణాత్పాపమాప్నోతి పుణ్యన్తు కరణాదేవ. కలియుగే తు స్మరణాత్పుణ్య మాప్నోతి పాపన్తు కరణాదేవ.

---

పానమాంసభక్షణాది పాప కృత్యములు జేయు ద్విజులు కలియుగమున నుండగా దీని గొప్పతన మేమున్నది?

ఉ:— ఎన్ని దోషములున్నను నుండుగాక! ఆదోషము లన్నిటిని మూసివేయగల యొక గొప్ప గుణము కలియుగ మున గలదు. దానిని గూర్చి భాగవతమిట్లు చెప్పుచున్నది. "సమస్త పాపములకు నిలయమైన యీకలియుగమున నొక మహత్తరమగు గుణము కలదు. అదియెద్ది యన— ఈ యుగ మున పుణ్యకార్యముల జేయవలెనని తలంచిన మాత్రమున తత్సంబంధమగు పుణ్యము సంక్రమించును. పాపము మాత్ర ము, చేసినగాని సంక్రమించదు." ఇతరయుగములందిట్లుల కాదు. పాపకృత్యములను స్మరించిన మాత్రమున పాపము తగులును. పుణ్యము మాత్రము, చేసినగాని తత్ఫలితము రాదు. కలియుగమున "పుణ్యమును తలచినచో పుణ్య మబ్బును. పాపమును, చేసినగాని అది యంటదు."

56. అతఏవ "అహం కాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహమ్। ఇతి బ్రువాణస్సతతం కాశీవాస ఫలం లభేదితి కథ్యతే వృద్ధైః. ఏవం కలౌ స్మరణాదేవ పుణ్యాగమే యే పునర్వాపీ కూప తటాకారామ దేవాలయాది పుణ్య కార్యాణి కుర్వన్తి, అన్న వస్త్ర రజత హిరణ్య గో భూమ్యాది దానాని చ కుర్వన్తి తేషాం పుణ్యం దుర్వచమేవ. యే తు మనసాపి ప్రాణి వధ చిన్తనాదికం న కుర్వన్తి తేషాం సద్గతిర్దుర్వచా హి.

57. నను తథాపి యే కలౌ పుణ్య కర్మాణి న స్మరన్తి

---

56. కావుననే "నేను కాశీ వెళ్ళెదను, అచటనే నివసించెదను. అని యెల్ల వేళల నెవడు దలచుచుండునో వాడు కాశీ వెళ్ళకున్నను కాశీ నివాస ఫలమనుభవించును" అని పెద్దలు చెప్పెదరు. ఈ విధముగ కలికాలమున స్మరణమాత్రమున పుణ్యము వచ్చుచుండ బావులు, చెరువులు, తోటలు, దేవాలయములు మున్నగు పుణ్యకర్మల జేసినవారికి, అన్నము, వస్త్రము, వెండి, బంగారము, గోవులు, భూములు మున్నగువాని దానము జేయువారికిని కలుగు పుణ్యమును గూర్చి చెప్పజాలము. మఱియు నెవ్వరు ప్రాణిహింసనుగూర్చి మనసునఁగూడ దలంపరో వారికిగల్గు ఉత్తమలోకము వర్ణనాతీతము.

57. అట్లయినను ఎవరు కలికాలమున పుణ్యకర్మల స్మరింపనైనస్మరింపక దుష్టకార్యములనే జేయుచుందురో వారి

దుష్కార్యాణి తు కుర్వన్తి తేషాం కాగతి రితి చేదుచ్యతే.

శ్లో॥ సర్వదోష నిధేరస్తి కలేరేకో మహాన్గుణః।
నామ సంకీర్తనాద్విష్ణోః ప్రయాన్తి పరమాంగతిమ్॥

ఇతి భాగవతాద్యుగాన్తరేషు తపోధ్యానాదిభిః పరగతి ప్రాప్తిః. కలియుగేతు శ్రీవిష్ణునామ స్మరణాదేవ సేతి - మహాగుణోయం కలిః.

58. న చ శ్రీవిష్ణునామ స్మరణ మాత్రాత్కథం సేతి వాచ్యమ్— "సకృదుచ్చారితం యేన హరి రిత్యక్షరద్వయమ్। బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి"— ఇతి

---

గతి యేమగునని విచారింప వారికిగూడ తరణోపాయము భాగవతమున గానవచ్చుచున్నది. ఎట్లన— సర్వదోషములకు నిధియైన కలికాలమున కొక గొప్ప సుగుణముకలదు. ఎద్దియన శ్రీ విష్ణునామసంకీర్తనము వలన సర్వపాపనిర్ముక్తులై పరమపదము ప్రాప్తించుట పూర్వయుగములందు తపోధ్యానాదులచే ప్రాప్తింపగల పరమపదవి కలియుగమున భగవన్నామ సంకీర్తనముచేతనే లభించుచున్నది గాన నిది కలియొక్క గొప్ప గుణము.

58. విష్ణునామోచ్చారణ మాత్రమున పరమపదము ప్రాప్తించుటెట్లని యందురా! భగవన్నామ మహిమ నుగ్గడించు పెక్కు ప్రమాణముల జూపింతును. వినుము:—

" హరియను రెండక్షరముల నెవఁడొక్క పర్యాయ ముచ్చరించునో అతడు మోక్షమధిగమించుటకు నడుము

వచనాత్. నను పాపస్య కృతస్య భోగం వినా క్షయాభావా
త్కథం నామ స్మరణా త్పరగతి రితిచే దుచ్యతే
"హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః.
59. శ్లో॥ నారాయణో నామ నరో నరాణాం ప్రసిద్ధ
చోరః కథితః పృథివ్యామ్ । అనేకజన్మార్జిత
పాపసఞ్చయం హరత్యశేషం స్మృతిమాత్ర ఏవ.
శ్లో॥ రాశబ్దోచ్చారణా దేవ ముఖాన్నిర్యాన్తి పాతకాః
పునః ప్రవేశభీత్యాత్ర మకార స్తు కవాటవత్.

---

కట్టిన వాడగును".

ప్ర:- చేసినపాప మనుభవించినగాని క్షీణింపదని శాస్త్రము తెల్పుచుండ నామస్మరణముచే ముక్తి యెట్లుల లభించును?

ఉ:- "ఆపాపములన్నియు నామస్మరణము వల్లనే నశించును. అందలిమహిమ తెలియక జేసినను ఈఫలము లభించును. ఎట్లన - అగ్నిని తాకవలెనని యిష్టములేక స్పృశించినను అది కాల్చుచున్నది కదా!"

59. మఱియొక ప్రమాణము చూడుము. "నారాయణుడను నొకగొప్పచోరుడు భూలోకమున ప్రసిద్ధుడైయున్నాడు. అతనిని స్మరించిన మాత్రముననే మానవులయొక్క అనేక జన్మ సంబంధములగు పాపములను వారికి తెలియకనే హరించును."

ఇత్యాది వచనేభ్యః— నామ స్మరణాదేవ సర్వదోష పరిహారాత్. శ్రుతిరపి సంబ్రూతే— “హరేరామ హరే రామ రామరామ హరేహరే। హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే. ఇతి షోడశనామాని కలికల్మష నాశనమ్ సర్వశ్రుతి శేషః ఇతి.

60 న చ విష్ణునామస్మరణాత్కోపి పరగతిం న ప్రాప్త ఇతి వాచ్యమ్. “వనే చ రామో వసు చాహరామో నదీస్తరామో న భయం స్మరామః। ఇతీరయన్తో విపినే కిరాతా ముక్తిం గతా యం మునిదానుమేనగాత్” ఇతి “ఆకృష్ట

---

రామశబ్దమహిమను వర్ణించుట:- “ రా ” యను నక్షరము నుచ్ఛరించిన మాత్రమున లోపలనున్న పాపములు నోటినుండి యెగసిపోవును. ఆ పాపములు తిరిగివచ్చునను భయముతో పెదవులు మూసినట్లు “ మ ” కారము కవాటమై కాపాడును. “ ఇట్టి ప్రమాణములనుబట్టి నామస్మరణము వలన సర్వదోషములు నశించునని తెలియుచున్నది. “ హరే రామ హరేరామ రామ రామ హరేహరే” అను శ్రుతి కూడా షోడశ నామములు కలికల్మషములనన్నిటిని నశింపజేయునని తెల్పుచున్నది.

60 విష్ణునామమును స్మరించి యెవరు ముక్తినిబడసిరి? అందురా! వినుము! కొందఱు బోయ లరణ్యమున జేరి “ వనమందియు సంచరింతము, ధనమును హరింతము, నదుల దాటుదుము, భయము తల పెట్టవలదు” అనియర్థముగల్గిన “వనే చరామః, వ

ప్రాన్రియమాణః యదజామిళోఽపి నారాయణేతి మ్రియమాణ ఉపైతి ముక్తి”మితి చ కిరాతాజామిళాదీనాం ముక్తత్వ దర్శనాత్. ఏవం శివాది నామ స్మరణే ద్రష్టవ్యమ్.

61. భగవతః పరమేశ్వరస్య నామాని హి రామకృష్ణ గోవిన్ద శివ కేశవ మాధవ నారాయణ శఙ్కర విశ్వేశ్వర జనార్దనాదీని. నను అర్థం జానద్భిః కృతం విష్ణునామ స్మరణం ముక్తిప్రదం పాపహరఞ్చ భవతు నామ! కథమ్మూర్ఖాద్యైః కృతమితి చేన్నైవం వాదీః. అజానతాపి బాలేన స్పృష్టో దహత్యేవ తం పావక ఇతిన్యాయాత్. అతఏవ హి

---

ను చాహం రామః” మొదలగు మాటల ననుచుండగా ఆపదము లలో నిమిడియున్న రామశబ్దముయొక్క ఉచ్చారణము కలవ ఆదుర్మార్గులగు బోయవారు ముక్తి బడసిరని పై శ్లోకము వివరించుచున్నది.

“అజామిళుడను మహాపాపియు అవసానకాలమున నారాయణుడను తన కుమారుని బిలచి ముక్తిగాంచెను” అనియున్నది. ఇట్లే శివాదుల నామస్మరణమున కృతార్థులగుదురు.

61. రామ కృష్ణ గోవింద శివ కేశవ మాధవ నారాయణ శంకర విశ్వేశ్వర జనార్దన మొదలగునవన్నియు ఈశ్వరుని నామములు. వీనిలో నేదియైన గ్రహింపవచ్చును.

ప్ర:- అర్థమెఱిగి చేయబడిన భగవన్నామ జపము ముక్తిహేతువు కావచ్చును. అర్థమెఱుగని వారుచేసిన దానికి ఫలమెట్లు లభించును?

ద్వ్యాజేనాపి నారాయణం స్మృత్వా జగామ పరమం పదమజామిళః పాపి విధూతపాపస్సన్.

62. నను అన్తే నారాయణ నామ స్మరణాదేవ ముక్తిః, నతు జీవద్దశాయామితిచేన్నైవమ్. యది జీవద్దశాయాం కీర్తితం హరినామ పాప విమోచనాదికం కర్తుం న శక్తం తర్హితత్కథ మన్తేపి కర్తుం శక్నుయాత్? పరన్తు జీవద్దశాయాం హరినామ స్మరణోత్తరకాలమపి పాపం క్రియతే తేన సంబధ్యతే. అన్తే తు న తథేతి నిష్పాప ఏవ స ముచ్యతేఽవశ్యమ్. యద్యపి జ్ఞానంవినా న ముక్తిః, తథాపి

---

ఉ:- ఏమియు తెలియని బాలుడు తాకినను అగ్ని కాల్చుచునే యున్నటుల దీనిని గురించి చెప్పబడెను. కావుననే పరమ పాపియగు అజామిళుడెద్దియో యొకనెపమున నుచ్చరించిన నారాయణ శబ్దమాత్రనికి పరమపద మొసంగెనని చెప్పబడెను.

62. ప్ర:- అవసానకాలమున జేసిన నారాయణస్మరణ మువలన గదా ముక్తి; జీవించియుండగ జేసిన దానికి ఫలితము లేదుకదా!

ఉ:- జీవించియుండగా జేయబడిన హరినామము పాప విమోచనము చేయ జాలనిచో నంతి కాలమున మాత్రము దానికాసామర్థ్యమెట్లు వచ్చును? కాని భేద మెద్దియన జీవిత దశయందు హరినామ స్మరణ మొనర్చినను పిమ్మట మనుజల బాపకార్యము చేయుచుండును. అందుచే బంధింపబడును. అన్త్యకాలమున నటులకానందున తప్పక ముక్తి కలుగును

హరినామ స్మరణా జ్జ్ఞాన ప్రాప్తి ద్వారా ముక్తిస్స్యాదేవేతి బోధ్యమ్.

63. నను యద్యేవం హరినామోచ్చారణ మాత్రాదేవ సర్వపాపక్షయః తర్హి కిమితి ప్రాయశ్చిత్తకాణ్డారంభో మునీనాం మన్వాదీనా మితిచే దుచ్యతే. మయా కృతస్యాస్య మహతః పాపస్య కథమల్పీయసా హరినామ స్మరణ మాత్రేణ నాశ ఇతి తత్రావిశ్వాసవతాం స్వపాపక్షయే విశ్వాస జననార్థం కృతః ప్రాయశ్చిత్తకాణ్డారంభః. తేష్వపి ప్రాయశ్చిత్తేషు కర్మసు హరినామగ్రథితమేవ మౌక్తికేష్వివ నాయకమణిః. తన్నామోచ్చారణ ప్రభావాదేవ ప్రాయశ్చిత్తకర్మ

---

జ్ఞానము కలుగనియెడల ముక్తిలేదందురే హరినామముచే నెట్లు లభించు నందురా, హరినామము వలన జ్ఞానముదయించి పిమ్మటనే ముక్తి కల్గునని తెలియవలెను.

63. ప్ర:— హరినామ స్మరణమువలననే సమస్త పాపములు నశించునెడల మన్వాది మహర్షులు ప్రాయశ్చిత్తకాండ నేల రచించిరి?

ఉ:— నేనొనర్చిన యీ స్వల్పమగు నామోచ్చారణ మాత్రమున సమస్త పాపములు నశించునా యని సందియము గల్గి విశ్వాసము లేనివారికి తమ పాపములు నశించినవని విశ్వాసము కలిగించుటకు ప్రాయశ్చిత్తకాండ ప్రారంభమైనది. ఆప్రాయశ్చిత్తములందు గూడ ముత్యాల హారమున

నాం పాపక్షయకరత్వం న తు స్వతః. కిఞ్చహో రా! రామ
కృష్ణాది నామవత్సర్వాణ్యపి వేదాక్షరాణి హరినామాన్యేవ,
“వేదాక్షరాణి యావన్తి పఠితాని ద్విజోత్తమైః। తావన్తి
హరినామాని కీర్తితాని న సంశయః” ఇతి వచనాత్.

64. కిఞ్చ రామకృష్ణాది నామవత్సర్వే వేదా హరి
మేవ ప్రతిపాదయన్తి. “సర్వే వేదా యత్పదమామనన్తి”
తి శ్రుతేః. “వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః” ఇతి గీతావచనాచ్చ
యద్యప్యేవం తథాపి వేదపాఠే న సర్వేషామధికారః. స్వర
విపర్యయే చ దోషః. రామకృష్ణాదినామోచ్చారణే తు

---

కొలికిపూసవలె హరినామము చేర్పబడియే యున్నది. దాని
ప్రభావమువల్లనే ప్రాయశ్చిత్త కర్మలకు పాపములను పోగొట్టగల
మొదన్న శక్తి కలిగినది. వేయేల! వేదాక్షరము లన్నియు
రామకృష్ణాది శబ్దములవలె హరినామములే యయియున్నవి. “ద్వి
జోత్తములు వేదాక్షరముల నెన్నిటి నుచ్చరింతురో అన్ని
హరినామముల నుచ్చరించినట్లగును. సంశయములేదు” అని
వచనము ప్రమాణము తెల్పుచున్నది.

64. మఱియు రామకృష్ణాది నామములవలె వేదము
లన్నియు పరమేశ్వరునే బోధించుచున్నవి. “వేదములన్నియు
నేస్థానమును వర్ణించుచున్నవో” అను నర్థముగల శ్రుతి
వల్లనూ వేదములన్నిటిచే నేనే తెలియదగిన వాడనని తెల్పు
గీతావచనము వలననూ పైయర్థము తెలియుచున్నది. అటు
లైన హరినామమువలె వేదముల నెల్లను నుచ్చరింప వచ్చు

సర్వేషామధికారః. నాపి స్వరవిపర్యాయ దోషః. కిన్తు రామకృష్ణాదినామాని యథా ఝడితీశ్వరం బోధయన్తి న తథా "అగ్నిమీళే పురోహిత" మిత్యాదీని వైదికపదానీతి వేదాధ్యయ నాద్ధరినామ కీర్తనమే వోత్కృష్టః.

65. నను యే హరినామ కీర్తయన్తి తేపి దుష్టకార్యాణి కుర్వన్త్యే వేతి చేత్కుర్వన్తు నామ! హరినామ కీర్తనాత్ప్రాక్కాలికం సర్వం పాపం హరినామమహిమ్నా నశ్య

---

నాయనిన నటుల జేయరాదు. వేదపఠనమున నందఱకు యోగ్యతలేదు. స్వరములు తారుమారయినచో దోషము వాటిల్లును. రామకృష్ణాది నామముల బల్కుటలో నందఱకు యోగ్యతకలదు. అందు స్వరములనుగూర్చిన దోషములేదు. మఱియు రామకృష్ణాది నామములు పరమేశ్వరుని నెంత శీఘ్రముగా తెలియజేయునో "అగ్నిమీళే పురోహితమ్" మున్నగు వేదశబ్దములు అంతశీఘ్రముగా భగవంతుని బోధింపజాలవు. కావున వేదాధ్యయనముకన్న హరినామ కీర్తనమే శ్రేష్ఠమైనది.

65 ప్ర:- హరినామము నుచ్చరించు వారుకూడా దుష్కార్యముల జేయుచునే యున్నారుకదా ఇక లాభ మేమి?

ఉ:- వారు దుష్కార్యముల చేయుదురుగాక! పూర్వమొనర్చిన పాపమంతయు నామప్రభావమున నశించి యేతీరును.

ప్ర:- ఏపాపమొనర్చి మానవుడు పశ్చాత్తప్తుడై,

తీతి నియమాత్, నను యం పాపం కృత్వా పశ్చాత్తప్తః, తస్య హరినామ స్మరణాత్పాపనివృత్తిర్భవతు నామ! యస్తు పశ్చాత్తాపి యథాపూర్వం పాపకారీ కథం తస్య హరినామ స్మరణాత్పాపక్షయ ఇతి చేదుచ్యతే. పౌనఃపున్యేన స్పృశ్యమానం పఙ్కం పౌనఃపున్యేన జలక్షాళనాన్నశ్యత్యేవేతి.

66. వస్తుతస్తు నిరన్తరం కీర్త్యమానం హి హరినామ కర్తుర్మనః పాపసఙ్కల్పాన్నివర్తయత్యేవేతి కృత్వా తస్య యథాపూర్వం పాపాచరణం న సంభవత్యేవ. యది ప్రకృతి వశాదవర్జనీయం పాపం హరినామకీర్తనకారీ కరోతి, తర్హి తత్పాపతూలం హరినామాగ్నినా దహ్యత ఏవ. స చ ముచ్యతే

---

హరినామ ముచ్చరించునో అతనిపాపములు నశించుగాక అట్లుగాక పశ్చాత్తాపముజెందక యెప్పటివలె పాపకార్యము జేయుచుండుచో వానిపాపము లెట్లుపోలగును?

ఉ: కాళ్ళకడిగికొని మరలమరల బురదత్రొక్కి — వాడు మరలమరల నీటితోకడుగుకొనినట్లు, మరలమరల గావించెడి హరినామముచే పాపము నశించుచునే యుండును.

66. వాస్తవమును బరిశీలింప సర్వకాల సర్వావస్థల యందు హరినామము నుచ్చరించువాని మనస్సు పాపకార్యమునకు గడంగదు. కాన నతండు పూర్వమువలె పాపకార్యముల జేయనేచేయడు. ఒకవేళ స్వభావమునకు లోనై ఒక పాపముజేసినను అది హరినామమనెడు అగ్నియందు దూదిపింజవలె భస్మమగును. అథ భక్తుడిట్లు తలచును "నరకో [illegible]

మయా కేనాపి బలాత్కారిత మిదం పాపం న మమ బాధకం భగవద్భక్తస్యేతి. తస్మాచ్ఛుచిరశుచిర్వా సపాపో నిష్పాపో వా పుణ్యవానపుణ్యో వా సర్వోపి జనో హరినామసంకీర్తయేత్. తదేవ కీర్తనం జప ఇత్యుచ్యతే.

67. స చ జపస్త్రివిధః బాహ్యం ఉపాంశుః మానసికశ్చేతి. వాచా స్ఫుటం శబ్దోచ్చారణం బాహ్యః. ఓష్ఠచలనానుమేయ ఉపాంశుః. మనసైవ కృతో మానసికః. తత్ర పూర్వస్మాత్పూర్వస్మాదుత్తర ఉత్తరః. అయమేవ జపయజ్ఞ ఇత్యుచ్యతే. సర్వయజ్ఞోత్తమశ్చాయం. యజ్ఞానాం జపయజ్ఞోస్మీతి గీతావచనాత్. తత్ర హరినామ భూతప్రణవ

---

ధము చేసినట్లు నేనీపాప మొనర్చితిని, భగవత్సేవకుడైన నన్ను ఇది బాధింపజాలదు." అని తలచును. కావున శుచిగానున్నను, అశుచిగానున్నను. పాపియైనను, నిష్పాపుడైనను, పుణ్యవంతుడైనను, పుణ్యరహితుడైనను ప్రతిమానవుడు హరినామము నుచ్చరింపవలెను. దానికే జపమని పేరు.

67. ఆ జపము మూడు విధములు. 1. బాహ్యజపము, 2. ఉపాంశు జపము, 3. మానసికజపము. వాక్కుతో స్ఫుటముగా శబ్దముల నుచ్చరించుట బాహ్యజపము. పెదవులు మాత్రము కదలుచు వినబడకుండునది ఉపాంశు జపము. మనసునందే జేయునది మానసిక జపము. అందు మొదటి వానికన్న తరువాతివి శ్రేష్ఠమైనవి. దీనినే జపయజ్ఞమందురు. "యజ్ఞములందు జపయజ్ఞమును నేనే" యని భగవానుడు

జపస్సన్న్యాసివిషయః. రామకృష్ణాది నామజపస్తు గృహస్థాది విషయః. ఏవం జపం కుర్వతః పురుషస్య భగవతి భక్తిర్భవతి.

68. భక్తిర్నామ పూజ్యేష్వనురాగః యతోఽప్రవత్త్యన్తరజం. సత్యాం భగవతి భక్త్యాం కిమలభ్యం పురుషస్య? భక్త్యా హి గోప్యాదయస్స్త్రియోఽపి ముక్తా బభూవుర్భగవన్తం శ్రీకృష్ణం నిషేవ్య. యస్య యత్ర భక్తిస్స తం భజతే హి. యథా మాతరి భక్తిమాన్మాతరం సేవతే. పితరి పితరం గురౌ గురుఞ్చ. తచ్చ భక్తిపూర్వకమీశ్వరభజనం భక్తిశబ్దేన వ్యవహ్రియతే శాస్త్రేషు.

---

గీత యందు ప్రకటించుటం జేసి ఇది శ్రేష్ఠమైన యజ్ఞము. ఓంకార రూపమైన హరినామము సన్న్యాసులును రామకృష్ణాది నామముల గృహస్థులును చేయవలెను. ఇట్లు జపమాచరించు పురుషునకు భక్తి యేర్పడును.

68. పూజనీయుల విషయమున మనస్సు ప్రసరింపఁజెందు ప్రేమకు భక్తియని పేరు. భగవంతునియందు భక్తిగల మానవునకు దుర్లభమైన విషయము లేదు. గోపికాస్త్రీలు శ్రీకృష్ణుని సేవించి భక్తి వలనకదా ముక్తిగాంచిరి. ఎవని యం దెవనికి భక్తి కలుగునో అతడావస్తువును సేవించును. ఎట్లన తల్లియందు భక్తికలవాడు తల్లిని సేవించును. పితృభక్తుడు తండ్రిని, గురుభక్తుడు గురువును సేవించును కనుక భక్తిపూర్వకముగా ఈశ్వరుని సేవించుట "భక్తి" యని శాస్త్రములు నిర్వచించెను.

69. సా చ భక్తిస్త్రివిధా. కాయిక వాచిక మానసిక భేదాత్. కాయేన దేవాలయసమ్మార్జనాది కరణం కాయిక భక్తిః. వాచా భగవన్నామగుణకీర్తనం వాచిక భక్తిః. మనసా తచ్చిన్తనం మానసిక భక్తిః. భక్తిః పునర్ద్వివిధా బాహ్యా అభ్యన్తరా చేతి. తత్ర ప్రతిమాదిష్వీశ్వరభజనం బాహ్యాభక్తిః. హృది రామకృష్ణాదికల్పితాకారభజన మాభ్యన్తరభక్తిః. అభ్యన్తరభక్తిః పునర్ద్వివిధా. సాకారా నిరాకారా చేతి. తత్ర సాకారా దర్శితా నిరాకారాపునర్ద్వివిధా సవికల్పికా నిర్వికల్పికాచేతి. తత్ర సవికల్పికా అహంబ్రహ్మాస్మీత్యాదివృత్తి సహితా. నిర్వికల్పికా తు ఆత్మాకారవృత్తి

---

69. కాయికము వాచికము మానసికము అని భక్తి మూడు విధములు. దేవాలయమునందు ఊడ్చుట మున్నగునవి కాయికభక్తి, వాక్కుతో భగవన్నామము గీర్తించుట వాచికభక్తి. మనసుతో భగవంతుని ధ్యానించుట మానసిక భక్తి. మఱియొకదృష్టితో భక్తి రెండువిధములు. బాహ్య భక్తి ఆంతరభక్తి. ఒక విగ్రహమునందీశ్వరుని పూజించుట బాహ్యభక్తి, హృదయమున రామకృష్ణాది దేవతల స్వరూపమును కల్పించుకొని సేవించుట ఆంతరభక్తి ఇదిసాకారమనియు, నిరాకారమనియు రెండు విధములు. అందు పైదెల్పినది సాకారము. నిరాకారము సవికల్పమనియు నిర్వికల్పమనియు రెండు తెఱంగులు. అందు సవికల్పము "అహం బ్రహ్మాస్మి" మున్నగువృత్తితోఁగూడినది. నిర్వికల్పము ఆత్మ

మతీ. అస్యా ఏవ నిదిధ్యాసనమితి వ్యవహారః.

70. ఇయమేవ మయా మోక్షప్రాసాదస్య భక్తిసోపానత్వేన నిరూపితా. తతః ప్రత్యగభిన్న పరమాత్మ సాక్షాత్కారాత్కైవల్యప్రాప్తిః. య ఏవ మనారూఢ భక్తియోగో భక్తిపూర్వకం హరినామకీర్తనకారీ స పునరన్తేపి హరినామ కీర్తయన్ సన్ విష్ణుభక్తై రజామిళ ఇవ వైకుణ్ఠం నీయతే. యద్యప్యేవం కలావివ యుగాన్తరేష్వపి హరినామ మోక్షప్రదం, తథాపి యుగాన్తరేషు తపోధ్యానాది సాపేక్షం కలియుగే తు తన్నిరపేక్షమితి వివేకః.

---

స్వరూపమే వృత్తిగాఁగలది. దీనినే నిదిధ్యాసనమని వ్యవహరింతురు

70. ఈ నిదిధ్యాసనమునే భక్తిసోపానమని మోక్షప్రాసాదములో నేను నిరూపించితిని దీనివలన ప్రత్యగభిన్న పరమాత్మ సాక్షాత్కారముగల్గి మోక్షములభించును. ఇట్టి భక్తియోగము నాచరింపక ఎవఁడు హరినామమును భక్తిపూర్వకముగఁ కీర్తించుచుండునో అతఁడు మరణకాలమున సైతము భగవన్నామమునే కీర్తించుచు విష్ణుభక్తులచే అజామీళునివలె వైకుంఠమునకు గొనిపోఁబడును. పూర్వయుగములందుగూడ కలియుగమువలె హరినామము మోక్షప్రదమైనను అపుడుతపస్సుధ్యానము మొదలగువానితోఁ జేరి హరినామము మోక్షమిచ్చుచుండెను. కలియుగమున మాత్రము తపోధ్యానాదులులేకయే హరినామము ముక్తినిచ్చునని తెలియవలెను

71. ఏవం జనానాం కలియుగే హరినామకీర్తనాదేవ సర్వపాపక్షయపూర్వక పరపదలాభస్య సమ్భవాదహో కలేర్గుణవత్తా! తస్మాత్ బ్రహ్మఘ్నో గురుతల్పగోపి పురుషః స్త్రియా సురాపోపివా శ్రీవిష్ణునామ కీర్తనం సతతం కుర్యాత్. అత ఏవ కేనచిద్భక్తేన భణితమితి– "సంధ్యావన్దన భద్రమస్తు భవతే భోస్నాన తుభ్యన్నమో। భో దేవాఃపితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతామ్॥ యత్రక్వాపి నిషద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః। స్మారంస్మారమఘం

---

71. ఈ విధముగా హరినామ కీర్తన మాత్రముచేతనే మనుష్యుల సమస్త పాపముల విధ్వంసన మొనర్చి పరమపదము లభింపజేయును గాన కలియుగమెంతయు ప్రశంసార్హమై యున్నది. కావున బ్రహ్మహత్యామహాపాతకి గురుతల్పగుడు స్వర్ణాపహారి మద్యపానము జేసినవాడైనను వీరందఱును హరినామకీర్తనము నిరంతరము చేయవలెను. కావుననే ఒకభక్తుడీవిధముగా చెప్పెను. "ఓసంధ్యా వందనమా నీకు శుభమగుగాక, నేను నిన్ను ఆచరింపజాలను. ఓస్నానమా నీకొరక నమస్కారము. ఓ దేవతలారా, పితృ దేవతలార మీకు తర్పణమొసంగుటకు నే నశక్తుడను క్షమింపుడు. ఎచ్చటనైనను గూర్చొని కంసవిరోధియగు శ్రీకృష్ణుని నిరంతరము స్మరించుచు నాపాపముల తొలగించుకొందును. ఇదిచాలును. మరియెట్టి సంబంధము నాకు వలదు." భగవానుడుగూడ గీతయందు "సర్వధర్మముల బరిత్యజించి నన్నే

శాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం । సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతీతి "బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః । బ్రహ్మణ్యః పుణ్డరీకాక్షో బ్రహ్మణ్యో విష్ణురచ్యుతః" ఇతి. కేశవాయస్వాహా నారాయణాయ స్వాహా మాధవాయస్వాహా ఇతి, వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ । సర్వభూతనివాసోసి వాసుదేవ నమోస్తు తే" ఇతి.

73. కరోమి యద్యత్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామీతి చ స్నానాదౌ హరినామకీర్తనం

---

స్నానమనియు" జెప్పిరి. మానవుడు శుచిగానున్నను అశుచిగానున్నను ఎట్టిదశలోనున్నను శ్రీమన్నారాయణుని స్మరించిన యెడల పవిత్రుడగుననియు "ఆకాశము నుండి యెక్కడ పడినను నీరు సముద్రమునకె పోవునట్లు ఏ దేవతను నమస్కరించినను సర్వాన్తర్యామియగు శ్రీమన్నారాయణునకే చెందు"ననియు "బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః" అనియు 'కేశవాయస్వాహా నారాయణాయ స్వాహా మాధవాయస్వాహా" "వాసనాద్వాసుదేవస్య"యనియు స్నానసంధ్యావందనాదులందు భగవన్నామము ప్రవేశించియున్నది

73. "నేను చేయు సకలకృత్యములను శ్రీమన్నారాయణున కర్పించుచున్నాను" అని స్నానాదికర్మల పరిసమాప్తియందు భగవన్నామములరారుచున్నది. ఇట్లే అన్నిటియందును గ్రహింపవలెను. ఒకటియేమి? గాయత్రీమంత్రి

హి దృశ్యతే. ఏవమన్యత్రాపి ద్రష్టవ్యమ్. కిమ్బహునా! గాయత్రీమన్త్రజపోపి హరినామకీర్తనమేవ. హరిపరత్వాత్తన్మన్త్రస్య. తథా హి యః సవితా సూర్యః నః అస్మాకం ధియః బుద్ధీః ప్రచోదయాత్ దిశతి, తస్య సవితుర్దేవస్య మణ్డలాన్తర్గతమితి శేషః. సమ్బన్ధీతివా. వరేణ్యం వరణీయం తత్ ప్రసిద్ధం భర్గస్తేజః ధీమహి ధ్యాయామః "ధ్యేయస్సదా సవితృమణ్డలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసన సన్నివిష్టః। కేయూరవాన్మకరకుణ్డలవాన్కిరీటీ । హారీ హిరణ్మయ వపుర్ధృతశఙ్ఖచక్ర"ఇతివచనాత్.

74. 'యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం।

---

జపముగూడ హరినామకీర్తనమేయైయున్నది. ఏలయన నామన్త్రము హరినేబోధించుచున్నది. చూడుడు- యః సవితా= ఏసూర్యుడు, నః= మాయొక్క, ధియః= బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరేపించునో, తత్ సవితుః= ఆ సూర్యునియొక్కమండలములోనున్న, వరేణ్యం= వరణీయముగు, శ్రేష్ఠమైన, భర్గః= తేజస్సును, ధీమహి= ధ్యానించుచున్నాము అని గాయత్రీమంత్రార్థము ఈ యర్థమే "ధ్యేయస్సదాసవితృమణ్డల" అనుశ్లోకమునను చెప్పబడినది. సూర్యమణ్డల మధ్యవర్తియై పద్మాసనాసీనుడై హస్తాభరణములు ధరించి కిరీటధారియై శంఖచక్రముల ధరించిన స్వర్ణమయశరీరుడగు శ్రీమన్నారాయణమూర్తి ధ్యానింపదగినవాడని యర్థము.

74. భగవద్గీతలో "ఆదిత్యమండలాంతర్గతమై జగత్తును

యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్' ఇతిగీతా వచనాచ్చ. అథపఞ్చాక్షరషడక్షరాష్టాక్షరాదిమన్త్రాణాం భగవత్పరత్వం స్పష్టమేవేతి తస్మాత్ స్త్రీజాతయో హరినామకీర్తనకారిణ ఏవ. హరినామకీర్తన వశాదమే జనా ముచ్యేరన్నితి కృపయైవ జనేషు ప్రాచీనైః సన్ధ్యావన్దనాది నిత్యం కార్యం న తు పరిత్యాజ్యమ్. తత్పరిత్యాగే చ స చ పతితో భవతీత్యేవ వ్యవస్థాకృతా. తత్ర విశ్వాసార్థఞ్చ మహాన్పరికరజన్య ఉపనయనాదలక్షణః కృతః. లోకానుగ్రహాయ హి మహతాం ప్రవృత్తిః॥

---

ప్రకాశింపజేయు నేతేజస్సుకలదో, ఏ తేజముచంద్రమండలము నందున్నదో, ఎయ్యది యగ్నియందు కలదో ఆతేజస్సు నా సంబంధమైనదని గుర్తింపు" మని శ్రీకృష్ణుడు ప్రబోధించెను. ఇక మంత్రములలో జూచినను పంచాక్షరిగాని షడక్షరి గాని భగవత్స్వరూపమునే బోధించు చున్నవిగాన తిస్త్రీ జాతులు హరినామ సంకీర్తన పరాయణులై యుగుచున్నారు. హరినామ కీర్తనమువలన ముక్తులగుదురను నభిప్రాయము తోడనే సంధ్యావందనాది నిత్యకృత్యము లన్నిటియందును ప్రాచీనులు భగవన్నామమును ప్రవేశపరచి యీకార్యములు తప్పక అనుష్ఠింపదగినవి విడువరాదని హెచ్చరించిరి. వానిని పరిత్యజించిన యెడల పతితుడగునని వ్యవస్థచేయబడెను. దానియందు విశ్వాసము కల్గించుటకై ఉపనయనము మొద లైన గొప్పసంస్కారములను విధించిరి. మహాత్ములు లోకా నుగ్రహము కొఱకు పెక్కు నియమముల నాచరించుచుందురు.

భగవన్నామ కీర్తయతి ఏవం దారిద్ర్యమపి గుణ ఏవ. ధన
మదాన్ధస్య దారిద్ర్యం పరమాఞ్జన మితి భాగవతాత్.
ధనికో హి మదాన్ధత్వేన విహితం న కరోత్యవిహితఞ్చ కురుతే
దరిద్రస్తు మదరాహిత్యాద్ధింసాదికం న కరోతి. కిన్తు హరినామ
కీర్తయన్నేవ భిక్షాటనాదికం కరోతి.

76. తథా అల్పాయురపి గుణ ఏవ. హరినామకీర్తన
కారీ ఖలు స్వల్పేన కాలేనైవ పరమపదం ప్రాప్నోతి. విహాయ
సర్వం సాంసారికం దుఃఖమ్. దీర్ఘమాయుస్తు పరమపదప్రాప్తి
విలమ్బకారిత్వాద్దోష ఏవ. న హి జీవతః పురుషస్య యస్య
కస్యాపి తాపత్రయనివృత్తిర్భవతి. తస్మాదాతపతప్తస్య సలి

---

భగవన్నామము కీర్తించును. ఇట్లే దారిద్ర్యముగూడ మంచిదే.
ధనమదాంధునకు దారిద్ర్యమనునది మంచి కాటుకవంటిదని
భాగవతము చెప్పుచున్నది. ధనికుడు మదాంధతచే తనకు
విధించిన పనుల జేయడు. విధింపబడని కార్యముల జేయును.
దరిద్రుడు గర్వములేనందున హింసాది కృత్యముల సల్పడు.
హరినామము నుచ్చరించుచూ భిక్షాటనమును చేయును.

76 ఇట్లే అల్పాయుష్యము గూడ గుణమేయగుచు
న్నది. హరినామకీర్తన మొనర్చువాడు స్వల్పకాలములోనే
పరమపదమును బడయును. సంసార దుఃఖమునంతయు నతడు
దాటివేయును. దీర్ఘాయుష్యమనునది పరమపదమునుగూర్చి
ఆలసింప జేయును. కాన దోషమేయగుచున్నది. జీవించి
యుండగా ఎవరికిని తాపత్రయము నశించదు. కావున ఎండ

లాశయప్రవేశే ఇవ సంసారదావదగ్ధస్య పరమపదామృత సాగరప్రవేశే విలమ్బస్సన్తాప హేతురేవ. తస్మాదహో కలిర్గుణవత్తా!

77. యే పునరధునాపి "నారాయణేతి మన్త్రోస్తి వాగస్తి వశవర్తినీ। తథాపి నరకే ఘోరే పతన్తీత్యేతదద్భుతం" మితి కులశేఖరోక్తవిధయా హరినామకీర్తన మకృత్వా నరకే పతన్తి, తే ద్విపాత్పశవ ఏవ, యథా చ చతుష్పాత్పశవో మూకా స్తథే మేపీతి. హరినామ కీర్తనరహితా హి మూకాః తస్మాజ్జీవద్దశాయా మేవ మనుష్యేణ హరినామకీర్తనం కర్త

---

లో మునిగిన వానికి కొలనులో జేరుటవలె సంసారదావానల దగ్ధునకు పరమపదమనెడి అమృతసాగరమున ప్రవేశించుటకు ఆలస్యమేర్పడుట కష్టకారణమేయగు చున్నది. కావున కలి కాలము ఎంత సుగుణము.

77. ఇప్పటికిని ఎవరు "నారాయణ అనుమంత్రము న్నది చెప్పినమాటను వినెడి నాలుక ఉన్నది. వినను ఘోరనరకమున మానవుడు పడుచుండుట ఆశ్చర్యముగా నున్న"దని కులశేఖరుడు చెప్పినట్లు హరినామ సంకీర్తనము జేయక నరకముల పాలగుచున్నారో అట్టివారు రెండుకాళ్ళ పశువులే. నాల్గుకాళ్ళ జంతువులు ఎట్లునోరులేనివో వారును అంతే నోరులేనివారు. కాన హరినామ సంకీర్తనము చేయని వారు మూగవారై యున్నారు. కావున మనుష్యులు జీవించి యుండగనే అనగా శరీరపాటవ ముండగనే భగవన్నామము

న్యమ్. “కృష్ణ త్వదీయపదపఙ్కజపఞ్జరాన్తమద్యైవ మే విశతు మానసరాజహంసః। ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః కణ్ఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే” ఇతి కులశేఖరోక్తేః అన్తే కఫవాతపిత్తైః కణ్ఠావరోధే సతి హరినామ కీర్తనాయోగాత్, మనసశ్చ న తదానీం స్వాతన్త్ర్యం, తమసా తస్య పరిభవసమ్భవాత్.

78. అత ఏవ మ్రియమాణస్య పితుర్దక్షిణకర్ణే పుత్రో నారాయణ నామోచ్చారణం కుర్యాదితి విధీయతే. నారాయణ నామ్న ఉచ్చారణమివ శ్రవణమపి హి ముక్తిప్రదం స్మరణ హేతుత్వాత్. ఏవం పుత్రకర్తృక హరినామశ్రవణా

---

జేయవలెను. “ఓకృష్ణా నామనస్సనెడి రాజహంస నీపాద కమలము లనెడి పంజరములో నిపుడే ప్రవేశించుగాక! ప్రాణములు పోవునపుడు వాతపిత్తశ్లేష్మములు కంఠము నడ్డగించి నిన్నుస్మరింప నీయవు” అని కులశేఖరుడు చెప్పెను. జీవితాంతమున వాతపిత్తశ్లేష్మములు కంఠము నడ్డగింపగా హరినామ కీర్తనము చేయుట అసాధ్యము. ఏలయన ఆసమయమున మనస్సు స్వాధీనము తప్పును. అది తమోగుణముచే నావరింప బడి యుండును

78. కావుననే మరణింపనున్న తండ్రికి కుడిచెవిలో పుత్రుడు నారాయణ నామము నుచ్చరింపవలెనని శాస్త్రము విధించెను. నారాయణ నామముచ్చరించుట ఎట్లు ముక్తి హేతువో దానిని వినుటయు అటులముక్తి హేతువగుచున్నది.

దన్తకాలే ముక్తిస్సమ్భవాదేవ "కాశ్యాన్తు మరణాన్ముక్తి రథవా పుత్రసన్నిధౌ" విత్యుచ్యతే. కాశ్యాం హి మరణకాలే విశ్వేశ్వరస్తారకోపదేశం జన్తోర్దక్షిణకర్ణే కరోతి. అత ఏవ కాశ్యాం మ్రియమాణానాం సర్వేషాం దక్షిణకర్ణస్యోపరిస్థితిస్సమ్భవతి.

79. ఏవం మ్రియమాణస్య గళే గఙ్గోదకం యద్వా సాలగ్రామశిలోదకం నిధేయమ్. "భగవద్గీతా కిఞ్చిదధీతా గఙ్గాజలలవకణికా పీతా। సకృదపి యేన మురారి సమర్చా క్రియతే తస్య యమోఽపి న చర్చా" మితి వచనాత్. సాల

---

వినునప్పుడు కూడా భగవంతుడు జ్ఞాపకమునకు వచ్చును. ఈ రీతి పుత్రుడొనర్చిన హరినామము వినినందున అవసానకాలమున ముక్తి సంభవించును గనుకనే "కాశీక్షేత్రమందు మరణించినను పుత్రసమీపమున మరణించినను ముక్తి కల్గునని పెద్దలు చెప్పిరి. కాశీయందు మరణకాలమున జీవుని కుడిచెవి యందు శివుడు తారకమంత్రముపదేశించును. కావుననే కాశీలో మరణకాలమున అందరకు కుడిచెవి పైకివచ్చులాగు పరుండుట సంభవించుచున్నది.

79. ఇట్లు మరణించువాని కంఠములో గంగోదకముగాని సాలగ్రామతీర్థముగాని ఉంచవలెను. "భగవద్గీత కొంచెము జదివినను గంగోదకము ఒకబిందువు త్రాగినను భగవంతుని ఒకపర్యాయము పూజించినను, అతనికి యమునితో పని యుండదని శ్రీశంకరుడు నుడివెను. సాలగ్రామ శిలోదకము

శిథిలీభూతే వ్యాధిగ్రస్తే కళేబరే। ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిరితి వచనాత్. శీర్యత ఇతి శరీర మితి కళేబరవిశేషణమ్ తదలాభే సాలగ్రామతోయం వా సేవేత "అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణ"మితి వచనాత్. తథా వ్రతాన్తేష్వపి హరినామైవ కీర్తయేత్." యస్య స్మృత్యా చ నామోక్త్యా తపఃపూజాక్రియాదిషు। న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే తమచ్యుతమితి వచనాత్.

81. శ్రాద్ధాదిషు విష్ణునామకీర్తనం స్ఫుటమేవ. ఏవం

---

వలెను. "శరీరము శిథిలమైయుండగా దేహము రోగపీడితము అయియుండగా గంగోదకమే ఔషధము. శ్రీమన్నారాయణుడే వైద్యుడు" అని పెద్దలు చెప్పిరి. గంగాజలము లభించని యెడల సాలగ్రామతీర్థమునైనను సేవింపవలెను. అది యకాల మృత్యువును హరించుననియు వ్యాధులన్నిటి నివారించు ననియు శాస్త్రము వచించెను. ఇట్లే వ్రతములాచరించు నప్పుడుగూడ హరినామమునే కీర్తింపవలెను. "ఎవనిని స్మరించుటవల్లనూ, కీర్తించుటవల్లనూ తపస్సు, పూజమున్నగు కర్మలందు సంభవించిన లోపములన్నియు నశించుచున్నవో అట్టి హరిని నమస్కరించుచున్నాను" అని ప్రమాణము కనబడుచున్నవి.

81. శ్రాద్ధాదికర్మలందు హరినామ కీర్తనము స్ఫుటముగా కనపడుచున్నది. ఈ విధముగ నిద్రనుండి లేచిన వి

జాగరాదారభ్య సుప్తిపర్యన్తం యాని విధీయన్తే కర్మాణి శ్రౌతాని స్మార్తాని పౌరాణాని వా. తానిసర్వాణి హరినామ ప్రధానాన్యేవ తచ్చ హరినామ స్త్రీశూద్రాది సర్వసాధారణం శ్వపచాదిష్వపి హరిభక్తసద్భావాత్.

82. విప్రాద్ద్విషడ్గుణయుతాదరవిన్దనాభ పాదారవిన్ద విముఖాచ్ఛ్వపచం వరిష్ఠం। మన్యే, తదర్పితమనో వచనేహితార్థప్రాణం పునాతి స కులం నతు భూరిమాన ఇతి భాగవతాత్। గోపీగజేన్ద్రాదీనామపి హరిభక్తిదర్శనాత్. ఏవం హరినామకీర్తనపరో జనో యది ద్విజస్తర్హి సాలగ్రామం హరి

---

మొదలు మఱల నిద్రించువఱకు వేదశాస్త్రపురాణములచే నన్నికర్మలు విధింపబడెనో అవియన్నియు హరినామము ప్రధానముగా గల్గినవి ఐయున్నవి. ఆ హరినామము స్త్రీశూద్రాదులందరికి సమానమైయున్నది. చండాలురందుగూడ భగవద్భక్తులు గనుపించుచున్నారు.

82. "భక్తిహీనుడై అనేకసుగుణములుగల బ్రాహ్మణునికంటె మనోవాక్కాయముల విష్ణువునర్పించు చండాలుడు శ్రేష్ఠుడని తలచుచున్నాను. అతడే కులము నుద్ధరించునుగాని కులగౌరవమున విఱ్ఱవీగు విప్రుడు ఉద్ధరింపజాలడు." అని భాగవతమున గలదు. గోపికాస్త్రీలు, గజేంద్రుడు మున్నగువారు భక్తులైయుండిరి. ఇట్లే హరినామ కీర్తన పరాయణుడైన మనుజుడు అందును ద్విజుడైనచో సాలగ్రామమందు భగవంతుని పూజించుచుండును. స్త్రీ శూద్రులు

బుద్ధ్యా పూజయేత్. స్త్రీశూద్రాదేస్తు న తత్స్వర్చాధికారః ప్రాజ్ఞస్తు హృద్యేవేశ్వరమర్చయతీతి న తస్య సాలగ్రామాద్యర్చనం విధీయతే

౮౨. అజ్ఞస్య విగ్రహార్చనం విహితమ్. ప్రతిమా స్వల్పబుద్ధీనామిత్యుత్తరగీతావచనాత్-ఇతి. తస్మాత్సర్వోఽపి జనోఽధునా హరినామకీర్తనం కుర్యాత్, హరికథాశ్రవణం కుర్యాత్, హరికథాగానఞ్చ కుర్యాత్. నివృత్తతర్షైరుపగీయమానాద్భవౌషధాచ్ఛ్రోత్రమనోభిరామాత్। క ఉత్తమశ్లోకగుణానువాదాత్పుమాన్విరజ్యేత వినా పశుఘ్నాదితి భాగవ

---

వహాత్రిను సాలగ్రామమును స్పృశింపరాదు. ప్రాజ్ఞుడు మనసునందే ఈశ్వరునర్చించునుగాన నతనికి సాలగ్రామాది పూజలు విధింపబడలేదు.

౮౩. అల్పజ్ఞులకు ప్రతిమ లేర్పరుపబడెనని యుత్తరగీతయం దుపదేశింపబడినటుల నజ్ఞులకు విగ్రహారాధన విధింపబడియున్నది. కావున నీకాలమున మానవులెల్లరు హరినామస్మరణము జేయవలెను. హరికథలు వినుట గానముచేయుటయు కర్తవ్యము. "భవరోగమున కౌషధము రాగద్వేషముల బారద్రోలిన మహాత్ములచే గానము చేయబడునదియు మనోహరము శ్రవణానందకరమునగు భగవంతుని యుదార చరితమును గానముసేయక ఎవడు విరమించును? విరమించినవాడు పశుఘ్నుడే యనవలెను" అను భాగవతవచనమునుబట్టి హరికథలయందు విముఖుడగువాడు పశుఘ్నుడని తెలియు

త్వాద్ధరికథావిముఖః పశుఘ్న ఏవ.

84. న చ నాస్తి హరికథాస్వమృతమితి వాచ్యమ్. వాల్మీకేర్వదనారవిన్దగలితం రామాయణాఖ్యం మధ్విత్యాది వచనేభ్యః హరికథాయా అతీవామృతవత్స్వాదుత్వాత్. హరికథాశ్రవణాస్వాదనసహృదయా ఏవాత్ర ప్రమాణమ్. కిఞ్చ నిపీయ యస్య క్షితిరక్షిణః కథాస్తథాద్రియన్తే న బుధాః సుధామపీతి నలచరిత్రస్యైవామృతవత్స్వాదుత్వే కిమ్పునర్హరిచరితస్య? అపి చ కథానాం స్వాదుత్వం నాయకగుణప్రయుక్తం, కథానాయకస్య శ్రీవిష్ణోర్నిఖిలహేయప్రత్యనీక

---

చున్నది.

84. హరిచరితమం దట్టి యమృత మేమికలదని యందు రేమో! వినుడు "వాల్మీకియొక్క ముఖకమలమునుండిబయలు దేరిన రామాయణమను మధువు (తేనె) కర్ణపుటములతో త్రావినవారికి జన్మజరామరణవ్యాధిని నశింపజేయునను" ఇట్టి శ్లోకములు హరికథను అమృత తుల్యముగా వర్ణించుచున్నవి. వానినివిని యానందించు సహృదయులే యిందుకు ప్రమాణము. "ఏచరిత్రమునువిని దేవత" లమృతమును కూడ నాదరింపలేదోయని నలచరిత్రయందు చెప్పబడెను. నలచరిత్రయే యమృతమువలె నాస్వాదయోగ్యమైన యెడల శ్రీమన్నారాయణచరిత్రమునుగూర్చి చెప్పగలమా! ఇదియుగాక కథలకు రుచి ఎట్లుకల్గుననిన అది కథానాయకునిబట్టి వచ్చును. విష్ణువే కథానాయకుడైనపుడు అనంత కల్యాణగుణ సముద్రుడైన

కల్యాణగుణగణమాహాత్మ్యాదధికత్వం శ్రుతిస్మృతిపురాణాది ప్రసిద్ధమ్ "యథేషవో నివర్తన్తే నాన్తరిక్షక్షితిక్షయాత్। తథా వాచో నివర్తన్తే నాచ్యుతస్య గుణక్షయాత్"

85. "విష్ణోర్ను వీర్య గణనాం కతమోఽర్హతీహ యః పార్థివాన్యపి కవిర్విమమే రజాంసి." "విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచమ్" ఇత్యాదివాక్యాన్యత్రోదాహర్తవ్యాని. అతఏవ మురారిభట్టః ప్రాహ "యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితమ్। గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః। స్వమాత్మానం తత్తద్గుణ గరిమగంభీరమధుర స్ఫురద్వాగ్బ్ర

---

యొమాహాత్మ్యము చరితముయొక్క రుచి వర్ణనాతీతము. భగవద్గుణములు శ్రుతిస్మృతిపురాణములందు సుప్రసిద్ధముగా నున్నవి. "ఆకాశమున విడువబడిన బాణము ఎట్లుదానియంతమును కనుగొనజాలదో అట్లే అనంతగుణాకరుడగు భగవంతుని వర్ణించు వాక్కులు ఆతని యంతమును కనుగొనజాలవు"

85. ఏ-కవి భూమియొక్క రేణువులను లెక్కించునో ఆతడైనను శ్రీమహావిష్ణువుయొక్క గుణములను వర్ణించుటకు సమర్థుడుకాడు" మున్నగు శ్రుతిస్మృతి వాక్యములవలన భగవంతునియొక్క గుణములు అనంతములని తెలియుచున్నది. కావుననే మహాకవి మురారిభట్టు ఇట్లు వచించెను. శ్రీరాముని చరితమును ప్రాచీనకవులంబు వర్ణించిరని వదలినయెడల అంతటి సుగుణసంపద గలిగిన మరియొక నాయకుడు ప్రపంచమున నెవరుగలరు? మృదు మధుర గంభీరవాక్కులు గల

హ్మణాః కథముపకరిష్యన్తి కవయః” ఇతి.

86. నన్వేవమ్ హరికథా స్వస్త్యమృతమ్. ఏవమప్యమృతవత్త్వాదేవ బహుభిర్బహుధా కావ్యనాటకాది రూపేణ హరికథా ఉపవర్ణితా బభూవుస్సన్తి భవిష్యన్తి చ. హరినామోచ్చారణేతు నాస్త్యమృతమితిచేన్నైవమ్. “రామహరే కృష్ణహరే తవ నామ వదామి సదా నృహరే। రామస్మరణాదన్యోపాయం న హి పశ్యామో భవతరణే. సీతావల్లభ దాశరథే దశరథనన్దన లోకగురో। రావణమర్దన రామ నమో భక్తం తే పరిపాలయ మామ్॥” ఇత్యాదిష్వమృతసద్భావాత్.

---

కవీశ్వరులు ఆమహాత్ముని వర్ణనము జేయనిచో నెట్లు కృతార్థులు కాగలరు? అనెను.

86. హరికథలందమృతముండుగాక. కావుననే పలువురు కావ్యనాటకాది రూపమున పలుకబ్బముల రచించియుందురుగాక! రచింతురుగాక! హరినామోచ్చారణము నం దేమియమృతము గలదు? అని కొందరు ప్రశ్నింతురు. అది యసంగతము. ఓరామ ఓకృష్ణ ఓనరసింహా నీనామమునే నిరంతరము కీర్తింతును. భవసాగర తరణమునకు రామనామస్మరణముకన్న మరియొక మార్గములేదు. ఓసీతాపతీ! దాశరథే జగద్గురూ! రావణాంతకా! రామచంద్రా! నీభక్తుని నన్ను గాపాడుము. ఈయర్థముగల రామహరే కృష్ణహరే మున్నగు గేయములు అమృతము నొలుకుచుండును.

కర్ణామృతమేవ. ననుస్త్రీసౌన్దర్యస్య ప్రత్యక్షత్వాత్ స్త్రియా మ్భవతు పురుషస్యానురాగః, హరిసౌన్దర్యస్యాప్రత్యక్షత్వాత్కథం హరావనురాగోదయ ఇతిచేన్నమ్. శ్రీకృష్ణప్రతిమాదిషు హరిసౌన్దర్యస్య ప్రత్యక్షత్వాత్. భాగవతాదిగ్రన్థసిద్ధత్వాచ్చ. ఏవమమృతమయత్వాదేవ రామనామ్న శ్శ్రీశఙ్కర పార్వత్యాదిభిరనవరతం జప్యమానత్వమ్.

౮౯. శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే। సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే ఇత్యాదివచనేభ్యః. ఉక్తఞ్చ శఙ్కరేణ- శ్రీమద్రామమనుస్రితామృత

---

భగవానుడు శతకోటి మన్మథసుందరుడు భగవద్భక్తున కాతని నామధేయము గూడ కర్ణామృతముగ నుండును.

ప్ర:— స్త్రీసౌందర్యము ప్రత్యక్షముగాన పురుషున కనురాగము కలుగవచ్చును. హరిసౌందర్య మప్రత్యక్షము గాన నతనియం దనురాగ మెట్లు కలుగును?

ఉ:— శ్రీకృష్ణ విగ్రహాదులయందు హరిసౌందర్యము ప్రత్యక్షముగనే యుండును. భాగవతాద గ్రంథములందు గూడ ప్రత్యక్షమే. మరియు రామనామము అమృతమయ మగుటచేతనే శివుడు, పార్వతి మున్నగువారిచే నిరంతరము జపింప బడుచున్నది.

89. శ్రీరామరామరామేతి యను రామమంత్రమును శివుడు పార్వతికి ఉపదేశించెను, "ఓప్రియురాలా శ్రీరామ నామము నుచ్చరించుటం జేసి నానాలుక యమృతరసపూర్ణ

రసపానమస్య హహా ప్రియో జిహ్వే మే గరళం సుధాం న
కలయే. చేతస్తు మోక్షః కథమ్? ఇతి. కిఞ్చ రామనామేత్య
వినిశం జపతో హి చిత్తమనాత్మచిన్తనముత్సృజ్య సుఖం తిష్ఠ
తీతి దుఃఖ నివారకత్వాత్సుఖకరత్వాచ్చ హరినామ్నః
మృతమయత్వం యుక్తమేవ.

90. అపి చ యో హరినామ జపతి స కదా చిదపి
తదర్థే పరమాత్మని లగ్నహృదయో భవత్యేవేతి కృత్వా
భగవల్లగ్నచిత్తస్య తస్యామృతపానం దుర్వార మేవ.
అమృతమయో హి భగవాన్పరమానన్దరూపత్వాద్ధృదయా
నన్దకరసున్దరాకారత్వాచ్చ. అతఏవ కేచిదుక్తమ్— "కర

---

మై యున్నది". అని శంకరుడు పార్వతితో ననెను. మరియు
రామనామమును నిరంతరము జపించుచున్న యెడల మనస్సు
అనాత్మ పదార్థముల విడచి సుఖముగానుండును. కాన దుఃఖ
నివారణ మూలమునను సుఖప్రదమగుటచేతను హరినామ
మమృతమయ మనదగియున్నది.

90. మరియు హరినామము నెవడు జపించునో అత
డెక్కడ పర్యాయమైనను పరమాత్మయందు లగ్నహృదయు
డై యుండును. కాన అట్టిచిత్తమునకు అమృతపానము స్వాయ
ముగనే లభించును. భగవానుడు పరమానంద స్వరూపు
డగుటవలనను హృదయానంద సంధాయకుడగుట వలనను
నంతయు నమృతమయము. కావుననే ఒకానొక భక్తుడిట్లు
వచించెను. సంసారమనెడి మరు(ఎడారి)భూమియందు

చరణసరోజే కాన్తిమన్నేత్రమీనే శ్రమముషి భుజవీచి వ్యాకులేఽగాధమార్గే । హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం భవమరుపరిఖిన్నః ఖేదమద్య త్యజామి” ఇతి.

91. సుఖకరమపరం న జాతు జానే హరిచరణస్మరణామృతేన తుల్యమితి చ. అతఏవ “ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రన్థా అప్యురుక్రమే । కుర్వన్త్యహైతుకీం భక్తిమిత్థంభూతగుణో హరిః” ఇతి భాగవతే వ్యాసేనోక్తమ్. న చైవం సాకారేశ్వరభజనమేవసుఖకరమ్మృతంతన్న తు నిరాకారేశ్వరభజనమితి వాచ్యమ్. మనఃక్లేశాభావేన తస్యాతీవ సుఖకరత్వాత్.

---

సంచరించి పరితపించుచున్న నేను, హరియనెడి సరస్సులో మునిగి తేజమనెడి జలమును గ్రోలి తాపమువిడచుచున్నాను హరిసరస్సు ఎట్టిదనిన ఆతని కరచరణములనెడి కమలములను నేత్రములనెడి మీనములును నుండునది.

91 హరిచరణస్మరణామృతముతో తుల్యమగు సుఖకరమైన మరియొక పదార్థమును నేనెఱుగనని యొక భక్తుడు వచించెను. కావుననే ఆత్మయందే రమించెడి ప్రపంచ వాసనలబాలద్రోలిన మహర్షులు సైతము నిష్కారణముగ తనను గొల్చునట్లు చేయు గుణముగలవాడు శ్రీహరియని వ్యాస మహర్షి భాగవతమున వచించెను.

ప్ర:– సాకారేశ్వరభజనమే సుఖకరముగాని నిరాకారేశ్వరుని భజన మెట్లుసుఖకరము?

ఉ:– నిరాకారభజన మింకను క్లేశరహితముగా నుం

మనసస్తూష్ణీంభావో హి పరమానన్దప్రదః. హరిర్హి పరమానన్దరూపః. విజ్ఞానమానన్దం బ్రహ్మేతి శ్రుతేః. తస్య చ స్ఫూర్తిః ప్రశాన్తే మనసి సంభవతి. యదోపరామో మనసో నామరూపరూపస్య దృష్టస్మృతిసమ్ప్రమోషాత్, య ఈయతే కేవలయా స్వసంస్థయా హంసాయ తస్మై శుచిసద్మనే నమః" ఇతి భాగవతాత్. 

92. తస్మాత్సాకారే నిరాకారే వా పరమేశ్వరే పరమానన్దలిప్సునా చిత్తం స్థాపనీయమ్ తస్య చ హరినామగుణకీర్తనశ్రవణాదికం ముఖ్యం సాధనమితి కలౌ సర్వోపి



---

డుటచే మిగుల సుఖకరమైనదని చెప్పఁబడెను. మనస్సు వ్యాపార రహితముగా నుండుటయే కదా యానందకారణము. హరియే పరమానందస్వరూపుఁడు. ఈ విషయమునకు "విజ్ఞానమానందం బ్రహ్మ" అను శ్రుతివాక్యము ప్రమాణము. అట్టి ఆనంద స్ఫురణము మనస్సు ప్రశాంతముగ నున్నప్పుడు సంభవించును. నామరూపాత్మకముగా మనస్సు తానుచూచినది స్మరించినది ఎప్పుడు విడచునో అప్పుడు ఆత్మమాత్రుఁడై పురుషుఁడు శుద్ధస్వరూపుఁడగు పరమాత్మను తనలోఁ దాను చూచును. 

92. కావున సాకారుఁడు లేక నిరాకారుఁడైన పరమేశ్వరునియందు పరమానందమును పొంద దలచినవాఁడు తనచిత్తమునాతనియం దుంచవలెను. అందుకై భగవంతుని నామరూపాదుల కీర్తించుటో శ్రవణముఁజేయుటో ముఖ్యసాధనము

జనః శ్రీహరినామగుణకీర్తనశ్రవణాదికం కుర్యాత్. తత ఇహలోకే పరలోకే వా భక్తిజ్ఞానవశాత్సంసారాన్మోక్ష్యతే.”

ఇతి బెల్లంకొండోపనామక
రామకవికృతం
కలిభూషణమ్
శ్రీహయగ్రీవార్పణమ్
విరోధికృత్ఫాల్గునామావాస్యా.

---

గాన కలికాలమున ప్రతియొకడు శ్రీహరినామ గుణకీర్తన శ్రవణాదికము జేయవలెను. దాని వలన ఈ లోకమునగాని పరలోకమునగాని భక్తిజ్ఞానములు దృఢీభవించి సంసారము నుండి ముక్తిబడయును.

ఇది శ్రీ బెల్లంకొండ రామరాయ
కవీంద్రులచే రచింపబడిన
కలిభూషణము
శ్రీ హయగ్రీవార్పణము
రచించిన తిథి విరోధికృత్ ఫాల్గుణామావాస్య

ఆంధ్రీకరించినది:
సాహిత్యశిరోమణి
ధర్మపురి శేషగిరిశర్మ
సంస్కృత పండితుడు
మునిసిపల్ హైస్కూల్, నరసరావుపేట
ది 1—3—56